# ఆంధ్రసచిత్రవారపత్రిక

సంపుటి : 83 | విజయవాడ | వెల : రు. 4/-

శక సం. 1912 మాఘమాసం 26వ తేదీ

సంచిక : 25 | 15-2-1991 | పేజీలు : 76


## విషయానుక్రమణిక

### సీరియల్స్:


| | | | | | |
|---|---|---|---|---|---|
| మోహినీతాండవం | ... | కొత్త రవీంద్రబాబు | ... | 12 |
| ప్రణయవల్లరి | ... | యర్రగుంట్ల వరలక్ష్మీ దేవి | ... | 24 |
| భారత మహోకవిత్రయం | ... | భాగవతుల సుబ్రహ్మణ్యం | ... | 40 |
| నేత్రధనుస్సు | ... | శాతవాహన | ... | 56 |
| మణికంఠుడు | ... | ప్రయాగ రామకృష్ణ | ... | 72 |


### కథలు:


| | | | | |
|---|---|---|---|---|
| ఎరక్క ఇరుక్కున్నాను | ... | విశ్వనాథ గణపతిరావు | ... | 8 |
| హల్లో! మిస్టర్! హల్లో మిస్టర్! | ... | సర్వా సుబ్రహ్మణ్యం | ... | 22 |
| 'మానవత్వం పరిమళించిన వేళ | ... | వి. లక్ష్మణరావు | ... | 30 |
| ఎదురీత | ... | బొజ్జా సత్యనారాయణ | ... | 48 |
| సూక్ష్మంలో సాక్ష్యం | ... | జి. వి. జి. | ... | 65 |


### శీర్షికలు:


| | | | | |
|---|---|---|---|---|
| కేంద్రప్రభుత్వ అవార్డులు (సంపాదకీయం) | ... | ... | ... | 5 |
| న్యూఢిల్లీ లేఖ | | ... | ... | 6 |
| వీక్లీ పోస్ట్ | ... | ... | ... | 7 |
| డెంటల్ హెల్త్ క్విజ్ | ... | ... | ... | 16 |
| యువతా కవితా | .. | ... | ... | 18 |
| పార్టీ యిస్తున్నారా | ... | ... | ... | 20 |
| ప్రశ్నావళి - | ... | ... | ... | 33 |
| అలనాటి మేటి చిత్రాలు | ... | ... | ... | 34 |
| పిట్సుబర్గులో ఏడుకొండల వెంకన్న! | ... | ... | ... | 35 |
| సినిమా.....సినిమా | ... | ... | ... | 38 |
| రంజన్ నిషాన్ | ... | ... | ... | 46 |
| హల్లో డాక్టర్ నేనేం చెయ్యాలి? | ... | ... | ... | 55 |
| న్యాయ చట్టం | ... | ... | ... | 62 |
| ఒలింపిక్స్‌లో పతకం గెల్చిన ప్రథమ భారతీయుడు | ... | ... | ... | 64 |
| డా. యశోదారెడ్డి కథ ఒక ఉదాహరణ | ... | ... | ... | 70 |
| ఈవారంలో మీ యోగం | ... | ... | ... | 71 |


ముఖచిత్రం : నటి-సంగీతాబిజ్‌లాని
- (ఫొటో : జగ్‌మోహన్)


*Chairman* S. RADHAKRISHNA, *Editor* VEERAJI,
*Printed and Published by* S. NAGESWARA RAO *for Nageswararao Estates Ltd.,*
*at the Andhra Patrika Press, Gandhinagar, VIJAYAWADA-520 003,*
*Phones Editorial 75667, Business 61247, 61248.*


## సంపాదకీయం

ప్రభుత్వం ప్రజలదే అయినా- చాలా సందర్భాలలో-ప్రభుత్వం యిచ్చే అవార్డులు రివార్డులు చాలామందిని ఆశ్చర్యచకితుల్ని చేస్తాయి. ఏటా కేంద్రప్రభుత్వం రాష్ట్రపతి పేరు మీద ప్రకటించే భారతరత్నాది అవార్డులు ప్రతీయేటా రిపబ్లిక్ దినోత్సవానికి ప్రత్యేక ఆకర్షణలు. పోయిన సంవత్సరం దేశంలో అత్యుత్తమ అవార్డు అయిన "భారత రత్న" పురస్కృతిని స్వర్గీయ బి. ఆర్. అంబేద్కర్‌కి శతజయంతి ఉత్సవ సందర్భంగా ప్రకటించి - అప్పటి వి. పి. సింగ్ ప్రభుత్వం తన ప్రత్యేకతని చాటుకున్నది - అంతకు క్రితంఏడాది యీ అవార్డుని ప్రకటించనేలేదు. ఈ అవార్డు యీసారికూడా యెవరినీ వరించదేమో అనుకున్నారుకాని - శ్రీ మొరార్జీ దేశాయ్‌ని యిందుకు తగిన వ్యక్తిగా యెంపికచేశారు- ఇది చాలామందికి ఆమోదయోగ్యమైన నిర్ణయం. శ్రీ మొరార్జీదేశాయ్ దేశ ప్రధానిగావున్నప్పుడు- యీ అవార్డుల మేళాః తిరస్కరించారు. అవార్డులు ప్రకటించనేలేదు - కనుక "భారతరత్న" అవార్డు తననే వరిస్తుందని ఆయన వూహించివుండరు. కాని యీసారి సీనియర్ వృద్ధనాయకులకి వార కేవలం అధికారంలోవున్న పార్టీకిచెందినవార కావల్సిన అవసరం లేకుండానే - మంచి గుర్తింపు లభించింది. అటువంటి విశిష్ట గౌరవాన్ని పొందినవారిలో శ్రీయుతులు ఎన్. జి. రంగా, గుల్జారీలాల్ నందా, కమ్యూనిస్టు నాయకుడు హిరేన్‌ముఖర్జీల వంటి వారున్నారు. సముచితంగా సత్కరింపబడటం సరియైన సమయంలో సత్కరింపబడటం మన భారతదేశంలో ఎందరికో లభ్యంకాని సంగతి కాని యీసారి కొంచెం యెక్కువమందికే యీ రాష్ట్రపతి సత్కారాలు లభించాయి. భారతరత్న వంటి అత్యున్నత అవార్డును విదేశీ ప్రముఖులకు యివ్వడం మొదలుపెట్టిన తరువాత ఏటా - దేశంలో దానికి అర్హులైన వారు లేరనటం - దాన్ని ప్రకటించకుండా- కేవలం దేశం చూడవచ్చిన ప్రపంచ నాయకులకు కేటాయించడం వంటి పనులు ఒక ఆనవాయితీగా జరిగిపోతాయేమోనన్న భయం కొంతమందికైనా కలిగివుంటుంది - కాని చంద్రశేఖర్ ప్రధానిగావున్న గవర్నమెంట్‌లో ఆయన తన గురువుగా భావించి ఆరాధించే - మొరార్జీకి యీ అపురూప గౌరవం లభించటంకూడా సబబుగానే వున్నది. శ్రీ మొరార్జీదేశాయ్‌కి లోగడ - దేశంలోకన్నా ముఖ్యంగా పొరుగున్న దేశం పాకిస్తాన్‌లోనే అత్యుత్తమస్థాయి గుర్తింపు లభించింది. ఆయన పేరున పాకిస్తాను ప్రకటించిన అవార్డును - ఆయన అందుకొనకూడదంటూ అప్పుడు పార్లమెంట్‌లో కూడా చాలా గొడవ జరిగింది. శ్రీ దేశాయ్‌కి అది చాలా మనస్తాపంకూడా కలిగించింది. అయితే స్వయంగా యిటువంటి అవార్డుల ప్రకటనకే వ్యతిరేకి అయిన ఆయన తన

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమ ధర్మపథములకెల్లన్!

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు: దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు సంపాదకులు: శివలెంక శంభుప్రసాద్ (1938-1972)

ఛెయిర్మెన్: శివలెంక రాధాకృష్ణ ఎడిటర్: వీరాజీ ప్రింటర్&పబ్లిషర్: శివలెంక నాగేశ్వరరావు

# కేంద్రప్రభుత్వ అవార్డులు

పేరున ప్రకటించిన అవార్డును గురించి రచ్చకెక్కడం సాధ్యంకానిపని. ఈసారి భారతరత్న అవార్డును ప్రకటించిన తరువాత - విలేఖరులు ఆయనను కలుసుకున్నప్పుడు శ్రీ మొరార్జీ కొంత ప్రసన్నతను - కొంత మనస్తాపాన్ని కూడా వ్యక్తంచేశారు. "అవార్డుల కోసం సేవలు చేయలేదు - దీన్ని యీ అవార్డుకున్న గౌరవందృష్ట్యా తిరస్కరించ వీలులేదు కనుక స్వీకరించామన్న" ధోరణిలో ఆయన మాట్లాడారు. *95*వ సంవత్సరంలో అడుగిడుతున్న శ్రీ మొరార్జీదేశాయ్ శతజయంత్యుత్సవం అతి చేరువలో వుండగా - భారతరత్న కావటం అందరూ హర్షించి ఆయనను అభినందిస్తున్నారు. ముక్కుకు సూటిగాపోయే మనిషి - గాంధేయవాది - విచిత్రమైన నియమనిష్టలుగలవాడు అయిన శ్రీ మొరార్జీదేశాయ్ దేశ ప్రధాని కాగోరి చాలా కాలం ఆ దిశలో ప్రయత్నాలుచేసి సఫలీకృతుడైన దొడ్డమనిషి. యమర్జన్సీ హీరో కూడా ఆయన. శ్రీమతి ఇందిరాగాంధీ - దేశ నియంత అయిపోయే ప్రమాదాన్ని తప్పించిన కృషిలో, శ్రీ మొరార్జీపాత్ర చాలా వున్నది. జనతాపార్టీ వ్యవస్థాపకులలో ఆయన ప్రత్యేకస్థానాన్ని ఎవరూ ముఖ్యంగా శ్రీ చంద్రశేఖర్ కాదనలేరు. "బొంబాయి ప్రధాని"గా వాసికెక్కిన ఆయనను మొదట డెప్యూటీ ప్రధానమంత్రి పదవి మాత్రమే లభించినా - ఇందిరా కాంగ్రెసు వోటమి తరువాత ఏర్పడిన తొలి కాంగ్రెసేతర కేంద్ర ప్రభుత్వంలో ఆయన ప్రధానమంత్రి అయ్యారు. అది భారత చరిత్రలో ఒక మైలురాయి - *1977-79* మధ్య రెండేళ్ళకాలం మాత్రమే

ఆయన వుండగలిగినా కూడా శ్రీ మొరార్జీ ప్రధానమంత్రి పదవిని అతి నిరాడంబరంగా, నీతిదాయకంగా నిర్వహించారు. ఏ పదవిలో వున్నా - ఎందరు ఎన్ని విమ్మారాలాడినా మద్య నిషేధంమీద తన అభిప్రాయాన్ని - మద్యపాన వ్యతిరేకపోరాటంలో తన గురుతర బాధ్యతలను ఆయన విస్మరించలేదు. కేంద్ర ఆర్థిక మంత్రిగా వారు వున్నరోజుల్లో - స్వర్ణనియంత్రణను అతిసాహసంగా ప్రవేశపెట్టారు. ఖాదీపరిశ్రమ విషయంలో ఆయనకి గాంధీజీకి వున్నంత శ్రద్ధాసక్తులున్నాయి. ఆధ్యాత్మిక తత్పరత - పట్టువిడవని సిద్ధాంతాలు ఆయనవి. ఆర్థికవేత్తగా ఎంతగా కొనియాడ దగినవాడో - ఆధ్యాత్మికమూర్తిగా కూడా అంత ప్రశంసింపబడ్డవాడాయన. శ్రీ మొరార్జీ క్రియాశీలక రాజకీయాలు వదిలిపెట్టిన దశాబ్దానంతరం యీ "భారత రత్న" ఆయనకు లభించింది కనుక - దీనిపట్ల ఎవ్వరికీ యెటువంటి సందేహాలు అక్కరలేదుకూడా. "నూటి"కి ఎదురునిలిచి - ముందుకు సాగుతున్న కురువృద్ధుడు శ్రీ మొరార్జీగారు నిండు నూరేళ్లు పూర్తిచేయాలని ఆకాంక్షిస్తున్నాము. ఇదేవిధంగా పద్మవిభూషణ్ పొందిన గుల్జారీలాల్ నందా, ఎన్. జీ. రంగాలుకూడా రాజకీయ చరిత్రలో- సుస్థిరమైన కీర్తి ప్రతిష్టలుగలవారు. మన రాష్ట్రానికి చెందిన శ్రీ రంగా రైతుబాంధవునిగా వాసికెక్కారు. అంతటి సుదీర్ఘమైన పార్లమెంట్ అనుభవంగలవారు మరొకరు లేరన్నా అతిశయోక్తికాదు. శ్రీ ఎన్. జీ. రంగా, శ్రీ నందాగారివలె రెండుసార్లు తాత్కాలిక ప్రధానమంత్రి పదవి నిర్వహించి వుండకపోయి వుండవచ్చును - రాష్ట్రముఖ్యమంత్రికూడా కాకపోవచ్చునుగాని నాటి జవహర్‌లాల్ నుంచి నేటి చంద్రశేఖర్ దాకా యెవరు ప్రధానమంత్రిగావున్నా - శ్రీ రంగాను ప్రత్యేకంగా గౌరవించవల్సివచ్చింది. అందుకు కారణం ఆయన రాజకీయ ప్రజారంగాలలో నిరంతరం చేస్తున్న సేవా, కృషి మాత్రమే "శ్రీ రంగాగారు ప్రథమస్థానానికేగాని, పనికిరారు. అదివారికి ఎవ్వరూ యివ్వరు. ద్వితీయస్థానం వారు స్వీకరించరు" అని వారిని గురించి వున్న ఒక చమత్కారంలోనే శ్రీ రంగాగారి గొప్పతనం వున్నది. రైతులకే కాదు అందరిలోనూ అన్నిరంగాలలోను ఆయనకు గల మన్నన రుజూ అవుతున్నాయి. శ్రీ రంగాగారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాము. పద్మవిభూషణ్ అవార్డు వరించిన మరో ప్రముఖులు శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ. ఆంధ్రమాత ముద్దుబిడ్డ - తమిళమాత పెంపుడుబిడ్డ - జగమెరిగిన సంగీత సామ్రాట్టు - ఆంధ్రులకు అందరికీ యీయనకి లభించిన యీ పురస్కారం గర్వకారణం.

ఈసారి క్రికెట్‌రంగానికి యించుమించు ప్రతీసారిలాగే కేంద్రప్రభుత్వ అవార్డుల వడ్డింపు జరిగింది. అయితే యిక్కడకూడా సీనియర్ వృద్ధ నాయకులకు గుర్తింపు లభించింది. ప్రొఫెసర్ దేవ్‌ధర్, లాలా అమర్‌నాధ్‌లతోపాటు ప్రపంచ రికార్డుల దాహంతో నిర్విరామంగా క్రికెట్ ఆట కొనసాగిస్తున్న శ్రీ కపిల్‌దేవ్ కూడా వుండటం - అభిమానుల్ని, కానివారినీ కూడా సంతృప్తిపరుస్తుంది. శ్రీ దేవ్‌ధర్ పేరిట ఒక 'ట్రోఫీ' వున్నది. ఆయన సజీవంగా "శతజయంతి" (నూరో పుట్టినరోజు సరిగ్గా యీ అవార్డు ప్రకటనకు రెండువారాల ముందు మన సంక్రాంతినాడు జరిగింది) జరుపుకున్న ఘనుడు. ప్రపంచం మొత్తంమీద పేరు సంపాదించిన క్రికెట్ క్రీడాకారుడు. *1906* నుంచి *1945* దాకా ఫస్ట్‌క్లాస్ క్రికెట్ ఆడిన ప్రతిభాశాలి. అలాగే లాలా అమర్‌నాథ్(*81*) భారత్ క్రికెట్‌కి చేసిన సేవలు చాలా ఆలస్యంగా గుర్తింపబడ్డాయి! క్రీడారంగంలోనైనా, ప్రజాసేవారంగంలోనైనా యిటువంటి గుర్తింపుకోసం ఎవ్వరూ తమ కృషి సాగించరుకాని యిటువంటి అగ్రస్థాయి పురస్కారాలు - వారు స్వయంగావచ్చి స్వీకరించగలిగిన శరీరదార్ఢ్యంలోవున్నప్పుడే యిస్తే బాగుంటుంది!

శ్రీ మొరార్జీదేశాయ్ యీ అవార్డును అనారోగ్యకారణంగా స్వయంగావెళ్లి స్వీకరించలేకపోతున్నానని అన్నమాట యీ సందర్భంలో ఉటంకిస్తున్నాము. ఏదియేమైనప్పటికీ యీ ఏడాదికూడా భారతరత్నను నిలిపివేయకుండా శ్రీ మొరార్జీవంటి గాంధేయవాదికీ, ఖాదీ ఉద్యమకర్తకి యిచ్చినందుకు కేంద్రప్రభుత్వాన్ని హర్షిస్తున్నాము.

దేశంలో పద్మశ్రీ, పద్మభూషణ్ అవార్డుల సంఖ్య ఏటా ఎక్కువ అవుతున్నది. అవి పొందిన అందరినీ పేరు పేరునా అభినందిస్తున్నాము. అయితే క్రీడారంగంలో యిస్తున్న యిటువంటి పురస్కారాలను క్రీడాభూషణ్ లాంటి పేర్లతో వేరుచేసి - అలాగే సినిమా రంగం అవార్డులను వేరుచేసి యిచ్చినట్లయితే "ఇంతమందికి అవార్డులా?" అన్న మాట వుండదు. ○

# చంద్రశేఖర్ గారి స్నేహితులెటువంటివారు?

న్యూఢిల్లీ లేఖ

డా.జయ్‌దుబాషీ



తగని సమయంలో, తగని స్థానంలో తగని వ్యక్తిగా శ్రీ చంద్రశేఖర్ ని చరిత్ర చిత్రీకరిస్తే శ్రీ చంద్రశేఖర్ చరిత్రహీనులవుతారు. శ్రీ చంద్రశేఖర్ ఈరోజు తాను ఉన్న స్థానానికి చేరుకోవడానికై ఎన్ని తప్పుడు పనులు చేయవచ్చో అన్నీ చేశారు-తన స్వంత పార్టీలో చీలిక తెచ్చారు. పార్లమెంటు సభ్యులను తస్కరించడానికి డబ్బు వినియోగించారు. ఈరోజు ఏ గౌరవనీయులైన సమాజంలో ఉండతగని చంద్రస్వామి, సూర్యదేవ్ లాంటి వ్యక్తులను తన కోసం తన పనికై వాడుకుంటున్నారు.

కొన్ని పుస్తకాలలో ఒక ఫుట్ నోట్ లోకి ఎక్కడం తప్ప వీటన్నిటి మూలంగా శ్రీ శేఖర్ సాధిస్తున్నదేమిటి? నాకు తెలిసినంత వరకు మన ప్రధానమైన సమస్యలు వేటికీ ఆయన పరిష్కారమార్గం చూపలేదు. ప్రప్రథమంగా ఆయనలో నీతిలేదు. ఆయన మంత్రివర్గంలో కూడా నీతి లేదు. ఆయన రాజకీయ అధికారం సున్నా, అది సున్నా అని ఆయనకీ తెలుసు. పార్లమెంటులో 50మంది సభ్యులు కన్నా మించి బలంలేని, మొత్తం బలంలో పదవ వంతు బలం కన్నా తక్కువ ఉన్న పార్టీ నాయకునికి పార్లమెంటు లోపల కానీ, వెలుపల కాని బలం కలిసి ఉండదు. వ్యక్తిగత ప్రాతిపదికపై ప్రధానమంత్రి అనేవాడికి నిస్సందేహంగా కొంత అధికారం చెలాయించే సత్తా కలిగి ఉంటాడు. కానీ అలాంటి అధికారం చూపగల వ్యక్తిత్వం కానీ, ఆకర్షణ కానీ శేఖర్ కి లేవు. ధీరేంద్ర బ్రహ్మచారి, చంద్రస్వామి వంటి వ్యక్తులతో తమ పూర్తి సమయాన్ని గడిపే వ్యక్తికి భారతదేశంలో గౌరవం లేదు.

## శేఖర్ మిత్రులు

శ్రీ శేఖర్ అటువంటి వ్యక్తులతో ఎందుకు చేరుతున్నారు? వారందరికీ ఈయనంటే ఇష్టం గనుక, ఆయనకి వారంటె ఇష్టం గనుక ఈయనేదో కొంచెం చేస్తుంటారు. సంవత్సరాలుగా శేఖర్, ఆయన మనుషులు తాము అన్ని ప్రశ్నలకు జవాబు ఇవ్వగల నేర్పరులుగా ప్రజల్లో ఒక విధమైన అభిప్రాయాన్ని కలుగజేస్తూ వచ్చారు. అవినీతి? శేఖర్ అండ్ కో దగ్గర పరిష్కారం వుంది. నిరుద్యోగ సమస్యా? వారి దగ్గర రెడీమేడ్ సిద్ధాంతం వుంది. దాడులకా? వారి దగ్గర అన్నిటికీ జవాబులు ఉన్నాయి. ప్రపంచ వ్యాప్తంగా వామపక్షాలు చెబుతున్నదీ అదే-తాము మాత్రమే రాజ్యాన్ని నడుపగలశక్తి ఉన్నవారమని. శ్రీ జ్యోతిబసు పశ్చిమ బెంగాల్ లో అదే చెప్పారు. శ్రీ రామ్ మనోహర్ లోహియా, శ్రీ మధులిమాయే, తదితరులు చెప్పింది అదే, వారు ఆ విధంగా చేసినట్లు వారి ముఖాలు ప్రసన్నంగా ఉన్నాయి.

వీరి దగ్గర ఏ సమస్యకీ పరిష్కారం లేదు. ఎపుడూ లేదు. ఎప్పుడు కాని ఎక్కడైనా కానీ వామపక్షాలు అధికారం చేపడితే వారితో కలిసి వుంటారు. సోవియట్ కమ్యూనిస్టులను చూడండి. చరిత్రలో ఛెంగిస్ ఖాన్ నుండి ఔరంగ జేబు వరకు ప్రతి నియంత కలుగున్న తరహా అధికారమే డెబ్భైఏళ్లుగా వారు కలిగి ఉన్నారు. వారు దానితో ఏమి చేశారు?



చంద్రస్వామి

వారు దానిని కలిపేశారు. డెబ్భైఏళ్ల తిరుగులేని అధికారం ప్రపంచంలో ఏ సమస్యనైనా పరిష్కరించడానికి చాలు. కాని సోవియట్ లు 1917 నాడు ఎదుర్కొన్న సమస్యలనే ఈ రోజుకీ ఎదుర్కొంటున్నారు. ఇటీవల లభించిన తాజా అంచనాల ప్రకారం సోవియట్ లో తలసరి ఆదాయం ఏడాదికి 5,000 డాలర్లు లేదా అధిక పశ్చిమ దేశాలలోని తలసరి ఆదాయంలో నాల్గవ వంతు ఉన్నది. ఆరు సంవత్సరాల క్రితం చంద్రశేఖర్ వంటి వారితో సహా భారతీయ కమ్యూనిస్టులు వారి సహచరులు ఈ సమాచారం విని నవ్వుకొని వుండేవారు కానీ ఈ లెక్కలు సోవియట్ ఆర్థిక వేత్తలు ఇచ్చినవే! శ్రీ మిఖాయిల్ గోర్బచెవ్ తన ప్రసంగాలలో, వ్రాతలలో వీటి గురించి పలుసార్లు ప్రస్తావించారు కూడా.

## జ్యోతిబసు చేసిందేమిటి?

హోచిమన్, స్టాలిన్ విగ్రహాలతో కలకత్తా వీధులలో తీరిక లేకుండా తిరుగుతున్న శ్రీ జ్యోతిబసును చూడండి. ఆయన 1977 నుంచి అధికారంలో వున్నారు. కలకత్తా కాకపోతే పశ్చిమ బెంగాల్ ని మార్చడానికి ఇది చాలినంత సమయం. కానీ పశ్చిమ బెంగాల్ లో కమ్యూనిస్టులు సాధించినదేమిటి? ఏమీ లేదు. కలకత్తాలో ఎదుర్కొంటున్న విద్యుచ్ఛక్తి సమస్యని పరిష్కరించడానికి పదమూడు సంవత్సరాలకాలం చాలదా? కానీ పరిస్థితి అంతకుముందు కన్నా అధ్వాన్నంగా వుంది. ఇంగ్లాండ్ లో మార్గరెట్ థాచర్ కేవలం పదే ళ్లు అధికారంలో వున్నారు. కానీ ఆమె శత్రువులు కూడా ఆమె చాలా గొప్పగా పనిచేశారని అంగీకరిస్తున్నారు. బసు గారు చేసిందేమిటంటే తన స్వంత కొడుకుని వ్యాపారంలో పెట్టి కోటీశ్వరుని చేసుకోవడం. కానీ అందు కోసమే కమ్యూనిస్టులు ముఖ్యమంత్రులుగా చేయబడుతున్నారా?

జ్యోతిబసు ఎందుకు విఫలమయ్యారు? ఇదివరలో స్టాలిన్, కృశ్చేవ్ లు ఎందుకు విఫలమయ్యారో అదే కారణం చేత బసు విఫలమయ్యారు. చేతిలో అధికారం వుంటే నీవు ఏమైనా చేయవచ్చు అని వామపక్షాలవారు విశ్వసిస్తారు. కానీ దానికి ఒక పరిమితి ఉంది. అంతకుమించి రాజకీయ అధికారం నిష్ప్రయోజనమే. అయితే దానిని మీరు వ్యక్తుల్ని అణగద్రొక్కి కారాగారాలకు, శిక్షణా

శిబిరాలకు పంపేందుకు వాడవచ్చు. స్టాలిన్ హిట్లర్ మాదిరిగా లక్షల మందిని హత్య చేయడానికి అధికారాన్ని వాడుకోవచ్చు. మీరు కొరడాను విరిచేయవచ్చు. ప్రజల చేత పని చేయించడం తప్ప మిగతా ఏమైనా మీరు చేయవచ్చు. మీ కంప్యూటర్ల నుంచి ఎటువంటి అద్భుతమైన కార్యక్రమాలు రూపొందించినా లేదా పంచవర్ష ప్రణాళికలు వేసినా పనిచేయను యిష్టపడని ప్రజల నుంచి పని అంటే ఉపయోగమైన పనిని రాబట్టడం సాధ్యంకాదు. తొలి విప్లవోద్రేకం అనంతరం సోవియట్ రష్యాలో వారు చేసినట్లు లేదా బసు గారి పశ్చిమ బెంగాల్‌లో వారు చేస్తున్నట్లు ప్రజలు పనిచేయడానికి తిరస్కరించినప్పుడు మీకెవరూ సహాయపడలేరు.

శ్రీ చంద్రశేఖర్‌కి ప్రణాళికా సంఘంలో పనిచేయడానికి వేరొక యంగ్ టర్క్ వున్నారు. మోహన్ ధారియా చాలా రోజుల నుంచే ప్రణాళికా సంఘంలో లేరు కానీ రాబోవు పంచవర్ష ప్రణాళికలో అదే పాత అంకెలతో విశ్వాసం లేని పాత వాదనలతో ప్రణాళికను నింపడంలో ఎవరూ మోహన్ ధారియాను ఆపలేరు. సోవియట్‌తో సహా



ప్రపంచం అంతా ఒక ప్రణాళికా మార్గం ఏర్పరుచుకోబడింది పెరిస్త్రోయికా అదే, కానీ శేఖర్ అండ్ కో కాదు.

## శేఖర్ పనితీరు!

జాతీయ సమస్యల వ్యవహారంలో చంద్రశేఖర్ వైఫల్యాన్ని కప్పిపుచ్చుకునే ఫార్ములా వాడుకున్నట్లు కనిపిస్తున్నది మీరు ఏమి చెబితే దానికి ఆయన 'సరే' అని అంటున్నారు అంతర్జాతీయ ద్రవ్యనిధి నుంచి మీకు ఋణం కావాలా? అన్ని విధాలా కావాలి అంటారు. ఎవరైనా వెళ్లి దేశానికి ఇప్పుడు కావలసింది అంత[illegible] ద్రవ్య[illegible] ఋణం [illegible]దు [illegible]తే మీరు [illegible] నిజమే? ఋణం ఒడిగే ఏముందు ఏమి[illegible] [illegible]త్తగా వుండాలి అంటారు. ఎవరైనా వెళ్లి ప్రభుత్వరంగ సంస్థలను తీసివేయాలి లేదా పునర్నిర్మించాలని చెబితే ప్రభుత్వ రంగం ప్రయోజనం లేదు. ఆ మొత్తం భావనను పునరాలోచించాలని చంద్రశేఖర్ సమాధానం ఇస్తారు. దానిపై కొందరు వృద్ధ సోషలిస్టు[illegible]దులు చీవాట్లు పెడితే ప్రభుత్వ రంగం ప్రైవేటీకరణ చేయబడదు అని అలా చెపుతూ వుంటారు.

చంద్రశేఖర్‌కి అద్భుతమైన సమయం వుంది- దేశం కుక్కలపరం అవుతూంటే ఆయనకున్న పార్టీలను చూడండి- సమస్యలు గుట్టలవుతున్నాయి-ద్రవ్యోల్బణం, పంజాబ్, కాశ్మీర్, అస్సాం సమస్యలు, అవి ఇంతకు ముందు కన్నా అధ్వాన్నం అవుతున్నాయి మీరు చంద్రశేఖర్‌ని నిందించడానికి లేదు. ఆయన ఎక్కడ వున్నారో ఆయనకే లేదు కానీ ఓటర్లను ఎదుర్కొనటానికి చచ్చేంత భయపడుతున్న ఆయన అసలు బాస్‌కి తెలుసు అయితే ఆ కథ వేరు. ●

## వీక్లీ పోస్ట్

### హల్లో డాక్టర్...

రాధ ముఖచిత్రంతో వెలువడిన సంచికలో 'లాపరోస్కోపిక్ టెక్నిక్' గూర్చి చాలా చక్కని వివరాలు అందించారు. 'హల్లో డాక్టర్ నేనేం చెయ్యాలి' శీర్షిక ద్వారా ప్రతి వారం మాకున్న ఎన్నో సందేహాలను డా. రవీంద్రబాబుగారి సమాధానాలతో వివరంగా తెలుసుకుంటున్నాము డా.ప్రసాద్‌గారు నిర్వహిస్తున్న శీర్షిక 'డెంటల్ హెల్త్ క్విజ్' మాకు ఎంతో బాగా నచ్చుతుంది. ఈ శీర్షిక ద్వారా పళ్ల ఆరోగ్యం, మరియు వాటికి సంబంధించిన ఎన్నో మాకు తెలియని విషయాలను తెలుసుకుంటున్నాము. 'నిత్యజీవితంలో పండ్లు వాడుక' వ్యాసం చదువుతుంటే సాధారణంగా మనం తినే పండ్లలో ఇన్ని మేలు కలిగించే గుణాలు వున్నాయా? అని ఆశ్చర్యపోయామంటే నమ్మండి. పత్రిక ద్వారా ఆరోగ్యానికి సంబంధించిన ఇన్ని వివరాలను అందించిన మా ఎడిటర్ గార్కి ధన్యవాదాలు.

* * *

### అయోధ్య

అందాల తార "రాధ"ముఖచిత్రం 25-1-91 సంచికపై నయనానందకరంగా ఉంది. ఈ వారం సంపాదకీయం 'సయోధ్య మార్గంలో అయోధ్య'లో చాలా చక్కని వివరాలను గూర్చి చెప్పారు. దేశాన్నే కుదిపేసిన ఈ సమస్యకు సామరస్యంగా పరిష్కారమార్గం లభిస్తుందనే ఆశిస్తున్నాము. పత్రికను ' అందుకుంటూనే మేము చదివే శీర్షిక మీ సంపాదకీయం. ప్రతివారం ఈ శీర్షిక ద్వారా చాలామంచి విషయాలను విపులంగా తెలుసుకుంటున్నాము.

ఎం. రామమూర్తి
(న్యూబోయిగూడ)

### ఒక సందడి

"ఇప్పుడు మా దూరదర్శన్ కేంద్రం ద్వారా నిర్మింపబడిన 'సంసారంలో సందడి' అను హాస్యనాటిక ప్రసారమవుతుంది. దయచేసి మీ టి.వి.లు కట్టెయ్యవద్దని ప్రార్థన"

వి.వి. సీతారామదాసు

### విశ్వకవి మాటలు

మీ సంపాదకీయం అయోధ్యలో రామ జన్మభూమి 1932లో విశ్వకవి రవీంద్రనాథ్‌టాగూరు కొలంబో విశ్వవిద్యాలయములో చెప్పిన మాటలు గుర్తు తెస్తున్నవి అప్పుడు శ్రీలంక ఇండియా నుండి వేరు పడలేదు.

మన భారతదేశము వాల్మీకి రామాయణం ద్వారా దగ్గిర మరియు మనము మనము ఆత్మబంధువులము ఎందుకంటే అయోధ్య రాణి ఇక్కడ అశోక భవనములో వుండి శ్రీలంకను పవిత్ర భూమిగా మార్చినది. ఇటువంటి మహత్తరశక్తి ఒక్క ప్రాచీన సాహిత్యమునకే వున్నది.

చల్లపల్లి వాసుదేవరావు అంపర్తి

### మహిమలు

"ఆంధ్రసచిత్రవారపత్రిక"లో భక్తుల అనుభవములకు సంబంధించి శ్రీ అయ్యప్పస్వామి వారి మహిమలు అను శీర్షిక క్రింద ప్రచురించుచుండిన వ్యాసములు పాఠకులకెంతో ఆనందము కలిగించుచు మిక్కిలి ఆకర్షించుచున్నవి.

భట్టారంసావిత్రి,బి విష్ణుప్రియ
నెల్లూరు ○

# వెతుక్కుంటున్నాను

బ్రేకు లోదిలేసిన బండిలా సర్రున వచ్చిన ముత్యాలు అక్కడి



దృశ్యాన్ని చూసి సడన్ బ్రేక్ వేసినట్టు ఆగబోయి తూలి ముందుకు పడిపోయాడు. ఆ పడటం వంద కేజీల బియ్యం బస్తాలా ముందుకు పడి నేల మీద ఏదో వెదుకుతున్న కానిస్టేబుల్ కనకరాజు మీద పడ్డాడు.

అయినా అతగాడిలో చలనం లేదు. నేల మీద పడి ప్రతి అంచీ నేలనీ అతి జాగ్రత్తగా వెదుకుతున్నాడు. అతడే కాకుండా మరో నలభై మంది కానిస్టేబుల్స్ కూడా అదే పని మీద ఉన్నారు.

కొందరు వెదుకుతుంటే, మరి కొందరు మోకాళ్ళ మీద నడుస్తూ వెదుకు




తున్నారు. మిగిలిన వాళ్ళు దేకుతున్నారు. అది చూసే వాళ్ళకు ఖాకీరంగు గొర్రెలు గుంపుగా మేస్తున్నట్టు, అక్కడ లాఠీ పట్టుకు నిలుచున్న హెడ్డు ఖాకీరంగు కాపరిలా కనిపిస్తున్నారు.

వాళ్ళతో పాటు ముత్యాలూ కొంత సేపు వెదికాడు. కాని అతగాడి కళ్ళకేమీ కనిపించలేదు. దొరకనూ లేదు. దొరకకపోతే పోయింది. అసలు వాళ్ళు వెదుకుతున్న దేమిటో కూడా అర్థం కాలేదు. కాకపోతే పోయింది. ఇంతకూ తనొచ్చిన పని ఎవరితో చెప్పాలి?... ఎవరూ వినిపించుకునే పరిస్థితిలో లేరే.... లేకపోయినా చెప్పి చూడటం తన కర్తవ్యం. కర్తవ్య మేమిటి తన బొంద. ఎనిమిదొందలు పెట్టి కొన్న ఏ క్లాస్ సైకిల్ ఎవడో ఎత్తుకు పోయాడు. ఆ విషయం చెపుదామంటే సామూహికంగా వీళ్ళేదో పారేసుకుని వెదుక్కుంటున్నారు. వీళ్ళనిప్పుడు కదిపితే 'తనే అదేదో దొంగిలించాడని కేసు బనాయించినా బనాయిస్తారు.' అని అనుకుని ముత్యాలు లేచి నిలుచున్నాడు. వెళ్ళి

పోవాలని. కాని అతని కళ్ళు అక్కడి నుండి కదల బుద్ధికాలేదు. తన సైకిల్ పోయినందు కక్కడికి వచ్చినా, అసలు వాళ్ళేదుకుతుం దేమిటో తెలుసు కోవాలన్న ఆతృత ఎక్కువయింది. అందుకే మరలా కర్రా బిళ్ళా ఆట కోసం వంగినట్టు వంగి, ఇందాకటి కానిస్టేబుల్ కనకారావు గారి రేడియో బొక్కు లాంటి చెవిలో మూతి పెట్టి అడిగాడు. కాదు, ముందు పిలిచాడు.

"సార్!...."

పలుకలేదు.

"మీరు వెదుకుతున్న దేమిటి సార్?...."

అబ్బే! ఫలితం లేదు.

"మీరు వెదికే దేమిటో చెపితే నేనూ వెదికి పట్టుకుంటాను సార్!..."

అసలు లాభం లేదు.

"కానిస్టేబుల్ గారూ!..." ఈ సారి అరిచాడు.

ఊఁ హూ!....

ఇక ఆగలేక పోయాడు ముత్యాలు. గబుక్కున ఆ కానిస్టేబుల్ చెవి కొరికేసాడు. దానికా కానిస్టేబుల్ కనకారావు కెవ్వున అరవలేదు. ఏదో ఈగో, దోమో వాలిందనుకున్నాడు కాబోలు నేల మీద ఉన్న ఎడం చేయితో ఆ ఈగనో, దోమనో తోలే ప్రయత్నం చేసాడు. ఆ చేయి ముత్యాలు మూతికి తగిలిరివ్వున నాలు గించీలకు తక్కువ కాకుండా వాచి టి. వి. ఆంజనేయుడి మూతిలా అయిపోయింది.

"బాబోయ్..." అంటూ మూతి పట్టుకుని అలా కూర్చుండి పోయాడు ముత్యాలు. అది చూసిన హెడ్డు లాఠీ ఊపుకుంటూ వచ్చి, "గొర్రెల మధ్యకు మేక పిల్లిలా వచ్చిందా!" అన్నట్టు చూసి, "ఎవర్రా నువ్వు?..." అన్నాడు.

"నేను... మూతి..."

"మూతి కనబడతానే ఉంది వాచి!.... ఇంతకూ నువ్వు..."

"అది కాదు సార్!... నా పేరు ముత్యాలు."

"ఇక్కడ ముత్యాలతో పనిలేదు. ఇక్కడుండేవి రాళ్ళు రప్పలే! ఎల్లు!..."

"అదికాదు సార్!... నా సైకిల్..." అందోళనగా అన్నాడు.

"పోయిందా?"

"అవును సార్!..."

"ఇమానాలే పోతన్నాయ్!.... బోడి సైకిల్ కోసం బెంబేలెత్తి పోతావేట్రా!... ఎల్లి ఎతుక్కో..."

"మరి, మీరు..."

"మాకు తీరిక నేదు!... సూసావుగా!... ఫంక్షనైన పావుగంట నుంచి మావోళ్ళు ఎలా కట్టపడుతున్నారో!... మా సేవ అట్టాటిది!..." లంక పొగాకు చుట్ట తీసి గార పట్టిన పళ్ళ మధ్యకు ఇరికించాడు, హెడ్డు దీమాగా!....

"ఇంతకూ వాళ్ళు వెదుకుతున్నది దేని గురించి సార్!..."

"నీకు తెలవదా?..."

"తెలియదు సార్!..."

"తెలవకపోతే సెప్తాను ఇనుకో!... ఈయాల ఈ కొత్త పోలీస్ స్టేషన్ ఓపెనింగ్‌కి డియస్పీ గారి భార్య ఒచ్చింది. ఆమె ఓపెనింగ్ సేసి స్పీచ్ ఇచ్చి కూర్చునే సరికి ఆమె జుట్టులోంచి సెంప పిన్ను జారి పడిపోయింది. అలా జారి పడిపోవడం మా గుడ్డి మేళం గాళ్ళలో ఒక్కడు కూడా సూడనేదంట!... అందుకే ఈ వెదుకులాట...."

"ఇదేమిటి సార్!... పదిపైన లిస్టు దొరికే చెంప పిన్ను కోసం ఇంత మంది పని మానుకుని ఇలా వెదకడం ఏమీ బాగున్నట్టు లేదు సార్!..."

"తమరు నోరు మూసుకుని ఇక్కడి నుండి ఎల్లండి సార్!... మీ మాటలు గాని మా ఎస్సైగారు ఇన్నారంటే నీతో పాటూ నన్నూ నాలుగు తన్ని తగిలేయ గలడు సార్!..." అని వెటకారంగా అని ముత్యాల వైపు కొరకొరా చూసాడు హెడ్డు.

"మరి నా సైకిల్...."

"రిపోర్టు రాసిచ్చి వెళ్ళవయ్యా!.... నీకు యోగముంటే అదే దొరుకుతాది."

"లేకపోతే సార్!..."

"ఇంతే సంగతులు సార్!...."

"అలా అనకండి సార్!... చాలా కష్టపడి పైసా పైసా కూడబెట్టి ఆ సైకిల్ కొనుక్కున్నాను సార్! అది దొరకక పోతే పది మైళ్ళు నడిచి వెళ్ళి కాంట్రాక్టు పని చేసుకోవడం చాలా కష్టం సార్!..."

"ఓ పని చేయవోయ్ వజ్రాలు..."

"నా పేరు ముత్యాలు సార్!..."

"ఏదో ఒకటి లేవయ్యా!... రోజూ మా స్టేషన్‌కి ఓ సారి వస్తూ ఉండు. మా వేన్ మీద మీ డ్యూటీకి దే బెడతాం!... సరేనా?..."

"మీకెందుకు సార్! అంత శ్రమ!"...

## దత్ అయితేమాత్రం....?



సునీల్ దత్‌ను రేఖ ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీరు త్రాగిస్తోందట. వరకట్న చావులపై దత్ తాను నిర్మిస్తున్న "ఏ ఆగ్ కబ్ బుజేగీ" చిత్రంలో డింపుల్ కపాడియాను తొలగించి రేఖకు ఆ అవకాశం యిచ్చాడు. కాని రేఖ అది దుర్వినియోగం చేస్తోంది. అంతేకాదు ఒకరోజు షూటింగ్‌తో ప్యాచ్ వర్క్ పూర్తవుతుందనుకున్న ఈ చిత్రం గత మూడు నెలలుగా ఆలస్యమవటానికి కారణం రేఖ షూటింగ్‌కు హాజరు కాకపోవటమేనట. దత్‌ను ఈ విధంగా ముప్పతిప్పలు పెట్టటంతో అనవసరంగా రేఖను బుక్ చేసి తలనొప్పి తెచ్చుకున్నానని సునీల్ దత్ బాధపడుతున్నాడు. తప్పేదేముంది?!

## మౌనంలో దాగున్న మనిషి

నేర పరిశోధన పథంలో వినూత్న ప్రయోగాలు
నేర నిర్వహణా క్రమంలో ఎత్తుకుపై ఎత్తులు!
అవయవాల్ని నరికి అంగాల్ని చీల్చి
చంపబడ్డది మనిషో మృగమో తేల్చడానికి
ఫోరెన్‌సిక్ లాబరేటరి ప్రతిభకే పరీక్షగా తయారైంది!
రోడ్లపై స్థాపించిన ఆటవిక రాజ్యంలో
సెంట్రీ తుపాకి సెంట్రీ రక్షణకే అంకితమై
సగటు మనిషి బ్రతుక్కి సెక్యూరిటీ మృగ్యమైంది!
యధాతథంగా
అర్థరాత్రి చీకట్లో పురుడు పోసుకొని
మరో రోజును అంధకారంలో కని
చీకటి పొత్తిళ్లలో పూర్వార్థాన్ని పెరగమంది!
ఎక్కడ కాంతి అవసరమో అక్కడ
వీధిలైటు అలా అలా రెప్పలు ఆడిస్తూ
తనకై తాను ఆరిపోతున్నట్లు
నటించి నటించి కన్నుమూసింది!
పూర్వార్థం ఉత్తరార్థమై ఉరకలెయ్యగా
చీకటి చేసిన నరమేధం
వెలుగును చీకట్లోకి తరుముకెళ్లింది!

గాయాలు తగిలిన చోట నగిషీలు చెక్కబడతాయి
చూపులు నగిషీలపై ఎక్సరేలై నిలబడగానే
చూపులకు ఫ్రేములు కట్టబడతాయి
అన్ని చూపులూ రెటీనాపై ముద్రించబడి
అన్ని చేష్టలూ మెదడున దాచబడతాయి
భయం మనిషిని మౌనంలో దాచుకొంటుంది
మనసు మనిషి మౌనాన్ని భేదించమంటుంది!

-అడిగోప్పుల వెంకటరత్నమ్

కాస్త సిగ్గుపడ్డాడు ముత్యాలు.

"శ్రమనుకుంటే ఎలాగయ్యా మాకు?.. మా పని మీలాంటి వాళ్లను మోసుకు తిరగడమేగా!.. నీ సైకిల్ మేము పట్టి తీసుకొచ్చేవరకూ మాకు తప్పదు కదా?..."

"ఏమిటో సార్! మీరు మాట్లాడు తుందేమిటో నాకర్థం కావడం లేదు".

"అర్థం కాదయ్యా!... మరో రెండు నిముషాలు ఇక్కడే నించున్నావంటే నాలుగంటించి లాకప్పులోకి తోసానంటే అప్పుడర్థమవుద్ది, పూర్తిగా!..."

"ఇది అన్యాయం సార్!... సైకిల్ పోయి నేను బాధ పడుతుంటే!...

"చెంప పిన్ను పోయి మేము మాత్రం బాధపడటంలేదనుకుంటున్నావా?..."

"చెంప పిన్ను, నా సైకిలూ ఒకటే నటండి?"-

"ఓరినీ!... అది ఎవరి పిన్ననుకున్నా వురా?... డియ్యస్పీ గారి భార్యగారిది".

"ఓ పనిచేయండి సార్!..."

చెప్పండి సార్!..." మరి కాస్త వెటకారంగా అన్నాడు హెడ్డు.

"ఓ పిన్ను కొనేసి దొరికిందని ఇచ్చేస్తేనో సార్!..."

"ఆ మాత్రం ఐడియా మాకు రాకపోనే దురా కుర్ర కుంకా!... అసలు ఆమె ఏ రకం పిన్ను పెట్టుకుంది?... దాని పొడవెంత? వెడల్పెంత?... దానికెన్ని వంకీలు ఉన్నాయి?.. ఈ వివరాలెలా తెలుస్తాయిరా?..."

"ఆమె జడలో మరో పిన్ను ఉంటుంది కదా సార్!..."

"అదడిగి తెమ్మంటావా?... బోడి సలహా చెప్పావంటే బొక్కలోకి తోసీగల్ను! .."

"అయినా అంత పెద్ద ఆఫీసర్ భార్య ఆ పిన్నును ఎలా జారేసుకోగలిగింది సార్?..."

"ఏం? ఆఫీసర్ భార్యలు జారేసుకోరని ఎక్కడైనా రాసుందా?..."

"అలా కాదనుకోండి!"... అంటూ అంతలోనే ఏదో గుర్తొచ్చినట్టు, "సార్! చెంప పిన్ను దొరికితే, ఆ తరువాత నా సైకిల్ కేసు టేకప్ చేస్తారా?..." అని అడిగాడు.

"ఓ తప్పకుండా!..." అన్నాడు హెడ్డు. అప్పుడే పిన్ను దొరికిపోయినంత ఆనందంగా!...

ఆ మాట వింటూ ముత్యాలు అక్కడి నుండి వెళ్లిపోయాడు పడిపడిగా అడుగులేస్తూ!...

దేకుతూ, పాకుతూ, ఒంగుతూ కానిస్టేబుల్స్ మాత్రం కాళ్ళు, ముడుకులూ, అరిగిపోయేలా అక్కడంతా వెదుకుతూనే ఉన్నారు.

* * * * *

సాయంత్రం ఆరు గంటలయింది. శీతాకాలం రోజులు గనుక తొందరగా చీకట్లు అలుముకోసాగాయి.

చెంప పిన్ను కోసం వెదుకుతున్న కానిస్టేబుల్సంతా కళ్ళు మూసుకుని ఎక్కడివాళ్ళక్కడ కూర్చుండిపోయారు.

ఏం చేయాలో తోచని హెడ్డు, అప్పటికే వచ్చి పిన్ను దొరకలేదని తెలిసి మండిపడిపోతున్న ఎస్సయ్ పరమేష్ కలిసి కాలు కాలిన పిల్లుల్లా స్టేషన్‌లో అటూ ఇటూ తిరగసాగారు.

ఇంతలో పరుగున వచ్చాడు ముత్యాలు.

"సార్! పిన్ను దొరికింది". ఆనందోత్సాహంతో అంటూ పిన్ను చివర పట్టుకుని పైకెత్తి చూపించాడు.

లక్ష రూపాయల ఇనామ్ ఉన్న టిక్కెట్టు దొరికినంత ఆనందంతో అంతా ముత్యాలు చుట్టూ చేరారు.

"నాకివ్వు!" అంటే "నాకివ్వు!" అంటూ పార్టీ టికెట్టు కోసం ఎగబడే రాజకీయ అభ్యర్థుల్లా పోటీపడసాగారు. ఆ హడావిడికి ఎస్సయ్, హెడ్డు స్టేషన్

లోంచి బయటకొచ్చారు.

"ఏమిటి?... ఏమిటయింది?..."

"పెన్ను దొరికింది సార్!..."

ఆ మాట వింటూనే ఎస్సయ్ పరమేష్ ముందుకొచ్చి ముత్యాలు చేతిలో పెన్ను తీసుకుని చూసి. "వెరీ గుడ్!... ఎక్కడ దొరికింది?" అని అడిగారు.

"రోడ్డు మీద సార్!... అనవసరంగా ఇక్కడ వెదికారు". అంటూ నవ్వాడు ముత్యాలు.

"ఓ. కే. డియ్యెస్పీ గారితో చెప్పి నీకు ప్రమోషన్ ఇప్పిస్తాను".

"నాకా?... నేనీ డిపార్టుమెంటువాణ్ని కాను సార్!..."

"కాకపోతే రప్పిస్తామయ్యా!..."

"అలాగే సార్!..." అంటూనే ముత్యాలు ఆనందపడిపోతూ ఆశపడి పోయాడు. ఆ ఆశతోనే స్వప్న లోకాల్లోకి తేలిపోయాడు. మట్టి కంపు కొట్టే కాంట్రాక్టు పని మానేసాడు. డ్రిల్ నేర్చేసుకున్నాడు. లాఠీ పట్టేసుకున్నాడు. ఊరు మీద పడి మామూళ్ళు వసూలు చేస్తేసి మానభంగాలకి తయారయిపోయాడు. రాడికల్స్‌ని బంధించి వాళ్ళను లాకప్ మరణాలుగా జమ చేసేస్తున్నాడు.

అప్పుడే!...

ఎక్కడో "ధన్"మని ఓ గన్ పేలి గుండు దూసుకొచ్చి ముత్యాలు తలలోంచి దూసుకు పోయింది.

బేరుమన్నాడు ముత్యాలు.

"నాకొద్దు బాబోయ్! ఈ ఉద్యోగం!"

చెంప పెన్ను పట్టుకుని ఊబిక్కుతున్న ఎస్సయ్ వెనుతిరిగి, "ఏంటయింది వాడికి?..." అన్నారు.

## ఎరక్క ఇరుక్కున్నాను

"ఏమో సార్!... ఉద్యోగమొద్దంటున్నాడు".

"అయితే పొమ్మనండి!..."

"నా సైకిల్ సార్!..."

"నేను మరలా వచ్చేవరకూ ఉండు. సరైన సైకలిప్పిస్తాను". అన్నాడు ఎస్సయ్. జీప్ ముందుకెళ్ళిపోయింది.

★ ★ ★ ★ ★

"వాట్!... దిసీజ్ మై పెన్?..." ఎస్సయ్ పరమేష్ చేతిలో చెంపపిన్నును చూసి ఆశ్చర్యంగా అడిగింది, డియ్యెస్పీగారి భార్య.

"ఎస్! మేడమ్!... అక్కడ ఇదే దొరికింది".

"ఎవరికి దొరికింది?..."

"నా... నాకే మేడమ్!..." ఈ దెబ్బతో తను సి. ఐ. కావడం ఖాయమనుకున్నాడు ఎస్సయ్!...

"యూ బ్రూట్!... అక్షల్!... టెన్ ఎన్ పి కాస్టు చేసే పిన్ పెట్టుకునే దానిలా నేను కనిపిస్తున్నానా?... లేక నా 'పిన్' దాచేసి ఇది చూపిస్తున్నారా!.."

ఈసారి కంగారుపడి పోయాడు ఎస్సయ్ పరమేష్!...

"నో!... నో మేడమ్! ఇది..."

"ఇది కాదు. నేను పారేసుకుంది, గోల్డెన్ పిన్. అది తీసుకురండి".

ఆ మాట విని త్రుళ్ళిపడ్డాడు ఎస్సయ్ పరమేష్!... 'బంగారపు పిన్నా!... అంటే దాన్ని ఆ కుర్రవెధవ దాచేసి ఈ పిన్ను... వచ్చినంత వేగంగా అక్కడ సెలవు తీసుకుని జీపులో స్టేషన్‌కి వచ్చారు, పరమేష్!..

"ఏడి! ఏడి ఆ పుండాకోర్ రాస్కెల్!..."

ఎదురుగా వచ్చి నించున్నాడు ముత్యాలు నవ్వుతూ!... పెద్దయ్య గారు ఇచ్చింది, తన కిచ్చేయడానికి ఎస్సయ్ గారు తెగ తొందరపడి పోతున్నారనుకున్నాడు.

ముత్యాలు ఎస్సయ్‌కి కనీ కనిపించగానే పడేల్ మని కొట్టి ఫెల్టు పట్టుకుని ఈడ్చుకెళ్ళి లాకప్పులోకి తోసి తాళం వేసాడు. వేసి, హేండ్ స్టిక్‌తో చేతి మీద కొట్టుకుంటూ ... పెద్ద డిటెక్టివ్‌లా ఫోజు పెట్టి, "చెప్పు! బంగారపు చెంప పిన్ను ఎక్కడ దాచావు?..."

"దాన్ని మీ ఆవిడ పారేసుకుందా సార్?"... అన్ని దెబ్బలు తిని అమాయకంగా అడిగాడు ముత్యాలు.

"గోల్డ్ పిన్ దాచేసి, నకిలీ పిన్ ఇచ్చి, ఇప్పుడు ,మా ఆవిడ్ని కూడా పారేసుకోమంటున్నావా?... మర్యాదగా చెప్పు ఆ పిన్నెక్కడ?... లేకపోతే లాకప్ మరణాల సంఖ్యలో కలిపేయగలను".

ఆ మాట వింటూనే తల పట్టుకుని, "బాబోయ్! నాకేమీ తెలియదు. పిన్ను దొరికితే నా సైకిల్ వెతికి పెడతారని ఆశపడి, పది పైసలిచ్చి ఈ పిన్ను కొని దొరికిందని తీసుకొచ్చిచ్చాను. సైకిల్ పోయే, పది పైసలూ పోయే!... పోతే పోయాయి గాని నన్నొదిలేయండి బాబూ!... మీకు దండం పెడతాను!..." అంటూ గొల్లుమన్నాడు.

●

సీరియల్

# మోహినీ తాండవం

డా. కొత్త రవీంద్రబాబు

**ఇంతవరకూ సాగినకథ-23:** ప్రణవనాథ్‌ను హత్య చేసిన మోహిని గురించి ఆరా తీయాలనుకున్న నందికేశ్వర చావుదెబ్బ తింటాడు. ప్లూటోగా పిలువబడే రవితేజను రేఖ కలుసుకుంటుంది. అతనికి చేరువవుతుంది. జైనవిహారంలో వున్న డేవిడ్‌ను రవి, భీంలు కలుసుకుంటారు. అనర్థాలకు కారణమైన మోహినిని మట్టు పెట్టాలన్న ఉద్దేశ్యంతో రవి, రేఖ, భీం-ఉదయ్‌పూర్ వెళ్తారు. కైలాసగిరి సమీపంలో భూగృహంలో వున్న మోహినిని హతమార్చమని ఒక యువతి రవితో చెప్పటం విన్న రణధీర్ ఆ యువతిని ఒకకంట కనిపెడుతుంటాడు.

*(గత సంచిక తరువాయి)*

చంద్రముఖికి వచ్చిన రవి గురూజీ కనపడక పోవడంతో చంద్రహాసను "చంద్రా గురూజీ ఎక్కడ?" అని అడిగాడు.

"ఏమోనన్నా- గురూజీ ఎప్పుడెక్కడ వుంటారో ఎవరు చెప్పగలరు. కొండగాలిలా సద్దు లేకుండా వచ్చి- అలాగే వెళ్లిపోతాడు"

"కొండగాలి వచ్చింది" అన్నాడు గది వాకిలి వద్ద నిలబడ్డ నానాజీ

చిన్నగా నవ్వుతూ తల మీద కొట్టుకున్నాడు చంద్రహాస.

"ఏమిటి? ఏదో దీర్ఘాలోచనలో వున్నావ్ రవీ?"

"ఏం లేదు గురూజీ. నాకు తల్లి తండ్రీ గురువు దైవం అన్నీ మీరే! క్లిష్ట సమస్య ఎదురైనప్పుడు నేను మీ దగ్గరకు రావడం అలవాటే!"

"నాకా విషయం తెలుసు రవీ- నీ ముఖంలో కనపడుతున్న ఆందోళన చూసాక నువ్వేదో పెద్ద సమస్య నెదుర్కొంటున్నావని తెలుస్తుంది!"

"మీకు మోహిని తెలుసా?"

"ప్రపంచంలో ఎంతో మంది మోహినులుంటారు" అన్నాడు నానాజీ నెమ్మదిగా.

"ఉత్తర భారతదేశమంతా దోపిడీలు చేసి అల్లకల్లోలం సృష్టించిన బందిపోటు మోహిని కైలాసగిరి అడవులలో స్థావరం ఏర్పరచుకుందని మీకు తెలుసుగదా!"

"అది అందరకూ తెలిసిన విషయమే"

"డబ్బుకోసం ఎవరిని చంపమంటే వారిని చంపే క్రూర కిరాతక హంతకురాలు మోహిని బందిపోటు మోహిని ఒకటేగదూ?"

"లేదు రవీ- నాకు తెలిసినంత వరకూ డబ్బు కోసం ఎవరినీ చంపేదిగాదు మోహిని!" ఎంతో నియమంగా జీవించేది!

నేను చెప్పేది బందిపోటు మోహిని గురించి. ఆమె వయస్సులో వుండగా దోపిడీలు చేసేదేగాని విచక్షణ లేకుండా వూరికినే ఎవర్నీ చంపేది గాదు, హింసించేదిగాదు. దోపిడి చేసి తెచ్చిన సొత్తుతో ఎంతో మంది నిర్భాగ్యులను ఆదుకునేది.

చివరి రోజులలో అసలు దోపిడీలే మానుకుని ప్రశాంతంగా కాలం గడిపింది

"వృద్ధనారీ పతివ్రత అని సామెతుంది గురూజీ!"

"నువ్వీ విషయంలో పూర్తిగా పొరపడుతున్నావు రవీ!"

"లేదు గురూజీ- డబ్బు కక్కుర్తికోసం ఎందరో మరణానికి కారణ భూతురాలయింది మోహిని. కోట్ల రూపాయల ఆస్తి విధ్వంసం చేసింది. మోహిని దురాగతాలను గురించి చెబితే పెద్ద గ్రంథమవుతుంది"

"పొరపాటు రవీ- మోహిని మరణించి నాలుగేళ్లయింది. మరణించిన మోహిని యీ దురాగతాల నెలా చేస్తుంది?"

"మోహిని అధ్యాయానికి చరమగీతం పాడే సమయం ఆసన్నమైంది"

"రవీ!" ఆశ్చర్యంగా అరిచాడు నానాజ.

"అవును గురూజీ- కైలాసగిరి కొండ మీద విష్ణు ఆలయ సమీపంలోని భూగృహంలో రేపు నేను మోహినిని కలుసుకుంటున్నాను"

"వద్దు రవీ"

"ఏమిటి గురూజీ!"

"తల్లి తండ్రీ లేని నిన్ను చంద్ర, బిందులతో పాటు నా బిడ్డలాగే భావిస్తా వచ్చాను!"

"నా ప్రాణాలకు ముప్పు వాటిల్లుతుందని భయపడుతున్నారా?"

"కన్ను పోయేంత కాటుక ఎందుకు? తనకు మాలిన ధర్మం మొదలు చెడ్డబేరం!"

"ప్రాణాలకు భయపడి మోహినిని కలుసుకోకుండా వుండమంటారా? అది పిరికివాళ్లు చేసే పని"

"మనకు శక్తి యుక్తులున్నాయి గదాని కోరి ఆపద కొని తెచ్చుకోగూడదు."

"గురూజీ!"

"పోనీ ఒక రోజు ఆగు"

"లేదు గురూజీ- ఆడిన మాట తప్పగూడదని మీరే నాకు బోధించారు. అయినా ఒక రోజులో పరిస్థితులు నా కనుకూలం కావుగదా?'

"ఎవరేమిటో తెలుసుకోటానికి సమయం పడుతుంది. మోహిని గురించి నువ్వు అపోహలో వున్నావేమో?!"

"ఏదైనా ముఖాముఖిన తెల్సుకోవడం మంచిది నేను రేపు ఉదయం మోహినిని భూగృహంలో కల్సుకుంటాను అనుమతించండి!'

"నీకు మోహిని ఎవరో తెలియదు. భూగృహం గురించి తెలియదు. ఆఖరుకు నిన్నక్కడకు వెళ్లమన్న అమ్మాయి ఎవరో కూడా తెలియదు. అయినా వెళ్లాలనుకుంటున్నావు!"

" ఎంత వత్తిడి చేసినా రాజస్థానీ యువతి తానెవరో చెప్పలేదు!"

" సాహసించి వెళితే ఎవరైనా వెన్నుపోటుపొడిచో, పిస్తోలు పేల్చో, మెడమీద

తీగవుచ్చు బిగించో చంపే అవకాశం వుంది!"

"జాగ్రత్తగా వుండు గురూజీ."

"నన్ను విసిగిస్తున్నావు రవీ!"

"ఏ పరిస్థితులలోనూ భయపడగూడదని మీరే చెప్పారు గురూజీ!"

"నానాజీ నోరు మెదపకుండా రవి తల మీదుగా గోడమీదనున్న చిత్ర పటాన్ని చూస్తూ వుండిపోయాడు."

"మీ మౌనాన్ని అంగీకారంగా భావిస్తున్నాను గురూజీ. నేను వెళతాను."

"జీవితంలో" ఎదురు దెబ్బలు, ఢక్కాముక్కలు తింటే గాని తెలిసి రాదు రవీ!

"చాలా జాగ్రత్తగా వుంటాను గురూజీ" నానా సాహెబ్‌కు నమస్కరించి వెళ్ళాడు రవి.

"అన్న వెంట వెళ్ళ మంటారా?" చంద్ర అడిగాడు గురూజీని.

"తప్పకుండా వెళ్ళు చంద్రా!"

రాజస్థాని యువతి బహునెమ్మదిగా సామూసాకొర్రుతినడం గమనిస్తున్న రణధీర్... ముత్యాల్లాంటి ఆ పలు వరుస మధ్య నలిగిపోతున్న సామూసా ముక్కదే అదృష్టం! అనిపించింది. ఆ మాటే పైకన్నాడు.

"ముఖేష్‌జీ తొందరపడడం అనుభవ రాహిత్యాన్ని సూచిస్తుంది!" అన్నదా యువతి.

"ఓహో-వండర్‌ఫుల్-చమత్కైన మాట న్నావు కాని ఎదురుగా తేనెల సొనలూరే ఆహార పదార్థాన్నుంచుకొని 'నోరు మూసుకుని వుండమంటే ఎలా?"

"నేనంత అందంగా వున్నానా ముఖేష్‌జీ?"

"ఇంత అందాన్ని నేనెప్పుడూ చూడలేదు!"

"అందాన్నిచూచి వ్యామోహపడ్డం అనర్ధకానికి దారి తీస్తుందేమో ముఖేష్‌జీ."

"ఏమిటి అంటున్నావ్?"

"చరిత్ర చెప్పిన పాఠం గుర్తుతెచ్చుకుంటున్నా"

"చరిత్రా?!"

"సుమారు ఏడువందల సంవత్సరాల పూర్వం ఉదయపూర్ అప్పటికింకా నిర్మించలేదు- మేవారు రాజులు చిత్తూరు రాజధానిగా పరిపాలిస్తుండేవాళ్ళు.

అల్లావుద్దీన్ ఖిల్జీ అనే ఢిల్లీసుల్తాన్ భువన మోహిని చిత్తూరు రాణి పద్మినిని చూడాలనే వెర్రి వ్యామోహంతో చిత్తూరు మీద దండెత్తాడు.

రాజ పుత్ర వీరులు ధైర్యంగా ఎదురొడ్డి అల్లావుద్దీన్ కోట లోపలకు రాకుండా నిలువరించగలిగారు.

"కోటలోకి ఆహార పదార్థాలు చేరకుండా నిలువరించండి" అన్నాడు సుల్తాన్.

"లాభం లేదు. సంవత్సరాలకు సరిపడే గ్రాసం ఆహారధాన్యాలు నిల్వ వుంచుకున్నారు."

"మరి నీళ్ళెక్కడనుండి వస్తాయి-కొంద



# పిల్లలు కథలు చెప్పినప్పుడు ఎందుకు అంత ఆసక్తిగా వింటారు?

పిల్లలకి గాని, పెద్దలకి గాని కొత్త అనుభవాలంటి చాలా యిష్టం. పెద్దలకు ఒక అనుభవం స్వయంగా జరిగితే గాని నమ్మక ముండదు. పిల్లలకి వింటుంటేనే ఆ విన్న విషయాలు అనుభవంలో చేరి

## తెలుసుకోండి!

పోతుంటాయి. అందుకే జాలి కథ చెప్తే ఏడ్పేస్తారు, రాక్షసుడి కథ చెప్తే కలవరిస్తారు కొత్త అనుభవాల్ని పొందే ఆసక్తే కథలు వినే ఆసక్తి. పెద్దవారయిన కొద్దీ అసలు అనుభవాలకీ, ఈ కథానుభ వాలకీ చాలా దూరమౌ తుంది. వింటే ఎక్కని అనుభవాలు చదివితేనూ, ఇంకా వయసు పెరిగిన తరవాత (రంగ స్థలం మీద) చూస్తేనూ ఎక్కుతాయి.

మీగకు"

"కొండమీదే చెరువులున్నాయి. రాణి పద్మిని నివాసం ఉండే మహల్ ఒక కొలనులో నిర్మించారు"

"కోటలోని ఉద్యోగస్తులకు లంచాలిచ్చి లోబరుచుకోండి."

"ఆ ప్రయత్నం ఫలించలేదు!"

"అపారమైన ధనరాసులిస్తాం-కావాలంటే కోరినంత దేశం మేవారు రాజ్యానికి కలుపుతాం- రాణీ పద్మినిని చూడనివ్వమని మహా రాజుకు కబురంపండి!"

"ప్రయోజనం వుండదు!"

"ఎందుకని?"

"రాజపుత్రులు ధన ధాన్యాలు భోగభాగ్యాలు మహా సామ్రాజ్యాల కన్న ఆఖరుకు ప్రాణం కన్న మానం మిన్న అని భావిస్తారు."

"మరి నా కోరిక తీరేదెలా?"

తల వంచుకున్నారు సేనాధిపతులు.

ప్రధాన సైన్యాధిపతి ధైర్యం చేసి" మీకు కావలసినంత మంచి అమ్మాయిలను డేరా వద్దకు పంపుతాం! దిల్ పసంద్‌గా నాట్యమాడే అందగత్తెలను, అపరిమిత అద్భుత సౌందర్య రాసులను, సొగసు కత్తెలను, మాటలతో చేతలతో మిమ్ము ఆకట్టుకునే వన్నెలాడులను మీ ముందుంచుతాం!"

"ఖబడ్దార్" అల్లావుద్దీన్ ఖిల్జీ అరుపుతో సేనాధిపతుల గుండె లవిసిపోయాయి!

"చిత్తూరు చుట్టుపక్కల వుండే పల్లెలన్నీ తగలబెట్టండి కనిపించిన ఆడవాళ్ళను చెరచి చంపివేయండి పంట పొలాలు పాడు చేయండి. పచ్చటి తోటలు నరికివేయండి. దేవాలయాలు విధ్వంసం చేయండి."

"సర్కార్ అందువలన తమకు అప్రతిష్ట వస్తుందేమో"యువసేనాని ధైర్యం చేసి చెప్పాడు.

చివాలున కత్తి దూసి ఎదురు చెప్పిన సేనాని తల నరికివేసాడు అల్లా ఉద్దీన్ ఖిల్జీ. చివ్వున ఎగసి పడింది రక్తం.

శిలా ప్రతిమలలా నిలబడ్డ సేనాధిపతులు నోరు మెదపలేదు.

"ఇంకా నిలబడి వున్నారేం-వెళ్ళిచెప్పిన పని చేయండి" గర్జించాడు అల్లాఉద్దీన్ ఖిల్జీ.

దారుణ విధ్వంసకాండ కొనసాగించారు అల్లాఉద్దీన్ సేనానులు. చిత్తూరు కోట చుట్టూ వున్న ప్రాంతం స్మశానంగా మారింది. జనం గగ్గోలు పెడుతూ పారిపోసాగారు.

అల్లావుద్దీన్ చేయిస్తున్న దుర్మార్గాలు అగడాలు చిత్తూరు కోటలో తెలిసాయి.

పది రోజుల తర్వాత రాయబారిని కోటలోకి పంపాడు అల్లాఉద్దీన్.

"ఒక్కసారి రాణిగార్ని చూడనిస్తే ముట్టడి ముగించి వెళ్ళిపోతా" నన్నాడు.

మంతనాలు సాగాయి.

మారణ కాండ నిలుపుచేయాలంటే మార్గం లేదేమో అన్నారు కొందరు.

మహారాణి పరాయి పురుషుని ముందెలా నిలబడుతుంది అన్నారు కొందరు.

తర్జనభర్జనల తర్వాత అద్దంలో రాణి ప్రతిబింబాన్ని చూచి వెళ్ళమని కబురంపారు.

కోటలో వెలుపలి గదిలో నిలువెత్తు అద్దంలో రాణి పద్మిని ప్రతిబింబం చూచి ముట్టడి చాలించి వెనుదిరిగి వెళ్ళాడు అల్లా ఉద్దీన్.

ఢిల్లీ వెళ్ళిన దగ్గర్నుండీ అతనికి నిద్ర పట్టలేదు ఆకలికాలేదు. బేగంల దరిజేరలేదు.

పెద్ద సైన్యాన్ని పోగుచేసుకుని చిత్తూరు మీద దండెత్తి వచ్చాడు.

పోరాడి పోరాడి అలసి ప్రమత్తులై వున్న చిత్తూరు సైనికులు పరాజితులైనారు.

విజయ నాదాలు చేసుకుంటూ కోటలో ప్రవేశించారు అల్లాఉద్దీన్ సైనికులు. ఆతురతగా పరుగెత్తాడు అల్లాఉద్దీన్.

రాణీవాసం మహలు బయట చితి పేర్చి అందులో దూకి బూడిదగా మారారు పద్మిని ఆమె చెలికత్తెలు!

చెప్పడం ఆపింది రాజస్థానీ యువతి.

"కథ చెప్పి భయపెట్టాలను కున్నావా?" నవ్వుతూ అడిగాడు ముఖేష్‌నని పరిచయం చేసుకున్న రణధీర్.

" నేను చెప్పింది కథ కాదు చరిత్ర చెప్పే నగ్న సత్యం"

సొమూసా, బిస్కెట్లు తిని, టీ తాగారు ముఖేష్, రాజస్థానీ యువతి.

" పాన్ తెస్తారా?"

"ఓ -ఇప్పుడే తెస్తా-మీరావినా"అడిగాడు ముఖేష్.

తలూపింది.

హోటల్ బయటవున్న పాన్ షాప్‌లో పాన్ కట్టించుకు వచ్చాడు ముఖేష్ అయిదు నిముషాలలో

లోపల రాజస్థానీ యువతి లేదు.

"మీకీ చీటీ యిమ్మన్నారు" అంటూ చీటీ యిచ్చాడు హోటల్ సర్వర్.

"రేపు ఉదయం ఏడున్నర గంటలకు కైలాసగిరి కొండమీద విష్ణు ఆలయానికి రండి. ఆలయం వెనుక తోటలోని పర్ణశాలలో ఏకాంతంగా మాట్లాడుకుందాం" అని వుందా చీటీలో!

వెలా తెలా పోయిన రణధీర్ ముఖం మళ్ళీ కాంతివంతమైంది. చేజారిందనుకున్న మైనా కోరి ఆహ్వానిస్తుంది!

ఉషారుగా యీలవేస్తూ వెళ్ళాడు రణధీర్!

* * * *

"జగ్‌నివాస్ ప్యాలెస్ హోటల్ రూము నంబర్ 104 వాకిలి ముందు నిలబడి పరిశీలనగా చూచాడు రవి.

గది తాళం వేసినప్పుడు వెంట్రుకంత సన్నని స్టిక్కర్ అంటించి వుంచాడు. స్టిక్కర్ అలాగే వుంది!

తను లేనప్పుడు ఎవరూ తలుపు గుండా

లోపలకు వెళ్ళలేదు!

తాళం చెవితో తలుపు తెరుచుకుని లోపలకు అడుగెట్టి వెంటనే తలుపు తాళం వేసేశాడు. గది బాత్‌రూం క్షుణ్ణంగా గాలించి చూచి వచ్చి గడ్డం, విగ్గు, బూట్లు,సాక్స్ తీసి వేసాడు.

దుస్తులు తీసి అభ్యంగన స్నానం చేసి తల తుడుచుకొని స్పోర్ట్స్‌డ్రాయర్ మాత్రం వేసుకుని గది మధ్యలోకి వచ్చాడు.

కిటికీలు తెరచి పరదాలు పక్కకు తొలగించి మెత్తటి తివాచీ మీద కూర్చున్నాడు పద్మాసనంలో

అప్పటి వరకూ అతని మనసులో మోగుతున్న వార్నింగ్ బెల్ ఆగిపోయింది.

శరీరంలో బాధ ఎక్కువై మనసు వ్యధ చెందినప్పుడు రవి యోగాభ్యాసం, కరాటే ప్రాక్టీసు వలన సేదదీరుతుంటాడు. ఆ రోజు అదే చేయాలనుకున్నాడు.

మోహిని అధ్యాయం పరిసమాప్తి దగ్గర్లో గంటల్లోకి వచ్చింది! కాని గురూజీకి తాను మోహినితో తారస పడ్డం యిష్టం లేదు.

ఎందుకో ప్రమాదం ఎదురవుతుందని మనసు హెచ్చరిస్తోంది.

బడలిన దేహం వడలిన మనసు మరల శక్తితో పరిపుష్టం అయి మోహినితో తల పడటానికి సర్వ సన్నద్ధం కావాలి.

అందుకే యోగా, కరాటే ప్రాక్టీసు మొదలెట్టాడు.

పద్మాసనంలో పదిహేను నిముషాలుండి నిశ్చలంగా కనులార్పకుండా కిటికీ నుండి లోపలకు వస్తున్న గాలి అలల చిరు సవ్వడి వింటూ మనసు ప్రశాంత పరచుకున్నాడు. క్రమంగా ఉదయారుణ కిరణాలవేడికి మేలుకునే నాగులా కదిలాడు.

భరత నాట్యం చివర అతివేగంగా కదిలే డ్యాన్సర్‌లా నాలుగు భంగిమలు ప్రాక్టీస్ చేసాడు.

ఎగిరి పక్కకు కాలు విసరటం -

పిల్లి ముందుకు దుమికినట్లు వేగంగా

## మోహినీతాండవం

దూకటం -

ఎదర నున్న నాడిమీద ముష్టి ఘాతాలు కుప్పించటానికి ముందు కురకటం -

గుర్రంవెనుక రెండు కాళ్ళతో తన్నినట్లు ఎగిరి రెండుకాళ్ళతో వెనకనున్న ప్రత్యర్థులను తన్నడం.

తర్వాత నాలుగు రకాల ముష్టిఘాతాలను ప్రాక్టీసుచేసాడు.

కత్తివిసిరినట్లు చేయివిసరడం, చేతి కొనను లారీలా మార్చిబాదటం-అరచేయి చివర చిటికినవేలు బారున గట్టిపడిన చర్మం ఎదుటవాడి శరీరభాగాన్ని తాకినప్పుడు ఎంతో బాధ కల్గుతుంది. పేర్చిపుంచిన యిటుకలను విరగ్గొట్టగల శక్తి రవికున్నది.

చేతిని వలయాకారంగా తిప్పి ఎదుటి వ్యక్తి కాలర్ బోన్ విరిగేలా బాదటం.

పిడికిలి పూర్తిగా బిగించి ప్రత్యర్థి దవడ ఎముక విరిగేలా ముష్టిఘాతం యివ్వటం.

నాలుగు రకాల భంగిమలు, నాలుగు రకాల ముష్టిఘాతాలు ఒక్కోటీ వందసార్లు ముందు నెమ్మదిగా తర్వాత అత్యంత వేగంగా ఆ తర్వాత బహునెమ్మదిగా ప్రాక్టీసు చేసాడు.

కరాటే ప్రాక్టీసు పూర్తయినాక వెల్లికిలా తివాచీ మీద పడుకున్నాడు.

గాలి పీలుస్తూ కుడికాలు రెండు చేతులతో పట్టుకొని వంచుతూ పాదాన్ని నుదిటి దగ్గరకు జేర్చాడు. గాలి వదుల్తూ తల పైకెత్తి రెండుచేతుల్తో పట్టుకున్న పాదాన్ని తల పైనుండి మెడ వెనుకకు జేర్చాడు. క్షణం ఆగాడు.



గాలిపీలుస్తూ ఎడమకాలిని రెండు చేతుల్తోపట్టుకొని వంచుతూ ఎడమ పాదాన్ని నుదుటి మీదకు చేర్చాడు గాలి వదుల్తూ తలపై కెత్తి రెండు చేతుల్తో పట్టుకొన్న ఎడమ పాదాన్ని తలపైనుండి మెడవెనుకకు జేర్చాడు.

గాలి పీలుస్తూ కనులు మూసుకుని గాలివదులుతూ రెండుచేతులూ జోడించి గురూజీకి నమస్కరించాడు.

క్రమంగా డస్సిన నాడీ మండలానికి బలం కల్గింది. నిద్రాణంగా వున్న కుండలినీ శక్తి మేల్కొంది. గ్లానిపోయిన కండరాలు కొత్తయి గుర్లు తొడిగిన లతలలా నూతనోత్సాహం, శక్తితో పుంజుకున్నాయి.

రవి యోగనిద్రాసనంలో వుండగా పక్కగదినుండి తలుపు తెరచుకొని లోపల కడుగిడబోయినరేఖ అక్కడే ఆగిపోయింది.

శత్రువులు రవిని కట్టి కిందపడవేసారేమోనని భయపడింది ముందు.

ప్రశాంతంగా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వదులుతున్న రవిని చూసాక అతను యోగాసనం ప్రాక్టీసు చేస్తున్నాడని అర్థం చేసుకుంది

యోగ నిద్రాసన భంగిమలో ప్రియుని చూచినరేఖ మనసులో జలపాతం వురికినట్లు ప్రేమభావనలు ఉరుకులు పరుగులు వేసింది

కాని వివేకం ప్రేమను అదుపులో వుంచి కళ్ళెంవేసింది. మెరిసి పోతున్నది దేహం, కండలు తిరిగిన దేహాన్ని తదేకంగా చూస్తూ శిలా విగ్రహంలా నిలబడిపోయింది "శక్తివంతమైన శరీరంతో అత్యంత శక్తివంతమైన మనసు-అదేరవి విజయ పరంపరకు కారణం" రేఖ ఆలోచనలు భగ్నపరుస్తూ పెద్దగా శబ్దం చేస్తూ అవతలగది తలుపు తెరచుకుని వచ్చాడు భీం.

## హేమ మాలినిమాతృప్రేమ

సన్నీడియోల్ కన్నతల్లి ప్రకాష్ డయోల్ మాత్రమేకాదు, సవతి తల్లి హేమామాలిని కూడా సన్నీడియోల్ సక్సెస్ కోసం (ఘాయల్ చిత్రం సమయంలో) దేవుణ్ణి ప్రార్థించింది. అమరావతిలోని ఒక దేవాలయంలో ఆమె మొక్కుకుంది. 'ఘాయల్' సక్సెస్ కావటంతో, ఆమె పేదలకి దానధర్మాలు చేసింది. అంతే కాదు, ఆ దేవాలయానికి వెళ్ళే పాడుబడ్డ రోడ్లు కూడా బాగుచేయించిందట హేమామాలిని. హేమామాలిని నిజంగా ధర్మేంద్ర, అతని కుటుంబాన్ని ప్రేమించినంతగా తననీ, తన కుటుంబాన్నీ ప్రేమించలేదని జనం అనుకుంటున్నారు. ఒకసారి మెహబూబా స్టుడియోలో వేరు వేరు సెట్స్‌లో సన్నీ, హేమా షూటింగ్స్ జరుగుతుండగా- సన్నీని చూడాలని హేమా వెళ్ళబోయింది. ఈ సంగతి ముందుగా తెలియటంతో, తలనొప్పి కారణం (సాకు) చెప్పి షూటింగ్ ప్యాక్ అప్ చేయించి వెళ్ళిపోయాడు సన్నీడియోల్. హేమామాలిని మీద ఆ కొడుకుప్రేమ అది! ఆ కొడుకు సక్సెస్‌కోసం (సవతి) తల్లి హేమ మాలిని చూపించిన ప్రేమ ఇది! సవతి తల్లులకి మాత్రం కన్నతల్లి ప్రేమ ఉండదా సన్నీ! ఈ సంగతి సన్నీ ఇప్పటికి గుర్తించి ఉండవచ్చు!

- యస్.బి.ఆర్.

# డెంటల్ హెల్త్ క్విజ్ 15

1. నోటి కణజాలం సాధారణంగా వీటి ప్రభావానికి గురి అవుతుంటాయి.
   (ఎ) యాంత్రిక శక్తి (బి) వేడిమి (సి) బాక్టీరియా
2. "రూల్ ఆఫ్ థంబ్" ప్రకారం, రెండు దవుడలు తెరుచుకో దగ్గ దూరం
   (ఎ) 2 ఎం. ఎం. (బి) 1 ఎం. ఎం. (సి) 3 ఎం. ఎం.
3. సరిగా కుదరని కట్టుడుపళ్ల ద్వారా వచ్చే "డెంచర్ హైపర్ ప్లేసియా" వల్ల-
   (ఎ) కాన్సరు రావచ్చు (బి) కాన్సర్ రాదు (సి) నోటి దుర్వాసన.
4. వీటి పరిస్థితిలో వయస్సును బట్టి మార్పు రావచ్చు.
   (ఎ) పళ్ళు (బి) నోటి సున్నిత కణజాలం (సి) దవుడ ఎముకలు – లాలాజలం.
5. వృద్ధులలో లాలాజల స్రావం తగ్గిపోడానికి కారణం.
   (ఎ) లాలాజల గ్రంథులు చిన్నవయి పోవడం (బి) నోరు ఎండిపోవడం వల్ల (సి) లాలాజల గ్రంథులు అతిగా పెరగడం.
6. నోటి కణజాలానికి రేడియేషన్ చికిత్స చేయడం వల్ల-
   (ఎ) ఆకలి తగ్గి పోవచ్చు (బి) ముఖం రంగు మారవచ్చు (సి) పంటి అభివృద్ధిలో మార్పు రావచ్చు.
7. నోరు ఎండిపోవడానికి (జిరోస్టోమియా) యిది కూడ కారణం
   (ఎ) ఎక్స్-రే చికిత్స (బి) జ్వరం (సి) క్షయ
8. దంత చికిత్సా విధానాలలో సాధారణంగా ఎదురయ్యే ఎమర్జన్సీలు.
   (ఎ) ఊపిరి తిత్తులకు సంబంధించినవి (బి) రక్త ప్రసరణకు సంబంధించినవి (సి) రక్తస్రావ సంబంధమైనవి.
9. దంత వైద్యంకు సంబంధించిన పూర్వ రికార్డులు
   (ఎ) జాగ్రత్త పెట్టడం అవసరం (బి) అవసరం లేదు (సి) పెద్ద సమస్య కానేకాదు.
10. ఎక్స్‌రే ఫొటోలు మనకి యీ విధంగా వుపయోగపడ్తాయి.
   (ఎ) భద్రపరచుకోడానికి (బి) రానిపల్లను గుర్తించడానికి (సి) పంటిలో పలి "పిప్పి" పరిస్థితిని తెలుసుకోడానికి.

జవాబులు!
1. (ఎ) (బి) (సి) 2. (ఎ) 3. (ఎ) 4. (ఎ) (బి) (సి) 5. (ఎ) 6. (సి) 7. (ఎ) 8. (ఎ) (బి) (సి) 9. (ఎ) 10. (బి) (సి)

– డా. కె. ఎల్. వి. ప్రసాద్

యోగనిద్రాసనంలో వున్న రవిని అతన్ని ఏదేకంగా చూస్తూ తల తిప్పిన రేఖను మార్చి మార్చి చూచి చిన్నగా నవ్వుతూ " బాబోయ్ వావల్ల గాదు" అన్నాడు భీం.

ఇరవై సెకన్లలో యోగనిద్రాసన భంగిమనుండి మామూలు స్థితికి వచ్చాడు రవి.

"రా భీం-రా రేఖా" నైట్ గౌన్ తొడుక్కుంటూ పిలిచాడు రవి.

సోఫాల్లో కూర్చున్నారు ముగ్గురూ.

"ఏం జరిగింది చెప్పండి?"

జరిగిందంతా చెప్పారు రేఖ, భీం.

"పూర్ణాక్రూడాయిల్స్ అధినేత శేఖర్ పాత ఆయిల్ టాంకర్లు కొని బాగుచేయించేవాడు. వాటికి బాలాస్టాంకులమర్చేవాడు కాంబే వచ్చిన వోడలన్నీ వెనక్కు తిరిగి వెళ్ళేవిగాదు."

సముద్ర తీరానికి కొద్దిదూరంలో సముద్ర గర్భంలో అయిల్ నింపుకున్న వోడలున్నాయి.

శేఖర్ గుండె జబ్బుతో చనిపోయాడు పూర్ణాక్రూడాయిల్ కంపెనీ కైలాసగిరి ఎంటర్‌ప్రైజెస్‌లో కలసిపోయింది.

ఈ విషయాలన్నీ సమన్వయ పరుచుకోవాలంటే మరో సారి కైలాసగిరి దుర్గంలోకి వెళ్ళాలి.

కోట శత్రు దుర్భేద్యం! ఆలోచనలో పడిపోయాడు రవి.

'ఏం చెయమంటావు బాస్?' భీం అడిగాడు

"రేపు సాయంత్రంవచ్చి కనపడు. అప్పటివరకూ ఎటూ కదలకు!"

"మరినేను?" రేఖ అడిగింది.

"రేఖా నువ్వు ఏ పరిస్థితులలోనూ రేపు సాయంత్రం వరకు చంద్రముఖిని వదలి బయటకు రావద్దు. అప్పుడైనా నేను ఫోన్ చేసి రమ్మంటే మాత్రమే రావాలి!"

తలూపింది రేఖ.

దీర్ఘాలోచనలో నిమగ్నుడైన రవిని గదిలో వదలి వెళ్ళి పోయారు భీం రేఖ.

* * * *

రణధీర్ మనసు రెక్కలు కట్టుకుని గాలిలో ఎగుర సాగింది! రాత్రంతా నిదుర లేదతనికి.

అందమైన రాజస్థాని యువతి కోరి రమ్మని ఆహ్వానించింది. అందుకే ఏడుగంటలకు కైలాసగిరి కొండ మీదకు ఎక్కుతున్నాడతను!

త్రిశూల్ ఆజ్ఞప్రకారం రవిని ఖతం చెయ్యాలతను! కాని అయాచితంగా దొరికిన అవకాశాన్ని ఎలావదులుకోగలడు?

ఎంతో మంది కన్ను గప్పి తిరుగుతున్న మోహిని ఆచూకీ తెలియబోతున్నది.

కాని అంతకు ముందు కొంత శృంగార రసం పెదవులకందబోతున్నది.

పడతి కోరి రమ్మంటే వద్దనే మూర్ఖత్వం నాలో లేదు అనుకున్నాడు రణధీర్.

రవి తేజ భూగృహానికి రావటానికి అక్కడ మోహినితో తారసపడటానికి సరిగ్గా అరగంట ముందు ఆలయం వెనుక తోటలోని ధర్మశాలలో కలుసుకుందామంది రాజస్థానీ యువతి.

అరగంట-ముప్పైనిముషాలు-చాలు - వేటకుక్కలా దౌడుతీయటమేగాని నిదానంగా జీవిత రసాన్ని ఆస్వాదించే వీలులేకపోయింది కొన్ని రోజులుగా!

కాసుపోసి బజారులో దొరికే పడుతులతో పొందిన అనుభవం కేవలం శారీరక తృప్తిని చ్చిందేమోగాని మానసికానందాన్నివ్వలేదు.

శరీరం మనసు తృప్తి పడేలా తనివిదీరా అనుభవించి సుఖించబోతున్న సమయంలో మనసు ఎంత సంతోషంగా వుంటుంది?

రాజస్థానీ యువతితో ఆనందం పంచుకొంటూనే ఆమె వద్ద నుండి మోహిని గురించిన సమాచారం సేకరించవచ్చు.

రవితేజ అడిగితే మోహినిని గురించిన సమాచారం చెప్పకుండా దాటవేసింది యువతి.

కాని ఆడదాని శరీరాన్ని మైనపు ముద్దలా మార్చి ఆనందలోకాలకు తీసుకు వెళ్ళగల

నేర్పు తనకున్నది.

ఆనంద పారవశ్యంలో వున్నప్పుడు తప్పక మోహిని గుట్టూ మట్టూ చెబుతుంది యువతి!

ఒక వేళ అప్పుడూ చెప్పక పోతే! నయాన లొంగని వాళ్ళను భయాన లొంగ దీసుకోవటం నాకు వెన్నతో పెట్టిన విద్య!

ఆనందంగా చెప్పకపోతే భయంతో ఏడుస్తూ చెప్పేలా చేస్తాను

ఆ అమ్మాయి నాకు పద్మిని, అల్లాఉద్దీన్ ఖిల్జీల కథ ఎందుకు చెప్పినట్లు?

పద్మిని అల్లాఉద్దీన్‌కు దొరకనట్లు నేనూ నీకు దొరకనని చెప్పడమా?

లేదే!

ఎంతో ఉషారుగా నర్మగర్భంగా మాట్లా డింది ఆమె మాటలు వింటుంటే అనుభవ శాలిని లాగా కనపడింది గాని అమాయకు రాలిలా కనపడ లేదు!

ఆ యువతి చూపుల్లో కనపడ్డ అనురాగం మనసులో నేనంటే యిష్టాన్ని సూచిస్తున్నది

ఇష్టం లేకపోతే అంతసేపు ఎందుకు మాట్లాడుతుంది. అరిచి కేకలు వేస్తే నలు గురూ పోగయ్యేవాళ్ళుగారా!

మరి చెప్పకుండా ఎందుకు వెళ్ళినట్లు?!

వెళితే ఏం చీటీ రాసి యిచ్చి వెళ్ళిందికదా!

## మోహినీతాండవం

నేనంటే ఆ అమ్మాయికి యిష్టం అన్న సంగతి ఇద్దరం కలిసి బజారులో నడిచివెళ్తే అందరికీ తెలుస్తుంది.

ఆ విషయం ఆ అమ్మాయికి యిష్టం వుండి వుండదు!

అందుకే పర్ణశాలకు రమ్మంది!

రాత్రిపూట రమ్మనక ఉదయాన్నే రమ్మ న్నదెందుకు?

కొండమీద విష్ణు ఆలయంలో రాత్రి పూటకరెంట్ లేక చీకటిగా వుంటుంది ఉదయంపూట వాతావరణం ఆహ్లాదకరంగా వుంటుంది!

అందుకే రమ్మంది!

మనసులో వస్తున్న అనుమానాలకు సమాధానాలు చెప్పకుండా కొండదారిన విష్ణు ఆలయం జేరుకున్నాడు రణధీర్.

మూడు శతాబ్దాలనాడు నిర్మించినా విష్ణు ఆలయం చెక్కు చెదరలేదు.

ఆలయంలో పూజా పునస్కారాలు జరు గుతున్నట్లు లేవు.

ఆలయం ముందు భారతప్రభుత్వ ప్రక టన కనపడింది. చారిత్రక ప్రాధాన్యంగల దేవాలయం చరిత్ర- అందులోని శిల్పాలను కట్ట డాలను కాపాడాల్సిన అవసరం- ఒక వేళహద్దు మీరి ఎవరైనా శిల్పాలను గాని కట్టడాలను గాని నష్టపరచినా దొంగిలించినా శిక్షాస్మృతి ననుసరించి వేసే శిక్షరాసి వుంది

దేవాలయం ఆవరణ పరిశుభ్రంగా వుంది. గర్భగుడిలోకి వెళ్ళి భూగృహంలోకి వెళ్దా మన్న ఆలోచన బలవంతంగా అణచుకున్నాడు రణధీర్.

ముందు ప్రమోదం తర్వాత ప్రమాద పూరిత ప్రళయం!

దేవాలయం వెనుక భాగంలోకి వెళ్ళాడు. అందమైన పూలతోట-నయనానందకరంగా పుష్పించిన చెట్లు-దూరంగా కొలను-కొలనులో వికసించిన తామర పూలమీదనుండి పరిమ ళాన్ని మోసుకు వస్తున్న చల్లనిగాలి.

లేమావి చిగుళ్ళు తిని కసెక్కిన గొంతుతో ఎలుగెత్తి అరుస్తున్న కోయిలలు-వంతపాడుతున్న చిలుకలు, గోరింకలు.

అల్లంత దూరాన పర్ణశాల కనపడింది. వెదురు బొంగులతో అల్లినగూడు మీదకు తీగ గులాబీలు పాకి కన్నుల పండువుగా అమరిన ఏకాంత గృహంలా కనపడింది.

పర్ణశాల ముంగిట నిలబడివున్న యువతి ముఖాన చిరునవ్వు "వచ్చారా?" ఆనం దంగా అడిగింది!

[ఇంకా వుంది]

## విశ్వేశ్వరయ్య ది గ్రేట్

చిన్నప్పుడు వీధిదీపాల వెలుగులో చదువుకుని చివ రికి అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన వాస్తు శాస్త్రజ్ఞుడు మోక్షగుండం విశ్వేశ్వరయ్య గురించి ఎన్నో విషయాలు గొప్పగా చెప్పుకుంటారు కర్నాటక రాష్ట్రంలో. ఆయన అప్పటి మైసూరు రాష్ట్రంలో గ్రామ గ్రామాలకూ, విద్యుచ్ఛక్తి సరఫరా చేసేందుకు ముందు ఆ రాష్ట్ర మంతా సర్వే చేశారు. ప్రతిరోజూ కొన్ని గ్రామాలకు వెళ్లేవారు ఆ రాత్రి బసచేసిన చోట టెంట్ వేసు కుని, అందులో ఒక కొవ్వొత్తి వెలిగించి, ఆనాటి సర్వే విషయాల గురించి డైరీ రాసేశారు. ఆ తర్వాత ఆ కొవ్వొత్తిని ఆర్పేసి, తన పెట్టెలోంచి మరో కొవ్వొత్తిని తీసి వెలిగించి, ఇంటికి ఉత్తరం రాసేవారు.

అంటే, మొదటి కొవ్వొత్తి ఆఫీసుది. దానిని సొంత ఉత్తరాన్ని రాసుకోడానికి కూడా వినియోగించేవారు కారన్నమాట. అందుకే తన, సొంత ఖర్చుతో కొన్న రెండోదాన్ని ఉపయోగించేవారు

ఇంత నికార్సయిన వ్యక్తి ఎవరైనా ఉన్నారా? ఉన్నారంటాడు మోమిత్రుడొకడు. వాళ్ల ఊళ్లో ఒక పోస్ట్‌మెన్ విధి నిర్వహణలో ఎంత కరెక్ట్‌గా ఉంటా డంటే, తనకు ఏ ఊరి నుంచి ఉత్తరం వచ్చినా కూడా ముందు "పోస్ట్!" అని అరిచి ఆ ఉత్తరాన్ని ఇంట్లోపడేసి, ఆ తర్వాత లోపలకెళ్లి చదువుకునే వాడట.

అన్నట్టు విశ్వేశ్వరయ్య గురించి మరో విశేషం. ఆయన 99వ ఏట ఉండగా బెంగుళూరు లాల్‌బాగ్‌లోని గ్లాస్‌హౌస్‌లో భారీ ఎత్తున సన్మానం తలపెట్టబడింది. అధ్యక్షత వహించిన అప్పటి భారత ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ఒక జ్ఞాపికను అందజేయడానికి వేదికకు అటు చివరనున్న విశ్వేశ్వరయ్య వద్దకు స్వయంగా రాసాగారు. అప్పుడు విశ్వేశ్వరయ్య-ప్లీజ్! మీరు రాకండి. మీరు మనదేశ ప్రధాని. నేనే వచ్చి స్వీకరిస్తా," అన్నాడు.

అప్పుడు నెహ్రూ "ఈదేశ ప్రధానిగా నేను శాసి స్తున్నా, మీరు కూర్చున్న చోటునుంచే నేను తెచ్చిచ్చే ఈ జ్ఞాపికను స్వీకరించాలి," అన్నారట.

సభలో కరఘోష మిన్నుముట్టింది. జీ.వి.జి

# యువతా! కవితా!

## తల్లి హృదయం

తల్లి హృదయం
వెన్నకన్న మెత్తనిది
మంచుకన్న చల్లనిది
తేనెకన్న తియ్యనిది
కష్టాలకు ఓరిమికలది!

తల్లి హృదయం..
తరగని ధని అది
తిరుగులేనిదది
అమృతం నిండినది
అవధులు లేనిది!!

తల్లి హృదయం.
కష్టాల్లో తల్లడిల్లుతుంది
సుఖాల్లో అమృతం చిలికిస్తుంది!
ప్రతీవార్నీ ఆదుకుంటుంది
ప్రతి ఎడదలో అవుతుంది
మధురిమ!!!

- కంకటి శంకర్ రావు

## త్రాసు

తక్కెట్లో
తన శరీరాన్నే కోసి
తూచాడట శిబి-నాడు
ఒక పావురాయి ప్రాణభిక్షకై!
తనే
తన్మయంగా-కట్నపు త్రాసులో
తూగుతూ యువత-నేడు
ఒక పడతి పతిభిక్ష కోరితే!

- ఏనుగు కిశోర్ బాబు

## అనుకోకు

ఉన్న కష్టాలను
తీర్చడంలో
నీ బాధ్యతను
'బరువు'-అనుకోకు!
ఎందుకంటే-
అందుకోబోయే
సుఖఫలాలకు
అదే
సరైన 'ఎరువు'
కనుక!!

- జి. బాలాజీ

## పరం భావం

పృథ్వి తన్వి అనుభవ చోద్యం
ఉర్వి గర్వి ఖండన సాధ్యం
సిక్తం రక్తం చిందస్తే నేమి
అంతరాంతరాల్లో నిక్షిప్తమైన
మృణాగ్ని ప్రాణాగ్ని స్పర్శ అసాధ్యం
పరం-ధామం పరం-జీవం హననం
దుస్సాధ్యం!

- శింగిసెట్టి సంజీవరావు

## అద్దం

నువ్వు నవ్వితే నవ్వాను
ఏడిస్తే ఏడ్చాను
నాతో పంచుకున్న
నీ కష్టసుఖాలకు
నీతో సమంగా స్పందించాను!
కానీ -



ఈరోజు నీవు
బలహీనతాలోయల్లో కూరుకుపోయి
చెరకుపిప్పిలా
రేపటి శవంలా వచ్చిన నిన్ను
నిన్నులా చూపినందుకేనా నేస్తం
నా హృదయాన్ని
భళ్లున బద్దలు కొట్టావ్!

-ఆసు రాజేంద్ర

## ఇండియా టుడే!

తెలుసా మీకీ కథ?
భరతమాత ఎదలో దాగున్న వ్యథ!
మండుటెండలో
కాలే కడుపు నేత బట్టుకొని
ఎండమావిలాంటి ఎంగిలి మెతుకులకై
వీధి గోడల వెంబడి నకనకలాడుతూ
ఎదురు చూస్తున్నాడో ఎండుడొక్కల జీవి!
లక్షల రూకలు సమర్పించినా
సలక్షణమైన సంసారానికి నోచుకోని,
ఓ అచ్చ తెలుగు ఆడపిల్ల
లయ తప్పిన జీవితాక్రందనలు
మృత్యుద్వారాన్నెదుకు తున్నాయి!
చదువుల్లో 'గోల్డ్ మెడల్' డిగ్రీలున్నా
రాజకీయ లబ్ధిదారుల
కుల విభజన పట్టికలో 'అగ్రకులమై'
ఉద్యోగంధిక 'మృగ్యమ'ని తలచి
నిరాశతో 'నిర్జీవు' డయ్యాడో నిరుద్యోగి!
వాడిన పైర్లకు ప్రాణం పోసే
వరుణ దేవుని కరుణ కోసం
బీటలు బారిన పుడమి తల్లిని
కన్నీళ్ళతో తడుపుతూ, శూన్యంలో
చూస్తున్నాడో 'కళేబరాకారం' రైతు!
నిశ్చల జీవన సాగరంలో
మతం ఉప్పెన రూపం దాల్చింది
విశృంఖల సమైక్య జీవనవనం
కుల కత్తుల కార్పణ్యం చవి చూస్తుంది
పదవి పడగ నీడలో
కులమతాలు కాపుర ముంటున్నాయి
ఇదీ నేటి భారత కథ
అగమ్య గోచర సమస్యల పొద!

-యరమాస శ్రీనివాసరావు

## 'కలలు'

ఆకాశంలో తారనై
వెలగాలని
భావి ప్రపంచానికి
నేత నవ్వాలని
ప్రజలలో ప్రజాస్వామ్యం
మేల్కొల్పాలని
కలలు గంటున్న
ఓ పసిగుడ్డా!
నీ కలలన్నీ
తల్లి గర్భంలోనే (నుండి)..!
బయట పడ్డాకా
అవి నిన్నే కాటేస్తాయి!

- కె. సత్యవల్లి

# అడగండి చెప్తా! —— "ఇళయరాజా"

| | |
|---|---|
| అసలు పేరు ? | "అది చాలామందికి గుర్తు లేని పేరు. గుర్తింపు ఉన్న పేరు 'ఇళయరాజా'యే!" |
| పుట్టిన తేదీ | "ఆ రోజు మళ్ళీ రాదు కదా!" |
| సొంత ఊరు ? | "ఈ ప్రపంచంలో ఎవరికీ ఏదీ సొంతం కాదు." |
| మీరెలా సంగీత దర్శకు డయ్యారు ? | "అంతా విధి నిర్ణయం." |
| సంగీత దర్శకుడు కాకుండా ఉంటే ? | "మీ రీ ప్రశ్నను అడిగేవారు కాదు." |
| అసలు సినిమా సంగీతమంటే? | "ఇతరులను మభ్యపెట్టడం." |
| మీ కిష్టమైన పుస్తకాలు | "రమణ మహర్షి రాసిన గ్రంథాలు." |
| మీ అభిమాన దర్శకుడు | "ఆ జగన్నాటక సూత్రధారే." |
| మీ ఇష్టదైవం | "ప్రకృతి . గాలిలో నూ శ్రుతిలయలుంటాయి." |
| మూఢ నమ్మకాలు | "అసలు నమ్మకమే మూఢమైనది." |
| మీ రెవరికి భయపడతారు? | "నాకేనేమో!" |
| మీ కిష్టం కానిది? | "నన్ను నేను అన్వేషించడం." |
| ఇష్టం కానిది ? | "భగవంతుడు ఉన్నాడా - లేడా అని తర్కించడం." |
| మీ నెచ్చెలి? | "వీణా పాణియైన సరస్వతీదేవి." |
| ఏదైనా ఎప్పుడైనా ప్రమాదంలో చిక్కుకున్నారా? | "అసలు నేనీ పుడమి మీద జన్మించడమే ప్రమాద వశాత్తు కదా!" |
| దేవాలయాలకు వెళ్తుం టారా? | "భగవంతుడు సర్వాంతర్యామి నా వృత్తిని ఆరాధిస్తాను. నా హార్మోనియంలో నూ దైవముంది! నేను పని చేసే రికార్డింగు థియేటరూ ఒక ఆలయమే." |
| మీ కులదైవం | "మా తల్లే " |
| మీ కిష్టమైన దుస్తులు | "కాషాయ వస్త్రాలలో ఎంతో మనశ్శాంతి ఉంటుంది " |
| మీ జీవితాశయం? | "ఆశయమనేది మనం ఆశ పడేది. అది నెరవేరడం భగవంతుని కటాక్షం " అయినా జీవితమే బుద్బుధ ప్రాయమైనప్పుడు ఇక ఆశయాలేపాటి? |

-జి. వి. జి.

## శృంగార నర్తకి 'బోనస్'

"పది లాటరీ టిక్కెట్లు కొంటే ఒక టిక్కెట్టు ఇనాం. పది చీరలు కొంటే ఒక జాకెట్ గుడ్డ ఉచితం." ఇలాంటి ప్రకటనలు మనం చూస్తూంటాం. ఒకే సంస్థ మూడు చిత్రాలలో తనను బుక్ చేస్తే, ఆ సంస్థ నాలుగో చిత్రంలో ఉచితంగా డ్యాన్స్ చేస్తానని అంటోందట శృంగార నర్తకి 'బబిత.

## కూతురికి డబ్బింగ్ చెప్తానంటున్న తల్లి

"మా అమ్మాయి ఇటుపైన తను నటించే చిత్రాలలో తనకు తానే డబ్బింగ్ చెప్తుంది. ఒకవేళ అమ్మాయి బిజీగా ఉంటే, దానికి నేనే డబ్బింగ్ చెప్పాలి. సరేనా?" అంటోందట కనక తల్లి అలనాటి నటి దేవిక.

# పార్టీ యిస్తున్నారా?

## కొన్ని సూచనలు, సలహాలు ఇవిగో!



**ముందుగానే ప్లాన్ వేసుకొని మరీ పార్టీ యివ్వాలంటున్నారు-తడి "పార్టీ"ల గురించి కాదు కేవలం సంసారపక్షపు పొడి పార్టీల గురించి మాత్రం సుమా!**

పార్టీలు అన్నవి ఇప్పుడు తరచు ఏదో ఒక సందర్భంలో నిర్వహిస్తూ వుంటారు. ఆ పార్టీకి ఒక ప్లాన్ ప్రకారము ముందే అన్నీ సమకూర్చుకుని అనక అతిధుల్ని పిల్చుకుంటే పద్ధతిగా ఉంటుంది. శ్రమ అనిపించదు. మన ప్రాంతాల్లో పార్టీ అనగానే ఎంతో కష్టపడాలి. కాని నార్త్‌లో అయితే ఫంక్షన్‌కి పిల్చిన వాళ్ళలో కొంత మంది ముందే వచ్చి రకరకాల ప్రాంతాల వంటకాలు సింధి, పంజాబీ, బెంగాలీ అన్ని తరహా వంటలు తయారు చేస్తారు

### కార్యక్రమం రూపొందాలి

పార్టీ ఇవ్వదలచుకున్న రోజుకి రెండు మూడు వారాలు ముందుగానే ప్రణాళిక సిద్ధం చేసుకోవాలి. ఆ రోజుకి గ్లాసులు సరిపోవు, ప్లేట్లు సరిపోవు, లైట్లు సరిపోవు అన్న చింతవుండకూడదు. అన్నీ ప్రీప్లాన్డ్‌గా అమర్చు కోవాలి అనుకోని అతిధులను కూడా లెక్కలోకి తీసుకోవాలి. పార్టీ చివరిలో ఒక స్వీట్‌గాని - ఐస్‌క్రీమ్‌గాని ఆఫర్ చేస్తారు. దానితో పాటు మంచి సంగీత కచేరీకూడా ఉంటే చాలా మంచిది. కూల్ డ్రింక్స్ ఐస్‌క్రీమ్స్ అయితే మరింత మంచిది. అంటె నిల్వవుండేవి అయితేమంచిది.






రెండు రోజులు ముందుగా అవసరమైన కాయగూరలు-నాన్‌వెజ్ కావల్సిన వారు వాటికి సంబంధించినవి అన్నీ ఫ్రిజ్‌లో జాగ్రత్తపరచాలి.

పార్టీరోజు చేసుకునే వంటకాలను ముందురోజు పూర్తి చేసుకోవాలి. పార్టీ రేపు జరుగుతుందనగా పార్టీ జరిగే స్థలం ఏర్పాట్లు అంటే టేబుల్స్, షామియానాలు ఇత్యాదివి అమర్చుకోవాలి. ఇండోర్స్ సింపుల్ పార్టీ అయితే షామియానా అవసరం లేదు.

పార్టీ రోజున అప్పటి కప్పుడు వండే పదార్థాలు పూర్తి చేసుకోవడమేగాక బాత్ రూమ్స్ లెట్రిన్స్-నీటి సరఫరా, సబ్బులు, టవల్స్ వీటికి కూడా ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలి-పార్టీ అయ్యాక క్లీనింగ్ కూడా చాలా ముఖ్యము.

### ఏర్పాట్లు ఎలావుండాలి?

పార్టీ జరిగే ప్రదేశాలనుంచి వీలయినంత ఫర్నిచర్ తీసివేసి దూరంగా ఉంచాలి. మంచి పార్టీ అంటే కదలకుండా కూర్చుని ముగించేయడంకాదు.

హాయిగా, హేపీగా పార్టీని ఒక సజీవ ప్రవాహంలా-మనుష్యులు అటు ఇటు మెదులుతూ ఫ్రీగా ఉండాలి. మరో సంగతి.... పార్టీ మొదలవడానికి ముందే పెంపుడు కుక్కలు పిల్లులు ఏమైనా ఉంటే వాటిని బంధువులనో పక్కింటి వారినో కనిపెట్టి ఉండమని లేక వేరే గదిలో పెట్టి తలుపులు

వేసి ఉంచాలి. చేయి తగిలితే పడిపోయేలా ఉండే వస్తువులను, గాజు కుండీలు ఇత్యాదివి అక్కడినుంచి తీసి భద్రంగా ప్రక్కన ఉంచాలి. పార్టీ మధ్యలో ఇలాంటి డిస్టర్బెన్స్‌లు వుండకుండా ముందే ఎరేంజ్‌మెంట్స్ మంచిది.

## పార్టీలో ఎలా ప్రవర్తించాలి?

పార్టీ మొదలు కాగానే అతిథులను పరిచయం చేసుకోవడంతో బాధ్యత ముగిసిందనుకోవద్దు. ఎవరు పార్టీలో సరిగ్గా కలవడంలేదో, ఎవరు ముఖమాట పడుతున్నారో గమనిస్తూ ఉండాలి. మగవాళ్ళ పార్టీలు అంటే మరికొన్ని ప్రత్యేకతలు-యాష్‌ట్రేలుగట్రా అవసరము. వాటి అవసరములేకపోతే మరీ మంచిది. ఇల్లుకూడా క్లబ్బులా తయారవ్వకుండా పార్టీ ఇవ్వడం మంచిది. పార్టీ ముగిసిందని ప్రకటించాలనుకున్నప్పుడు వేడి వేడి కాఫీ అందిస్తే సరి. అందరూ బయలు దేరడానికి అని అర్థం చేసుకుంటారు. ఒక వేళ పార్టీలో ఏదైనా మనస్పర్థ లు వచ్చినా అక్కడివక్కడే వదిలేయాలి. పార్టీ ఇచ్చే వ్యక్తి అతిథులతో మాట్లాడడానికి సమయమంటూ కేటాయించాలి. వచ్చిన వ్యక్తుల్ని కూచోపెట్టి ఇంట్లో గ్లాసులు గిన్నెలు సర్దుకోవడం కాదు. చక్కగా మాట్లాడాలి. అలాగే పార్టీ ఎండింగ్‌లోకూడా వెళ్ళి వారిని నవ్వుతూ సాగనంపాలి.

ప్రమోషన్, బర్త్‌డే, మ్యారేజ్‌డే ఇలా రకరకాల మినీ పార్టీలు ఇంట్లో అరేంజ్‌మెంట్స్ కనుక ఇల్లాలితోసహా భర్తకూడా జాగ్రత్త వహించాలి.




## పార్టీకి ఎవరిని పిలవాలి? ఎలా పిలవాలి?

మంచి పార్టీ అనిపించాలంటే అందులో అన్నిరకాల వ్యక్తులుండాలి. ఎప్పుడు కలిసే వ్యక్తులను మాత్రమే పార్టీలకు పిలవాలి అని మాత్రం అనుకోకండి. పరిచయం చేసుకోవాలనిపించే వ్యక్తులను కూడా తప్పనిసరిగా పిలవాలి. పార్టీ మంచి హుషారుగా సాగిపోవాలి. అందరూ కలసికట్టుగా ఉండాలి అంతేగాక మా స్టేటస్ వేరు, మీ స్టేటస్‌వేరు నేను డాక్టరు భార్యని, నేను ఇంజనీరు భార్యని అనుకుంటు బిగుసుకుని కూర్చోకూడదు. మీ మిత్రులతో పాటు మరికొంతమంది క్రొత్త మిత్రులను తీసుకురమ్మనమంటే క్రొత్త పరిచయాలు అవుతాయి.

పార్టీ సజీవంగా ఉండేటందుకు మంచి మాటకారులు ఇద్దరినో ముగ్గురినో పిలిస్తే బాగుంటుంది. అంటే అతివాగుడు కాకుండా చక్కని వినోదకరమైన ఆహ్లాదకరమైన మాటలను మాట్లాడాలని మర్చిపోకండి. నిజానికి ఫంక్షన్స్ అనేవి మనుష్యుల్లో మరింత వికాసాన్ని కల్గించాలిగాని-




న్యూనతభావంతో బిగుసుకుపోయి ఉండేలా ఉండకూడదు. ఆహ్లాదకరంగాఉండి-ఎదుటి వారిని ఆనందంతో సాగనంపండి. లివ్ హేపీ, ఎంజాయ్ హేపీ!!

-కె. వాణీప్రభాకరి



# హల్లో! మిస్టర్!

సోడా మిస్టర్... మిస్టర్... సోడా!... మిస్టర్ కిల్లీ... మిస్టర్... మిస్టర్... రైలెళ్లిపోతోంది మిస్టర్....

ఇదిగో మిస్టర్... ఈ స్టేషన్‌లో రైలెంత సేపుంటుంది?- మిస్టర్ వాటర్ మిస్టర్... ఏయ్ మిస్టర్... ఫ్రెష్ వాటర్....

ఇలాంటి కేకలు పెడుతూ వుంటారు ప్రయాణీకులు.... రైలు వచ్చి స్టేషన్‌లో నిలబడగానే పెట్టెలోకి ఎవరన్నా ఎక్కబోతే అందులో వున్నవాళ్లు "ఇదిగో మిస్టర్... ఇక్కడ చోటులేదు... ఇంకో పెట్టెలో ఎక్కు..."

అదే సమయంలో కొందరు త్వరగా ఎక్కేస్తారు. పెట్టెలో... గబగబా లోనికి పోతూ వుంటారు. ఒక వ్యక్తి బూట్ మిస్టర్!- బూట్... చచ్చా మిస్టర్... చచ్చా'... అంటారు. అంటే అతని బూటుకాలు ఇతని కాలు మీద వేసి తొక్కాడన్న మాట... అతడు బాధపడుతున్నాడన్న మాట.

"ఏమయ్యోయి! నీ కాలు నా కాలు మీద పడ్డింది అప్పచ్చి అయిపోయింది. తియ్యవయ్యా"అని చెబితే బాగుండును. అలా చెప్పడు... నాజూగ్గా, భావగర్భితంగా- బూట్ మిస్టర్ అంటాడు.

ఒకసారి అలాగే బూటుక్రింద కాలుపడి నలుగుతున్న సమయంలో- బూట్ మిస్టర్ అంటే- 'ఎస్. బూట్ ఫార్టీ రుపీస్' అని అతడలాగే నుంచున్నాడట. అప్పుడా బాధ పడుతున్న వ్యక్తి..., ఖరీదెవరిక్కావాలయ్యా నా కాలు తొక్కుతున్నావు? కొంచెం తియ్య'మన్నాడట.

ఇంతలోకే టికెట్టు కలెక్టరు వస్తాడు పెట్టెలోకి- చేతిలో ఉన్న పంచింగ్ మెషిన్ బల్లకేసి కొడుతూ 'మిస్టర్ టికెట్' అంటాడు. అతగాడు ఏ నిద్రమత్తులోనో వుండి పలక్కపోతే ఇంకా కొంచెం గట్టిగా చప్పుడు చేస్తూ విన్నే మిస్టర్! టికెట్టు అని అరుస్తాడు.

ఈ మిష్టర్ శబ్దం ఒక చోట అని కాదు. ఒక్క వ్యక్తిపరంగా అని కాదు- ఎవర్నిపడితే వారినే 'మిష్టర్' అనడం మామూలైపోయింది.

కాఫీహోటల్లోకి వెళ్లి కూర్చోగానే, సర్వరు వంక చూచి 'ఏం వుంది మిష్టర్?' అని ప్రశ్న.

అతడు దండకం చదవగానే,- తనతో వచ్చిన వాడివంక చూచి 'ఏం తీసుకుంటావు, మిష్టర్' అని ప్రశ్న.

సర్వరు వచ్చి బల్ల తుడిచి పోతుంటే- 'కొంచెం ఫ్యాను కొట్టు మిష్టర్' అని అభ్యర్థన-

*** *** *** ***

భార్యల్ని కూడా 'మిష్టర్' అని పిలిచి సంతోషపడేవాళ్లు చాలామంది వున్నారు.... ఒకరింటికి వెళ్లి మాట్లాడుతుంటే ఆ యజమాని మాటలు ఆపి 'మిష్టర్' అని కేకపెట్టాడు. లోపలి నుంచి ఒక పిల్ల వచ్చి మిష్టరు లేదు. ఆమె సిష్టరు వుంది అన్నది.

'ఓ చిన్న మిష్టరా! ఒకసారి యిలా పిలు' అన్నాడాయన. ఇంతలో ఒకావిడ వచ్చింది.... ఆమె రాగానే పెద్ద 'మిష్టరు' ఏం చేస్తున్నదని అన్నాడాయన.. .

'రెస్టు తీసుకుంటున్నారు' అన్నదామె.

'అలాగా!' అయితే! చిన్న మిష్టర్! రెండు కప్పుల కాఫీ పంపించు... అని నా వంక చూచి, 'ఏం మిష్టర్ కాఫీయా! టీయా!' అన్నాడు.

నాకేం వద్దు... అన్నాను. అంటే ఆయన వూరుకుంటాడా? మా చిన్న మిష్టర్ కాఫీ బాగానే చేస్తుంది.... చూడాలి మీరు అని ఆమె వంక చూచి నవ్వాడు.....

ఆవిడ లోనికి వెళ్లింది. నా నవ్వు నీ నవ్వు అంత తేలికకాదు అన్నట్లు పెదిమలు బిగించుకుని.

భార్యల్ని భర్తలు మిష్టర్ అనడం సరే.... కొందరు నవనాగరిక నారీమణులు భర్తల్ని 'మిష్టర్' అని పిలవడం కూడా అమలులో వుంది- ఆమె ఖర్మం చాలక ఏ వుద్యోగంలోనో వుంటే ఆఫీసుకు బయలుదేరే ముందు 'మిష్టర్' నే పోతున్నా... కొంచెం తలుపు వేసుకో. అనడం మామూలు. కొంచెం దూరం వెళ్లి ఆగి ఇదిగో 'మిష్టర్' నా పెన్ను మరచిపోయా కొంచెం ఇలా అందిస్తావు? అనడంకూడా జరుగుతూ వుంటుంది-

ఒక ఉద్యోగస్థురాలి యింటికి వెళ్లాం. ఆమె అప్పుడే వుద్యోగ కేంద్రం నుంచి ఇంటికి చేరింది. రాగానే మాతో ఒక్క ముక్క మాట్లాడి, భర్త వంక చూచి 'కాఫీ కావాలి... మిష్టర్! చాలా టైర్డు అయిపోయాను' అంది. ఆయన అదో విధంగా ముఖం పెట్టి లోపలికి

హల్లో! మిస్టర్! ఫలహారాలు ఏం వున్నాయ్?....



# హల్లో! మిస్టర్!

-సర్రా సుబ్రహ్మణ్యం

వెళ్లబోతుండగా....

ఆవిడ మిస్టర్! మిస్టర్! రెండు బిస్కట్లుంటే పెట్టు... వట్టి కాఫీ అట్టే బాగుండదు అంది.

పాపమాయన బిస్కట్లు తెచ్చియిచ్చాడు... వాటిని స్వీకరిస్తూ ఆమె ప్రసంగం ప్రారంభించింది- తర్వాత ఆయన కాఫీ తెచ్చి యిచ్చాడు.....

'మరి వారికేది మిస్టర్ కాఫీ' అన్నదామె... .ఆయన మాట్లాడలా....

'గెస్టులకు కాఫీ లేకుండా ఎలా మిస్టర్ ఫ్లాస్కు తీసుకువెళ్లి తీసుకురా త్వరగా... ఎలాగూ వెళుతున్నావు గనుక కొంచెం టిఫిన్ కూడా తీసుకురావడం మంచిది. .' ఆయన ఫ్లాస్కు తీసుకొని బయలుదేరాడు.

గుమ్మం దాటనిచ్చి మళ్లీ మిస్టర్ అని కేకేసిందామె.

పాపమాయన కోపం పట్టలేకపోయాడు.. ఏమిటి! 'మిస్టర్' వట్టి డస్టర్ క్రింద తయారుచేశావు. దిక్కుమాలిన పిలుపు అన్నాడు.

ఆవిడ నవ్వి 'అవును డస్టరే! నా కష్టాల్ని తుడిచివేసే డస్టర్... నా ఆకల్ని తుడిచివేసే డస్టర్' అయినా అంత కోపమైతే ఎలా మిస్టర్! ఇవాళ ఆంధ్రసచిత్రవారపత్రిక వస్తుంది. అది కూడా ఒకటి తీసుకురా అంది. ఆయన గొణుక్కుంటూ వెళ్లిపోయాడు.

ఒకసారి ఒక పెద్దమనిషి ఒక ఆఫీసరుని చూడాలని ఆయనగారి బంగళాకు వెళ్లాడట. నౌకరు వచ్చి అయ్యగారు లేరు ఎక్కడికో వెళ్లారు- ఒక పావుగంటలో వస్తామన్నారు అని చెప్పాడట. పావుగంటే గదా అని, ఆయన అక్కడే కూర్చున్నాడట.

ఇంతలో ఇంట్లో నుంచి ఒక ఆడ గొంతు మాటలు ఇలా వినబడ్డాయట. ఇదిగో 'మిస్టర్' అక్కడ కూర్చున్నావేం. ఇలా దగ్గరికిరా, త్వరగా... అంత దూరంగా కూర్చుంటే ఎలా? ఇంకా దగ్గరికి రావాలి... అది... అది... అలా కూర్చోవాలి... ఒక రవ్వ జరుగు 'మిస్టర్-' రెండు బిస్కట్లు తెస్తాను. అని కొంచెం ఆగి- ఆ! యిప్పుడు రా దగ్గరికి' అంటుందిట.

వాకిట్లో కూర్చున్న వ్యక్తి ఖంగారుపడిపోతున్నాడట... ఇంత ఇదిగా మాట్లాడుతోందేమా అని....

ఇంతలో మళ్లీ మాటలు వినిపించాయట. 'నువ్వెప్పుడూ నా దగ్గరే వుండాలి 'మిస్టర్'. అంత దూరంగా నే భరించలేను. నువ్విలా దగ్గరగా వుండాలి... నీ తల నా తల దగ్గరగా ఉండాలి అని.

వాకిట్లో కూర్చున్న వ్యక్తికి ఇంచుమించుగా మతిపోతోందట. ఇంతలో నౌకరు వాకిట్లోకి వచ్చాడట ఆయనగారు ధైర్యం చేసి అడిగాడట.

అయ్యగారు ఇంట్లో లేరన్నావుగా... మరి ఎవరితో అమ్మగారలా మాట్లాడుతున్నారు- అని.

'అమ్మగారు మాట్లాడేదా!... అల్సేషియన్ కుక్కతో... అన్నాడట. కుక్కతోనా! అయితే చిక్కులేదు. .' అని ఆయన తిరిగి బల్లమీద చతికిలపడ్డాడట.

ఇలాంటి తమాషాలు ఇంకా ఎన్నో జరుగుతూ వుంటాయి.

'మిస్టరుకు' సంబంధించిన మరో చిన్న తమాషా.

ఇటీవలనే ఒక పెద్దమనిషి, యం. ఎల్. ఏ. పోటీకి నిలిచిన ఒక పరిచితుణ్ణి చూడడానికి వెళ్లాడట. ఆయన కనిపించగానే 'ఏం మిస్టర్, ఏమిటి విశేషాలు?' అని ప్రశ్నించాడట. ఆ అభ్యర్థిగారికి కోపం వచ్చి-

'మిస్టర్ సరే! 'మి' తర్వాత 'ని' కూడా కలపవయ్యా కొంచెం అన్నారుట.

'ని' కలపడమేమిటి? నాకు అర్థంకావడంలేదు అన్నాడుట ఆ పెద్దమనిషి.

అవునయ్యా! ఇన్నాళ్లు 'మిస్టర్....' 'మిస్టర్...' అన్నావుసరే!... ఇక అనబోకు... 'ని' కూడా కలుపు అంటే తెలియలేదా? మిస్టరు'కి' 'ని' కలిపితే... 'మినిస్టరు' కాదటయ్యా... ఈసారి మనం తప్పకుండా అవుతాం అని- ఆ అనేది కొంచెం ముందుగానే అంటే నాకు చాలా ప్రచారమవుతుంది- నీకు జ్యోతిషం తెలిసినట్లవుతుంది', అన్నారట ●






సీరియల్

# ప్రణయవల్లరి

**యర్రసంట్ల వరలక్ష్మీదేవి**

**ఇంతవరకూ సాగినకథ-20:** నాటకాల పిచ్చి వున్న రామకృష్ణ-గణపతి స్నేహితులు. లా చదివేందుకు అలహాబాద్ వెళ్లిన రామకృష్ణకు సిన్హా-రబీన్ స్నేహితులవుతారు. టి.బి. సోకిన నవనీతకు రామకృష్ణ వైద్యం చేయిస్తూ, ఆ కుటుంబానికి సన్నిహితుడవుతాడు. రామకృష్ణ నవనీతను పెండ్లి చేసుకోవాలనుకుంటాడు కాని అనుకోకుండా సిన్హా చెల్లెలు నీలతో కల్గిన శారీరక సంబంధం మూలంగా ఆ పిల్లను పెళ్లి చేసుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. రామకృష్ణ-నీలల పెండ్లి శుభలేఖ చూసి నవనీత ఖంగుతింటుంది.

రెండు రోజుల తరువాత గణపతి వాళ్ళింటికి వచ్చేడు. పరంధామయ్య, జానకమ్మ అతడిని చూచి ముభావంగా వూరుకున్నారు. నవనీత వెంటనే వచ్చి రామకృష్ణ గురించి ఏమీ అడగలేదు. ఏదియేమైనా రామకృష్ణ కోరినట్లు తను వారికి రామకృష్ణ గురించి నిజాన్ని చెప్ప దల్చేడు. రెండు నిముషాలు గడిచేక నవనీత గదిలోంచి వచ్చి గణపతిని చూచి ఆగి -

"గణపతిగారు! రామకృష్ణగారు అలహాబాదునుండి వచ్చేసేరా? మా ఇంటి కెప్పుడొస్తారు?" అని గంభీరంగా అడిగింది.

వెంటనే గణపతి జవాబు చెప్పలేక పోయేడు. నిజాన్ని ఎలా చెప్పడమా అని ఆలోచిస్తున్నాడు. అతని స్థితికి నవనీత జాలిపడింది.

"లేక మీ రామకృష్ణగారు ఉత్తరదేశం నుండి వచ్చి అలా ఊటీ వెళ్ళేరేమో హనీమూన్‌కి?" అనే సరికి గణపతి గతుక్కుమని తలయెత్తి చూచేడు ఆమె ముఖంలోకి ప్రశ్నార్థకంగా.

*(గత సంచిక తరువాయి)*

"ఎందుకలా బిత్తరచూపులుచూస్తారు? నేనన్నది నిజంకాదా?"

"అవును నిజమే - మరి దాచి లాభం లేదు, మీ కీ నిజాన్ని చెప్పదామనే యిప్పుడు వచ్చేను. ఇంతలో మీ కీ సంగతి ఎలా తెల్సిందో?"

పరంధామయ్య జవాబు చెప్పేడు -

"నా పెద్దకొడుకు భిలాయిలో పని చేస్తున్నాడు. వాడు నాల్గురోజుల క్రితం వచ్చేడు. వాళ్ళ డాక్టరుగారి టేబిలు మీదున్న ఓ శుభలేఖను తెచ్చేడు దాని వెనుక ఏదో రాసుకుని. ఆ శుభలేఖను రాయపూరులోని డాక్టరు సత్యజిత్ సిన్హాగారు భిలాయిలోని డాక్టరుగారికి పంపేరు. తన కూతురు నీలను మన రామకృష్ణగారికిచ్చి పెండ్లిచేస్తున్నట్లు, పెండ్లికి రమ్మనమని. మే మా శుభలేఖను చూచి రామకృష్ణగారు మాకు దూరమైపోవడానికి కారణం తెల్సుకుని చాల బాధపడ్డాం."

నవనీత కుతూహలాన్ని మరి అణచుకోలేక అడిగింది -

"గణపతిగారు! ఎక్కడో రాయపూరులో వున్న హిందీపిల్లకు రామకృష్ణగారితో పరిచయమెట్లా అయింది - అ ది పెండ్లి వరకు ఎలాపోయింది?"

అందరి మనస్సులలో అదే ప్రశ్న వూగిసలాడుతుంది. అందుకే అందరు గణపతి చెప్పే జవాబుని శ్రద్ధగ వినడానికి సంసిద్ధులయేరు.

"రామకృష్ణ అలహాబాదులో మూడు సంవత్సరాలక్రితం చదువుకని వెళ్ళినపుడు, దేవేంద్రసిన్హా అనే అతనితో పరిచయమై, స్నేహితుడయ్యేడు. దేవేంద్రసిన్హా మధ్య ప్రదేశ్‌కి చెందినవాడు. రాయపూరు వాస్తవ్యులైన, ధనికులైన డాక్టరు సత్యజిత్‌సిన్హాగారి కుమారుడు దేవేంద్రసిన్హా రామకృష్ణతో కలసి ఈ మూడేళ్ళు ఎమ్.ఏ; ఎల్.ఎల్.బి. చదివేడు. ఇరువురు మిక్కిలి సన్నిహితులయ్యేరు. సెలవుల్లో రెండు మూడుసార్లు స్నేహితుని ఆహ్వానంపై రామకృష్ణ రాయపూరుకు సిన్హాగారింటికి వెళ్ళేడు. దేవేంద్రసిన్హా చెల్లెలు నీల. చాల అందమైనది, గ్రాడ్యుయేట్, చురుకైనది, అధునాతన భావాలుగలది. అలంకరణలోను, ఆచరణలోను గొప్పదే. రాయపూరు వెళ్ళినప్పుడు ఆ అమ్మాయితో రామకృష్ణకు పరిచయమైంది.

సంవత్సరం క్రితం వేసవి శలవుల్లో సత్యజిత్‌సిన్హా కుటుంబం కాశ్మీరు వెళ్ళినప్పుడు స్నేహితుడు దేవేంద్రుని ప్రోద్బలంపై రామకృష్ణ కూడ వాళ్ళతో కాశ్మీరు వెళ్ళేడు. అక్కడ ఓ నెల్లాళ్ళు గడిపి వచ్చేడు. నీల మొదటి నుండి రామకృష్ణను ప్రేమిస్తూవచ్చింది. మీరు నమ్మినా నమ్మకపోయినా రామకృష్ణ నీలను ప్రేమించ

లేదు.

రామకృష్ణ చదువును పూర్తిచేసి విశాఖ పట్నంకు తిరిగి వచ్చిం తరువాత గత నెల సత్యజిత్‌సిన్హా భార్యతోను, కూతురుతోను, కొడుకు దేవేంద్రునితోను, అతని స్నేహితుడైన రామకృష్ణ ఇంటికి ఈ ప్రాంతాన్ని చూడడానికి వచ్చేరు. వారం రోజులున్నారు రామకృష్ణ ఇంటిలో.

ఒకనాడు హఠాత్తుగా అనుకోనివిధంగా జరిగిన ఓ సంఘటన ఫలితంగా రామకృష్ణ నీలను పెండ్లాడవలసి వచ్చింది రామకృష్ణ పెద్దమనిషి, నిజాయితీపరుడు. ఒకర్ని మోసంచేసే స్వభావం లేనివాడు పెండ్లాడినదానికి అన్యాయం చేయలేని వాడు మనసా, వాచా అతడు ఓ క్లిష్టపరిస్థితికి బలైనవాడు. అందుకే మనస్సులోనున్న అనురాగాన్ని, ఆరాధనను అణచుకుని మీకు దూరమైనాడు తనని క్షమించమని తను కోరుతున్నట్లు మీకు చెప్పమన్నాడు"

గణపతి చెప్పడం ముగించేసరికి అందరు అయోమయ ఆలోచనల్లోపడిపోయేరు ఏమనడానికి ఎవ్వరికీ తోచలేదు ఆఖరికి పరంధామయ్య తేరుకుని -

"మన హిందూమతం చాల గొప్పది. అందులోని వేదాంత విభాగం యిట్లాంటి పరిస్థితుల్లో జీవితానికి బాగా తోడ్పడుతుంది బుద్ధి కర్మానుసారిణి అన్నారు. అది రామకృష్ణగారియందు నిజమైంది. మేము చేసేదేమి లేక వేదాంతధోరణిలో మా కర్మ మిచింతా, మా బ్రతుకులి ట్లా వెళ్ళవల్సిందే, ఎవరు పూర్వజన్మలో ఎంత సుకృతం చేసుకునుంటారో అంత ఫలాన్నే యిప్పుడు పొందగలరు, అనుకోవడం తప్ప మరేం చేయగలం?" అన్నాడు నవనీత తల వంచుకుని కూర్చుంది

## 29

రామకృష్ణ రెండు నెలలు భార్య నీలను తీసుకుని దక్షిణప్రాంతంలోని ఊటీ, కోయంబత్తూరు, మైసూరు, బెంగుళూరు, హైదరాబాదులో వుండి, అక్కడి విశేషాలను చూచి తమ హనీమూన్ యాత్రను చేసుకుని విశాఖపట్నం తిరిగొచ్చేరు. తరువాత ఓ నెల్లాళ్ళపాటు నీల రామకృష్ణ



ఇంట్లో వుంది. ఇన్నాళ్ళు రామకృష్ణ నవనీతను తలవకుండా వుండాలని చాల ప్రయత్నం చేసేడు. భార్య నీలకు ఎటువంటి బాధను కల్గించలేదు. ఏ చిన్న విషయంలోను నీల మనసు నొచ్చుకూడదన్నదే రామకృష్ణ భావం. నీల కూడ తన కోరిక నెరవేరి, తను ప్రేమించిన రామకృష్ణ తనకు భర్తగా లభ్యమయినందుకు చాల సంతోషించింది. ఆ మూడు నెలలు రామకృష్ణ జీవితంలో మరువరానివి. దానికి నీల అనుకూల సహచర్యమే కారణం. రామకృష్ణ తన ఆలోచనల పరిధిలోనికి రానివ్వలేదు నవనీతను.

ఒక నెల్లాళ్ళు తన తల్లితండ్రుల వద్ద గడిపి వస్తానని నీల రాయపూరుకు వెళ్ళింది. రామకృష్ణ లాపరీక్ష ఫలితాలు వెల్లడైనాయి. ప్రథమశ్రేణిలో పాసయేడు. లా పట్టా తెచ్చుకుని రామకృష్ణ ఎం.ఏ; ఎల్.ఎల్.బి. ఎడ్వకేటు బోర్డును ఇంటి ముంగిట పెట్టి ప్రాక్టీసు చేయనారంభించేడు.

రామకృష్ణ మేనమామ నరసింహం వాళ్ళదగ్గర అనుమతి తీసుకుని, తనొచ్చిన పని అయిపోయిందని రామకృష్ణ ప్రయోజకుడై ఓ ఇంటివాడై తన తండ్రిస్థానంలో, తన మేనమామస్థానంలో కూర్చుని లా ప్రాక్టీసు చేస్తున్నందుకు చాల సంతోషాన్ని వెలిబుచ్చి తన కొడుకు దగ్గరకు కెనడాకు భార్యను తీసుకుని ప్రయాణమయ్యేడు.

శాంతాదేవి ఇన్నేళ్ళతరువాత వీడ్కోలు చెప్పడానికి విమానాశ్రయానికి వెళ్ళి అన్నయ్యను, వదినను సాగనంపి వచ్చింది బరు

## ప్రణయవల్లరి

వైన హృదయంతో.

నవనీత రామకృష్ణ ఊరులో లేనప్పుడొకసారిమాత్రం ద్వారకానగర్ వచ్చి గణపతి చాలకాలం క్రితమిచ్చిన ఇంటి నంబరు చూసుకుంటూ రామకృష్ణ భవనం ముందుకు వచ్చింది. రోడ్డుకు అవలి ఫుట్ పాత్‌మీదనించుని చాలసేపు ఆ భవనం వైపు చూచి ఆఖరికి బరువుగ నిట్టూర్చి అక్కడనుండి కదిలింది. తనకు ఆ లంకంత అవరణలో ప్రవేశించే అర్హత మరికలేదని. తరువాత మరి నవనీత ఆ వీధివెంబడి ఎప్పుడూ పోలేదు.

అట్లాగే రామకృష్ణ మహారాణిపేట వెళ్ళి నవనీత వుంటున్న వీధిద్వారా ఎన్నడూ పోలేదు, ఆ పరిస్థితిలో తను నవనీతకు ఎంతదూరంగా వుంటే అంత మేలని. రామకృష్ణ హనీమూన్ నుండి వచ్చిం తరువాత గణపతి ద్వారా జరిగిన సంగతంతా తెల్సుకున్నాడు. మరే గొడవ జరగకుండా, మరేనిందలు, నిష్ఠూరాలు లేకుండ ఆ విషయం అక్కడితో ముగియడం రామకృష్ణకు కొంత వూరడింపుని కల్గించింది.

నవనీత, రామకృష్ణ యిరువురు విధివంచితులని తెల్సుకున్నారు. రామకృష్ణ నవనీత జ్ఞాపకాలను మరచిపోవడానికి చాల ప్రయత్నించి, కొంత కృతకృత్యుడయేడు. కాని నవనీత ఆ ప్రయత్నమే చేయలేదు. ఆమెకు తెల్సు ఆమె జీవితానికిక మిగిలినవి తియ్యటి జ్ఞాపకాలేనని. వాటికి కారకుడైన రామకృష్ణను ఎందుకు మరవాలి? తనకు అతనిపైనున్న ఆరాధనను ఎందుకు విడవాలి? అది తన మనస్సుకు కొంత సంతోషాన్ని మిగిల్చినప్పుడు? రామకృష్ణ శాశ్వతంగ తనకు దూరమయ్యేడని తెల్సిన నవనీత అతడ్ని మరువలేదు; అలాగని అతడ్ని కలియడానికి ఎట్టిప్రయత్నము చేయలేదు.

నవనీత ఎమ్.ఎస్.సి. సెకండ్‌క్లాసులో పాసయింది. బ్యాంకు పరీక్షపోయింది. ఆఖరికి విశాఖలోనున్న ఓ వుమన్స్ కాలేజీలో మాథమేటిక్స్ లెక్చరరుగ ఉద్యోగం వచ్చింది. అప్పటినుండి ఆమె కుటుంబానికి మరే ఆర్థిక యిబ్బందులు కలుగలేదు. ఒకరిపై ఆధారపడవల్సిన అవుసరము మరి లేకుండపోయింది.

తన మేనమామ చేపట్టిన కేసులన్ని తనకు వచ్చేయటం వల్ల, కొత్తగ ఆ వృత్తిని చేపట్టడంవల్ల మరే యితర ఆలోచనలకు తావులేనంత పనిలో నిమగ్నుడయేడు రామకృష్ణ. తన భర్తస్థానంలో తన కొడుకు కూర్చుని అదే జీవితాన్ని కొనసాగిస్తున్నందుకు శాంతాదేవికి ఎంతో తృప్తిగనుంది.

నీల రాయపూరుకు చేరింతరువాత తనవారితో పుట్టినింట్లో హాయిగ రోజుల్ని గడుపుతుంది. తన తల్లితో, తన స్నేహితురాండ్రతో చెప్పుకునేందుకు ఆమెకు బోలెడన్ని కబుర్లున్నాయి. కాని ఆనందపొంగుకు చల్లచుక్కలా, కంట్లో నలుసులా ప్రతాప్ దాపరించేడు.

రామానందమెహత రాయపూరులో మంచి పలుకుబడివున్న వ్యక్తి. అతడు సివిల్ కంట్రాక్టులుచేసి లక్షలు గడించేడు. అతడు ఏం చదువుకున్నాడో ఎవ్వరికీ తెలియదు. అందరికీ తెల్సింది ఒక్కటే అతడి భుజబలం, మాట నేర్పు లక్షలతోబాటు అతనికి పేరుప్రఖ్యాతులున్న స్నేహితులు లభ్యమయ్యేరు. ఈ లక్షల్ని మదుపుగ పెట్టి తన స్నేహితుల, పరిచయస్తుల, డబ్బుకు అమ్ముడుపోయే ఓటర్ల సహకారంతో రాయపూర్ ఎసెంబ్లీ సీటుకి పోటీచేసి, నెగ్గి ఎం.ఎల్.ఏ. అయి కూర్చున్నాడు. ప్రజాసేవ ముసుగులో తన స్వార్థానికి, మంచి రాబడినిచ్చే రాజకీయ వృత్తిని చేపట్టి మరింత ధనాన్ని ఆర్జించడం మొదలు పెట్టేడు. త్వరలో అతడు స్టేటుగవర్నమెంటులో మినిస్టరు కాగలడని ఓ గాలివార్త వుంది.



## దిలీప్ దర్శకత్వం



ఇన్నాళ్ళూ పరోక్షంగా దర్శకత్వ బాధ్యతలను నిర్వహించిన దిలీప్‌కుమార్ ఇప్పుడు స్వయంగా ఒక చిత్రానికి దర్శకత్వ బాధ్యతలను చేపడుతున్నాడు. ఆ చిత్రం పేరు కళింగ. ఈ చిత్రంలో శ్రీదేవి, సన్నీడియోల్‌లతో పాటు దిలీప్‌కుమార్ ఒక ముఖ్యభూమికను నిర్వహిస్తున్నాడట. ఫిబ్రవరిలో సెట్స్‌కు వెళ్ళే ఈ చిత్రంలోని మిగిలిన నటీనటుల్ని ఇంకా ఖరారు చేయలేదు. వీరేంద్రసిన్హా ఈ సినిమా రచయిత. మరి దిలీప్ స్వీయ దర్శకత్వంలో తయారయ్యే ఈ చిత్రం విచిత్రంగానే వుంటుందంటున్నారు.

అతని పుత్రరత్నమే ప్రతాపమెహత. ఒక్కొక్క క్లాసు రెండేసేండ్లు చదివి ఎలాగో తండ్రి పలుకుబడితో బి.ఏ. అనిపించుకున్నాడు. అతడు బి.ఏ. చదువుతున్నప్పుడు నీల అతడి క్లాసుమేటు. అప్పటికే అతడికి యిరవైఆరు సంవత్సరాలు నిండేయి. తన కొడుకు గ్రాడ్యుయేటని ఆ తండ్రి యెంతో సంతోషించేడు. వెంటనే కంట్రాక్టుల విద్యను పుత్రుడికి నేర్పి, అందులోని మెలకువలను రహస్యంగ చెప్పి 'మెహతా సివిల్ ఇంజినీర్స్' అనే తమ గృహసంస్థకు మేనేజింగ్ డైరెక్టరుగ ప్రతాప్‌ని పెట్టేడు.

ప్రతాప్ పొడగరి, మంచి బలిష్టుడు. చామనఛాయతో నున్న దేహం, దుష్టంతో నిండిన మనస్సు, అమాయకంగనుండే చూపు అతడిది. అతడు అందమైన నీలను కాంక్షించేడు. నీల తన భార్య అయితే బాగుండును అనుకున్నాడు. అందుకే ఇన్నాళ్ళు ఆమెను బలాత్కరించి తన కోరికను తీర్చుకోలేదు. తన మనస్సును తండ్రికి చెప్పేడు. అతడు 'సరే నేను పరిస్థితులను అనుకూలపరుస్తానని' మాటిచ్చేడు.

అలాగే ఓ పెద్దమనిషిచ్చిన మందు పార్టీలో ఎం.ఎల్.ఏ. రామానందమెహత సత్యజిత్‌సిన్హా పరిచయం చేసుకున్నాడు. ఇట్లాంటి పార్టీలంటే సత్యజిత్‌సిన్హాకు మంచి ఆసక్తని మాటల్లో గ్రహించేడు. మరుసటి నెలలో తన ఇంట్లో రెండవ అంతస్థులో బ్రహ్మాండమైన పార్టీని తన కొడుకు బర్త్‌డేపార్టీగా ఏర్పాటుచేసి తనకు పనికొచ్చే పలుకుబడిగల వ్యక్తుల్నే పిలిచి అంతా విదేశీ సరకుతోనే అందర్ని సంతోషపరిచేడు. ఆ పార్టీకివచ్చిన వాళ్ళలో పోలీసు అధికార్లు, సెంట్రల్ ఎక్సైజ్, ఇన్‌కంటాక్సు ఆఫీసర్లు, గవర్నమెంటు సూపరింటెండు ఇంజినీర్లు, పేరున్న డాక్టర్లు, ఒకరిద్దరు క్రిమినల్ ఎడ్వకేట్లున్నారు.

దృఢపడుతున్న ఆ పరిచయాల ఆధారంతో మెల్లగ, నేర్పుగ సిన్హా నుండి ఆహ్వానాన్ని పొంది రామానంద, మరోవారం రోజుల తరువాత కొడుకును, భార్యను తీసుకొని సత్యజిత్‌సిన్హాగారింటికి తన కొత్త మెర్సిడే బెంజి కారులో వచ్చేడు. అలా, అలా వారి స్నేహం దృఢపడింది. ఒకరింటికి ఒకరు రాకపోకలు చేయనారంభించేరు. అప్పుడప్పుడు సరదాగా, హాస్యంగ రామానంద్ వాళ్ళింటికి వచ్చినప్పుడు 'మీ అల్లుణ్ణి కూడా తీసుకునివచ్చా సిన్హాజీ' అనేవాడు. సిన్హా నవ్వేసి వూరుకునేవాడు. ఒకనాడు మరుండబట్టక రామానంద భార్య రమాదేవితో తన ఉద్దేశం చెప్పగ - "దానికేముంది వారిద్దరు ఒకర్ని ఒకరు ఇష్టపడితే మేమేమి అభ్యంతరం చెప్పము" అనేసింది.

ఆ విషయాన్నే ఇంటికి చేరింతరువాత రామానంద భార్య భర్తతోను కొడుకుతోను చెప్పగ - "సరేలే - నే నా అమ్మాయి నన్ను యిష్టపడేటట్లు చేస్తాలే" అని అక్కడనుండి కదిలేడు ప్రతాప్.

అతడి చూపునుబట్టి ఎంతటివాడైన వాడి వూహాల్ని పసిగట్టలేరు. పైగ వాడికి అనుకూలమైన ఓ నేర్పుంది. అది సరదాగా, హాస్యంగా మాట్లాడడం. అతడి జోక్సుకు విరగబడి నవ్వేవారు అతడి స్నేహితులు, దేవేంద్రసిన్హా, నీల కూడ. అతడితో మాట్లాడుతూ కూర్చుంటే కాలం వుల్లాసంగ గడచిపోతుంది.

నీల అతడి సాహచర్యానికి సరదాపడిన అతడిని ఒంటరిగ కలియడానికి భయపడేది. కాలేజిలో అతడిగురించి కథలు విన్నది. అతడు స్త్రీలోలుడని, కాలేజీలోనే వున్న ఒకరిద్దరు ఆకర్షణీయమైన అమ్మాయిలను బలవంతంగ ఎత్తుకునిపోయి బలాత్కరించి అనుభవించేడని - యితడి తండ్రి ఎం.ఎల్.ఏ. అని, ధనికుడని, మంచి పలుకుబడిగల వ్యక్తని, పోలీసులకు రిపోర్టుచేసి తమ పరువుప్రతిష్టల్ని బజారుపాలుచేసుకోడమేగాని ప్రతాప్‌ని శిక్షించలేరని తెల్సుకుని నోరుమూసుకున్నారని విన్నది.

ప్రతాప్ దుష్టుడని, కాలేజిలో గూండాగా ప్రవర్తించేవాడని తెల్సుకుంది. ముఖ్యంగా కాలేజి ఎలక్షన్సులో ప్రముఖ పాత్ర వహించి తన ప్రత్యర్థులను తన గూండా స్నేహితులతో కలసి తన్నేవాడని, ప్రిన్సిపాల్‌కి ఇతర లెక్చరర్లకు ప్రతాపంటే హడల్ అని విన్నది. ఈ సంగతులు చెవినపడి ప్రతాపంటే ఒక రకమైన భీతికల్గింది. అందుకే అతడిపై ఎంతో అయిష్టత ఏర్పడి, అతడి పరిచ యాన్ని స్నేహంగా మార్చలేదు. ఒంటరిగ అతడితో మాట్లాడడానికే అంత చొరవగ నీల జంకిపోయేది.

అప్పటికీ వీలుచూసుకుని నీలను కల ప్రతాప్ అడిగేడు-

"నీలా! మనిద్దరం వివాహం చేస కుంటే బాగుండదూ?"

నీల నవ్వేసి "ఎందుకు బాగుండదు కాని నేను ఇప్పట్లో పెండ్లి గురించి ఆల చించడం లేదు. ఎమ్.ఏ. చదువుదామ కుంటున్నాను" అంది.

"ఎమ్.ఏ. చదివేం చేస్తావు? ఉద్యో చేయనవుసరం లేదుగా. పెండ్లి చేసుకుం నాకుండే లక్షలన్నీ నీవేగా- మరి ఆ పె చదువులెందుకు?"

"చదువులు విజ్ఞానంకు, మాన

సంతృప్తికి".

"మరి మన పెండ్లి సంగతి?"

"మరో రెండేళ్ళుగడుస్తేగాని పెండ్లి గురించి నేనేమి మాట్లాడలేను".

ఈలోగా ఎవ్వరో రావడంతో ఆ ప్రస్తావన అక్కడితో ముగిసింది.

హఠాత్తుగా నీల పెండ్లి నిశ్చయించి, అందున ఓ ఆంధ్ర యువకుడితో కుదిర్చినందుకు రామానంద మెహతా, కొడుకు ప్రతాప్ ఉగ్రులయ్యేరు. కాని ఏమి చేయలేకపోయారు. కారణమేమంటే, సత్య రాయపూర్‌లో మంచి పలుకుబడి గల వ్యక్తి. అతడితో విరోధం తన రాజకీయ భవిష్యత్తుకు హానికరమని రామానంద తొందరపడి ఏ చర్యకు పూనుకోలేదు. కాని దుష్టుడైన ప్రతాప్ ఆలోచనలు వేరేగా ఉన్నాయి.

పెండ్లిలో నీలను కలసి ప్రతాప్ మనస్సులో అగ్నిని దాచుకుని పెదవులపై చిరునవ్వును చిందించి అడిగేడు- "మరో రెండు సంవత్సరాల వరకు పెండ్లి మాటే ఎత్తనన్నావు, మరి ఇంత హఠాత్తుగా ఈ పెండ్లి ఎలా కుదిరింది, అందున మనరాష్ట్రం వాడు కాదు, మన భాష వాడుకాదు కదా?"

"ప్రతాప్! నిజం చెప్పాలంటే ఇలా జరుగుతుందని నేను కలలో కూడా అనుకోలేదు. రామకృష్ణ నా అన్నతో కలిసి మూడేళ్ళు చదువుకున్నాడు నా అన్నకు మంచి స్నేహితుడు. నిన్ను చూసినట్లే, అతణ్ణి మూడు నాల్గుసార్లు కలిసినప్పుడు చూచేను, సరదగా మాట్లాడేను అంతే అట్లాంటది మేము విశాఖపట్నం వెళ్ళినప్పుడు హఠాత్తుగా మేమిద్దరం ప్రేమలో పడ్డాం. ఆ ప్రేమ తుఫానులా మా ఇద్దర్నీ ఊపేసింది. దాని పర్యవసానమే ఈ పెండ్లి" అని గడుసుగా సర్ది చెప్పింది

"సరే- జ్ఞాపకముంచుకుంటానులే ఒకటి మాత్రం నిజం, నువ్వు నన్ను మోసం చేసేవు నిన్ను పెండ్లాడాలని ఎన్నాళ్ళ నుండో నేను తహతహపడుతుంటే, నాకేవేవో కబుర్లు చెప్పి ఇప్పుడీ ఆంధ్రుణ్ణి కట్టుకుంటున్నావు కదూ? ఏం అపాటి నేను కాలేనా- నాకు విలువ లేదా?" అని కోపంతో అన్నాడు

నీలకు చిరుకోపం వచ్చింది- "నేనెవ్వర్ని మోసం చేయలేదు నీకు నేనేమీ వాగ్దానాలను చెయ్యలేదు మేరేజస్ ఆర్ మేడిన్ హెవన్, నీకు తెలియదా?" అంది

## చెల్యాబిన్స్క్‌లో కవలపిల్లలపై శస్త్రచికిత్స

1990లో అన్యా, తాన్యా అను కవల పిల్లలు కలిసి పుట్టారు ఆరు నెలల క్రితం ప్రొఫెసర్‌లెన్ నవొక్రిష్నోవ్ తన బృందంతో శస్త్ర చికిత్స జరిపి వారిని వేరుచేశారు ఈ శస్త్ర చికిత్స పూర్తి విజయవంతం అయింది. ప్రపంచ వ్యాప్తంగా యిలాంటి శస్త్రచికిత్సలు 50 వరకూ జరిగాయి కానీ కొన్ని మాత్రమే పూర్తి విజయవంతం అయ్యాయి ఈ కవలల తల్లిదండ్రులు చెల్యాబిన్స్క్‌లోని ఆస్పత్రి • డాక్టర్లకు ముఖ్యంగా ప్రొఫెసర్ నవొక్రిష్నోవ్‌కు తమ ప్రగాఢ కృతజ్ఞతలు తెలియచేశారు

"సరేలే- నాకు ఏం తెల్సిందో నీకు తరువాత తెలియజేస్తాలే," అని ఉక్రోషంతో హుంకరించి అక్కడ నుండి వెళ్ళిపోయేడు

నీల ఆ సమయంలో ప్రతాప్ మాటల్ని అంతగా పట్టించుకోలేదు పెండ్లి సవ్యంగానే జరిగిపోయింది ప్రతాప్ తన ప్రయత్నమంతా విఫలమైనందుకు ఉగ్రుడై ఉన్నాడు అసలే కోతి, పైగా నిప్పుతొక్కడమైంది. ప్రతాప్‌కి తను కోరింది లభ్యమవకపోతే, అది పొందేవరకు స్థిరంగ ఉండలేని మనస్తత్వం కలవాడు

నీల హనీమూన్ నుండి తిరిగి రాయిపూర్ వచ్చాక ఒకనాడు రామానందమెహతా భార్యతోను, కొడుకుతోను వచ్చేడు. రామానంద, సత్యజిత్‌సిన్హా స్నేహితులైన తరువాత రామానంద్ సిన్హాను తన ఫ్యామిలీ డాక్టర్‌గా ఏర్పర్చుకున్నాడు భార్యకు ఒంట్లో బాగుండడం లేదని సిన్హాకు చూపించేడు ఆ సమయంలో నీల మేడమీద కూర్చుని ఏదో నవల చదువుకుంటూంది ప్రతాప్ మెల్లగా మేడమీదకు వెళ్ళేడు.

నీల ప్రతాప్‌ని చూసి గతుక్కుమంది అతణ్ణి చూసి వెంటనే క్రిందకు పోతే, తనని చూసి భయపడిపోతూందని ప్రతాప్ ధైర్యంగా మరింత విజృంభిస్తాడని, నీల పుస్తకాన్ని ప్రక్కన పెట్టేసి ధైర్యంగా కూర్చుని సాధారణంగా ప్రతాప్‌ని పల్కరించింది.

"ఈ సాయంత్రం మరే పిక్చరుకు పోవటంలేదా?" అని ప్రతాప్ ఆమెకు ఎదురుగా సోఫాలో కూర్చుని అడిగేడు

"నిన్ననే షోలే చూసేను- మళ్ళీ వచ్చే వారమే మరో పిక్చరు చూద్దాం" అంది.

"నీలా! నీకు అత్తవారింట్లో తిండి బాగా వంటబట్టినట్టుంది- కాస్త ఒళ్ళొచ్చి మరీ అందంగా కనిపిస్తున్నావు" అన్నాడు.

నీల నవ్వేసి ఊరుకుంది. తరువాత మాటమార్చడానికి-

"ఏమిలా వచ్చావు ప్రతాప్?" అని అడిగింది.

"మా అమ్మకు జ్వరం వస్తూంది- డాక్టరుగార్కి చూపించడానికి నాన్నగారు వచ్చేరు నాకు అప్పుడప్పుడు ఒళ్ళు వెచ్చగా అవుతూంది. నీకు చూపించుకునేందుకు వచ్చేను" అని మాటల్ని తిప్పి మొదటికి తెచ్చేడు.

"ప్రతాప్! నాకు వివాహమైందని నీకు తెల్సుకదా- అట్లాంటి మాటలనడం యేమైన సబబుగా వుందా?" అని తీక్షణంగా చూస్తు అడిగింది.

"నా కండ్లకు నివెప్పుడు ఆ కాలేజీలో చదివే నీలవే. నీలా! నీ భర్త ఎక్కడో విశాఖలో ఉన్నాడు మనిద్దరం సరదాగా గడుపుతేనేం?" అని అమాయకంగా ముఖంపెట్టి అడిగేడు.

నీలకు విపరీతంగా కోపం వచ్చి లేచి నించుంది- "నువ్వివాళ బాగా త్రాగి వచ్చినట్లున్నావు. అందుకే ఒళ్ళు తెలియక మాట్లాడుతున్నావు" అని అక్కడ నుండి వెళ్ళిపోబోయింది. ప్రతాప్‌కి ఒళ్ళుమండి, మనస్సులోని దుర్గుణం బయటకొచ్చి చటుక్కున వెళ్ళి నీలను పట్టుకుని ఆమె బుగ్గను ముద్దులాడేడు.

కోపంతో వణికిపోతూ "యూ . " అని చాచి లెంపకాయకొట్టింది నీల. ఆ దెబ్బతో కండ్లు చెదిరి "సి అంతు చూస్తా" అని విసవిస మెట్లుదిగి వెళ్ళిపోయేడు. ఆ సమయంలో వాడి వాలకాన్ని క్రింది హాలులోకొచ్చిన రమాదేవి చూసి ఏదో అనర్థం జరిగుంటుందని గ్రహించి గబగబ మేడమీదకు వెళ్ళింది

నీల సోఫాలో కూర్చుని ముఖాన్ని చేతుల్లో దాచుకుని ఏడుస్తూంది. రమాదేవి ఆతురతతో కూతురు ప్రక్కన కూర్చుని

తలమీద చేతిని వేసి నిమురుతూ అడిగింది. "ఏమమ్మా! ఏం జరిగింది?"

"ఆ వెధవ నాపాలిట విలన్‌లా దాపురించేడే. ఆ నీచుడు ప్రతాప్‌కి కాలేజీలో చాల చెడ్డపేరుండేది. వాడికి లేని వ్యసనాలు లేవు. అట్లాంటి వాడ్ని మనింటికెందుకు రానిస్తున్నారే?" అని జరిగిందంత చెప్పింది.

"ఎంత పని చేసేడు! పెండ్లైన పిల్లతో వెధవ మాటలాడడమే కాదు పైగా బలవంతంగా ముద్దెట్టుకుంటాడా- ఛీ, ఛీ నిజంగా నీచుడే," అని ఏదో ఆలోచనలో పడిపోయింది.

"అమ్మా! నాన్నగార్కి చెప్పి వాళ్ళెవరు మన గుమ్మం తొక్కకుండ చెయ్యి."

"అదే ఆలోచిస్తున్నానమ్మా ప్రతాప్ గూండా వెధవ- ఆ తండ్రి కంట్రాక్టరు, ఇప్పుడు రాజకీయ నాయకుడు. రౌడీజం లేనిదే ఆ రెండు వృత్తులను ఆ తండ్రి స్వీకరించలేడుగా. పైగా ఆ తండ్రికి ఒక్కగానొక్క కొడుకు ఈ ప్రతాప్. అందుకే వాడికింత పొగరు. అట్లాంటి దుష్టులతో మీ నాన్నగారు ఏం తగాదా పెట్టుకున్న అతనికి మనశ్శాంతి లేకుండా చేయగలరు వాళ్ళు. అందుకే నాన్నగార్కేమి చెప్పకూడదు. ఇంత జరిగేక ఆ వెధవ ఏ ముఖం పెట్టుకుని మన గుమ్మమెక్కుతాడు? ఒకవేళ సిగ్గు విడచి వచ్చిన నేను తగిన జవాబు చెప్తాలే వాడికి. నువ్వు చింతించకు."

"ఆవేశంలో నేనేమో అనుకున్నాగాని, నువ్వు చెప్పిందే సమంజసంగా ఉందమ్మా. అమ్మా! నేను వచ్చి మూడువారాలైంది, అందుకే ఎల్లుండే విశాఖపట్నం వెళ్ళిపోతానమ్మా. మళ్ళీ ఆరు నెలలు అయితేగాని రాయ్‌పూర్‌కు రావడం కుదరదు. అప్పుడు వచ్చిన అతనితో కలసి వస్తాను. ఈలోగా ప్రతాప్‌కి వివాహమైపోతే నాడి శనివదులుతుంది".

రమాదేవి ఆలోచించి నీలన్న దానికి సమ్మతించింది. రెండురోజుల తరువాత నీల విశాఖపట్నంకు తిరిగి వచ్చేసింది.

## 30

రామకృష్ణ సంతోషించేడు- "ఏమిటోయ్! నెల, నెల పదిహేను రోజులు పుట్టింట్లో ఉంటానని వెళ్ళిన దానవు, మూడు వారాలకే తిరిగి వచ్చేసేవు?" అని చిరునవ్వుతో అడిగేడు.

# ప్రణయవల్లరి

నీల ఓరగ చూస్తూ "మిమ్మల్ని వదలి ఉండలేకపోయేను- అందుకే తొందరగ వచ్చేసా" అంది.

"అయితే ప్రేమ పాకం బాగా చిక్కబడిందన్నమాట-గుడ్!"

నీల చాల శ్రద్ధగా తెలుగు పుస్తకాలను పెట్టుకుని అత్తగారి శిక్షణలో తెలుగు నేర్చుకోనారంభించింది. నాలుగు నెలలయేసరికి తెలుగు మాట్లాడగల్గింది. అక్షర జ్ఞానం కల్గింది. పనివాళ్లతో చెప్పి చేయించుకోగల్గుతుంది. రామకృష్ణ తనతోటి ఎడ్వకేటులింటికి నీలను తీసుకొని వెళ్తే వాళ్ళతో బెక్కుతు, తుడుముకుంటు తెలుగులో సంభాషణ చేయగల్గుతుండేది మధ్య మధ్యన ఇంగ్లీషు పదాలను వాడుతూ ఓమూడు నెలలపాటు రామకృష్ణతినే భోజనాన్నే చేసింది. రాత్రి మాత్రం రామకృష్ణ ఆదేశం మేరకు వంటమనిషి అన్నంతో బాటు నీలకు, రామకృష్ణకు రెండేసి గోధుమరొట్టెలను చేసిపెట్టేది. రామకృష్ణకు తెల్సు నీల చపాతీలను తింటుందని

ఒకనాడు రామకృష్ణ సరదాగా నీలను అడిగేడు, "చాలకాలమైంది కదు నువ్వు నాన్‌వెజ్ తిని, మనస్సులాగడం లేదా?" అని.

"ఫరవాలేదు- తినాలని అనిపించిన ఈ ఇంట్లో ఆ ఊసెత్తలేను కదా? పైగా అత్తగారికి ఏ విధమైన ఇబ్బంది నావల్ల కల్గకూడదు".

"అయితే ఇవాళ రాత్రి డిన్నరు హోటల్లో చేద్దాం- ఏం?"

"వద్దండి కృష్ణాజీ. మరో సంవత్సరం తీసుకోకపోతే ఆ తిండినే పూర్తిగా మరచిపోవచ్చు."

"పిల్లలు పుడితే ఎలాగు పూర్తిగా మానేయొచ్చు నీకు ఇబ్బందిగా లేకపోతే ఇప్పుడా అవసరం లేదు. పద సాయంత్రం అలా హోటలుకి వెళ్దాం. వన్స్ ఇన్ ఏవైల్ నాన్‌వెజ్ తింటే నీకు ఉల్లాసంగా కంటుంది నాకు భార్య ఇష్టాలను అణచివేసే భర్త అన్న చెడ్డపేరురాదు."

"మీ అంత చక్కని, సంస్కారిని, మంచి భర్తను పొందగల్గే అదృష్టం మరో స్త్రీకి కల్గుతుందండి నాకు తప్ప?"

ఆ సాయంత్రం హోటల్లో కొంచెమే నాన్‌వెజిటేరియన్ భోజనాన్ని తీసుకుంది. అదేమని రామకృష్ణ అడిగితే- " నా వాళ్ళందరితో కలసి ఆ భోజనం చేయడం వేరు, ఇప్పుడొంటరిగా భర్త తినలేని తిండిని తినడంవేరు నేనేదో తప్పు చేస్తున్నట్లు ఫీలవుతున్నా. అందుచేత ఇక నుంచి నేను మీ ఇంట్లో ఉన్నన్నాళ్ళు ఈ నాన్‌వెజ్ తినను. మా వాళ్ళింటికి వెళ్ళినప్పుడు తినాలనిపిస్తే తీసుకుంటాను- ఏం? మనిద్దరం కలసి ఏది తిన్నా నా కెంతో తృప్తిగా వుంటుంది" అని ఇంటికొచ్చేక చెప్పింది.

రామకృష్ణ తన భార్యకు తనపై నున్న ప్రేమకు, తన వాళ్ళపైనున్న అభిమానంకు సంతోషించి ఆమెను దగ్గరకు తీసుకున్నాడు మక్కువతో.

[ఇంకా వుంది]






ఖరీదైన అలవాట్లు ఉండే ఖరీదైన మనుషుల గురించి కథలు వ్రాయడం శ్రీపతికి నచ్చదు. నీతికి అవినీతికి మధ్య గీతని చాలా సన్నదైనదిగా తలంచి దాన్ని చెరిపేయడానికి వెనుకాడని భౌతికవాదుల గురించి కథలల్లడం చాలా చికాకు శ్రీపతికి. అందుక్కారణం ఒక్కటే! వాళ్ళ గురించి చదవడమేతప్ప వాళ్ళతో కలసిమెలసి తిరిగే అవకాశం లేకపోవడమే.

అతనికి అన్ని విధాల తగిన ఇల్లాలు సుజాత. ట్రూత్ ఈజ్ స్ట్రేంజర్‌దేన్ ఫిక్షన్ సామెతకు నిరూపణామె. స్త్రీ సహజమైన ఆభరణాలపై మోజులేదామెకు. ఖరీదైన చీరలంటే ఆమెకు ఇష్టంలేదు సరికదా అవంటే ఆమెకు భయం.

"సుజా! పెళ్ళయి రెండేళ్ళయింది. నాకు బాబునిచ్చేవు, ఎరియర్స్ వచ్చేయి. పెళ్ళయిన తర్వాత నా అర్జనతో నీకో నెక్లెస్ కొనాలనుంది. సాయంత్రం ఆఫీసునుంచి వచ్చిన తర్వాత బజారుకెళ్ళి నీకు నచ్చిన నగకొందాం సరేనా?" ఆమె నిడుపాటి నీలి కురులతో ఆడుకుంటూ అన్నాడు.

"ఆ రెండు చేతులూ ఇలా అందివ్వండి. ఆ ... ఈ నెక్లెస్ రోజుకోసారయినా ధరించే అవకాశం వస్తే ఏడు వారాల నగలు ఇచ్చినట్టు పొంగిపోతాను. వచ్చిన డబ్బుని రెండేళ్ళకు ఫిక్సెడ్ డిపాజిట్లో వెయ్యండి. డబ్బును ఆర్జించి అవసరానికి ఆదుకునే విధంగా దాచుకోవడం మనబోటి ఆస్తులులేని కుటుంబ కర్తవ్యం. ఆఫీసు నుంచి వచ్చేటప్పుడు అర్ధరూపాయి మల్లెలు తీసుకురండి. ఇందండి, మీ టిఫిన్‌బాక్స్, బ్రెడ్ హల్వా బజ్జీలు పెట్టేను. తన నీలి కురుల్ని లాక్కుని రెండు చేతులూ ఎత్తి ముడి వేసుకుంటూ అంది సుజాత. ఆ దృశ్యాన్ని చూసిన శ్రీపతి ఆమెను గుండెలకు అదుముకుని పెదాలను చుంబించి ఆమె గుండెల మీద కొన్ని క్షణాలు తలనుంచి బయటకువచ్చి సైకిలెక్కేడు.

"ఒరేయ్ శ్రీపతీ! ఇన్‌స్టాల్‌మెంట్స్ మీద ఒక టూ వీలర్ కొనుక్కోరా, ఎన్నాళ్ళీ సైకిల్‌యానం" కొలీగ్ సలహా.

"వద్దండి! నాతాళిని గట్టిగా ఇలానే ఉండనివ్వండి: రెండుండలబండీ ప్రమాదాల కాపాన్వసం. సైకిల్ త్రొక్కడం మంచి ఎక్సర్‌సైజ్. మీ బలమైన కాళ్ళ వెనుక రహస్యం ఈ సైకిల్ తొక్కడమే," భార్య దగ్గర స్కూటర్ ప్రస్తావన తెచ్చినప్పుడు సుజాత అన్న మాటలు.

"లేదు బ్రదర్! మా సుజా వద్దంది. ఆమె వద్దన్న పని చేసే సాహసం, చేయాలనే ఇష్టం నాకులేవు."

తన సీట్లో కూర్చుని ఆరోజు చూడాల్సిన ఫైళ్ళలో మునిగిపోయాడు శ్రీపతి.

"సార్! మేనేజర్‌గారు తమర్ని రమ్మంటున్నారు సార్" ఎటెండర్ నాయర్ మాటలకు తలెత్తి వెళ్తున్నట్టు తలూపేడు శ్రీపతి.

"మిస్టర్ శ్రీపతి! నీకు పేదలంటే, వృద్ధులంటే, స్త్రీలంటే అమితమైన జాలుండొచ్చు. మంచిదే కాని ఆమెకు ఇంకా పది రోజులు పెయిడ్ లీవ్ పొడిగించమని రికమండ్ చేసేవు..."

"సార్! ఆమె గర్భవతిగా ఉన్నప్పుడే భర్త పోయేడు. అత్తింటివారు కోపంతో ఆమెను చేరదీయలేదు. పుట్టింటివాళ్ళు నిరుపేదలు. అయినా ఆ బిడ్డకోసం గుండె రాయి చేసుకుని బ్రతుకుతోంది. ఆమెకు సాయం చేయగలిగే వాళ్ళం, చేయవలసినవాళ్ళం మనమేసార్! పనికి ఆటంకం లేకుండా, రాకుండా ఆమె సీటు పనిని కూడ నేనే చూస్తున్నాను దయచేసి నా అభ్యర్థనను మన్నించండి సార్!" రెండు చేతులు ఎత్తి నమస్కరిస్తూ అన్నాడు.

తల నెరసిన మేనేజర్ కన్నులు చెమర్చాయి.

"శ్రీపతీ! మంచితనమ్మీద నమ్మకం పోయింది. మానవత్వమ్మీద నా కింకా నమ్మకం ఉందంటే అందుక్కారణం అడపా తడపా నీలాంటివాళ్ళెదురవడం. అలానే, లెటజ్ గ్రాంట్‌హర్ లీవ్. యూ కెన్ గో!" తల వంచుకుని రాబోతున్న కన్నీటిని అతి ప్రయత్నంమీద ఆపు



కుంటూ అన్నాడు మేనేజర్ దయాచారి.

"థాంక్సండి! రాధకు లీవు ఎక్స్టెండ్ చేయించేరు. ఆమె చాలా సంతోషిస్తుంది. ఈ సంగతి తెలిస్తే", టైపిస్ట్ అనురాధ కళ్ళల్లో కృతజ్ఞత కనిపించింది.

రాధ, అనురాధ క్లోజ్ ఫ్రెండ్స్.

"ఆఫీసయిన తర్వాత రాధను చూడ్డానికి వెళ్దామనుకుంటున్నాను. మీతో పాటే నన్ను వాళ్ళింటికి తీసుకు వెళ్తారా?

"ష్యూర్ సర్! మీరేవచ్చి ఆమెకు ధైర్యం కలిగే రెండు మాటలు చెప్తే ఆమె ఎంతగా సంతోషిస్తుందో నేనూహించ గలను. అలానే సర్!" అనురాధ గొంతులో సంతోషం, ఆత్రుత, కృతజ్ఞతా భావం కలగలుపుగా చోటు చేసుకున్నాయి.

రాధ కన్నులముందు మెదిలింది. ఎక్కడో ఢిల్లీలో ఉన్న తన చెల్లెలు మనసులో మెదిలింది. రాధకి తన చెల్లికి చాలా సారూప్యత ఉంది. ముఖ్యంగా రాధ నవ్వితే తన చెల్లెలి రూపమే శ్రీపతి ముందు నిలుస్తుంది. శ్రీపతికి ఒకే ఒక్క చెల్లెలు రమ. ఆమె అంటే శ్రీపతికి ప్రాణం.

"నాన్నా! చెల్లికి అంతదూరం సంబంధం చేయడం నా కిష్టంలేదు, దగ్గర్లో...

"బాబూ! ఆడపిల్లకు వివాహం నిశ్చయించగలం. కాని ఆమె అదృష్టాన్ని నిర్ణయించలేం. మంచి సంబంధం. అబ్బాయి బుద్ధిమంతుడు. కట్నాలమీద ఆశలేని కుటుంబం. ఇంతకంటే మంచి సంబంధం మనం చూడలేము బాబూ!ఆమె దూరంగా ఉండడం అందరికీ బాధ కలిగించే విషయమే! కాని ఎక్కడున్నా ఆమె ఆనందంగా ఉంటే అంతే చాలు బాబూ".

తండ్రి మాటలకు ఎదురు చెప్పలేదు శ్రీపతి. చెల్లెల్నించి నెలకోసారైనా ఉత్తరం రాకపోతే కంగారు పడతాడు శ్రీపతి. నెలాఖరు వచ్చేస్తున్నా చెల్లెలి నుంచి ఉత్తరం రాలేదని రోజుకొక సారైనా భార్యతో అంటున్నాడు శ్రీపతి.

"రండి! రాధ ఇంటికి వెళ్దాం",

అయిదున్నరతర్వాత శ్రీపతితో అంది అనూరాధ.

ఆమెను రిక్షా ఎక్కించి తను సైకిల్ మీద బయలు దేరేడు శ్రీపతి. అనూరాధను, శ్రీపతిని చూసి కొన్ని క్షణాలు స్తబ్దుగా నిలబడి పోయింది రాధ. ఆమెను చూసి శ్రీపతి చిరునవ్వు నవ్వేడు. ఆమె అసంకల్పితంగా తనదైన నవ్వును ముఖమ్మీద వెలిగించింది. తన చెల్లెలు ఎదురుగా నిలిచిన అనుభూతి కలిగింది శ్రీపతికి.

కొంతసేపు అదీ ఇదీ మాట్లాడిన తర్వాత నేరుగా విషయాని కొచ్చేడు.

"రాధగారూ! ఎంతో ఆలోచించి నేనో నిర్ణయాని కొచ్చేను. ఓ నెల్రోజులపాటు మీరు మీ బిడ్డ మా ఇంటి కొచ్చి ఉండండి. మీరు పూర్తిగా శక్తిని పుంజుకోడానికి అదొక్కటే మార్గంగా తోచింది", ఇంక చెప్పేదేం లేదన్నట్టు నిశ్శబ్దంగా ఉండి పోయేడు.

అనూరాధ కళ్ళల్లో ఆశ్చర్యం. రాధ ముఖంలో సంతృప్తివెలుగు.

"మీ ఆవిడ కేమైనా అభ్యంతర ముంటుందేమో, ఆమె కోసారి చెప్పి....

"మంచి పనికి మా ఆవిడ సహకారం ఉంటుందన్న నమ్మకం నాకుందండీ. సాటి మనిషిని అవసరంలో ఆదుకోకపోతే మన మనుగడ మనిషి మనుగడవదండి. కావల్సిన బట్టలు సామాన్లు సర్దుకుని మీరూ, అనూరాధ మా ఇంటి కెళ్ళండి నేనలా బజార్లో పని చూసుకొని ఇంటి కొచ్చేస్తాను. బహుశా మీకంటే ముందుగానే ఇల్లు చేరతానేమో!" అని చెప్పేసి బయటకు వెళ్ళిపోయాడు శ్రీపతి.

## మానవత్వం పరిమళించిన వేళ

"శ్రీపతిని చూస్తే తోటి మనుష్యుల మీదే కాదు, ఆ భగవంతుడి మీద కూడా నమ్మకం దృఢపడు తుంగి రాధా", సాలోచనగా అంది అనురాధ.

"మానవత్వం, దైవత్వం మనిషి ఉనికి నాణెపు రెండు వైపులు", పసివాడికి రొమ్మునందిస్తూ అంది రాధ.

ఇద్దరూ కలసి శ్రీపతి ఇంటికి వెళ్ళేరు. సుజాత ఇద్దర్నీ సాదరంగా ఆహ్వానించింది. రాధ భుజమ్మీద పసివాడ్ని చేతుల్లోకి తీసుకుంది.

అనూరాధ విషయాన్ని వివరించింది.

"మా ఆడపడుచు మా ఇంట్లో ఎప్పుడూ ఉండడం జరగ లేదు. ఈ ఇంటి ఆడపడుచులా స్వేచ్ఛగా ఉండమ్మా. కంటికి రెప్పలా నిన్నూ నీ బిడ్డనీ చూసుకుంటాం". సుజాత గొంతులో ఆప్యాయత, ఆదరణ భావం చోటు చేసుకున్నాయి. వాళ్ళని కూర్చోమని చెప్పి వంటింట్లోకి వెళ్ళింది సు జాత.

శ్రీపతి వచ్చి రెండు నిముషాలు మాట్లాడి అనూరాధని రిక్షా ఎక్కించి ఇంట్లోకి వచ్చి భార్యతో మాట్లాడ్డానికి వంటింట్లోకి వెళ్ళేడు.

"సుజా! నీకు ముందుగా చెప్పకుండానే.."

"ఓహో! రమా వచ్చేముందు కూడా నా పర్మిషన్ తీసుకుంటారా? ముఖం కడుక్కొని రండి టిఫిన్ చేద్దురుగాని", నవ్వుతూ భర్తతో అంది సుజాత

కాఫీ త్రాగిన తర్వాత ఇచ్చింది చెల్లెలి రమ నుంచి వచ్చిన ఉత్తరం

"ఓపెన్ చెయ్యలేదేం సుజా!" ఆశ్చర్యంగా అడిగేడు శ్రీపతి మల్లెల దండ నల్లుతున్న సుజాత నవ్వుతూ భర్తవంక చూసింది

"మీ ముద్దుల చెల్లెలి ఉత్తరం నేనెప్పుడైనా ముందు ఓపెన్ చేసేనా. మీరే చదివి చెప్పడం మామూలేగా. ముఖంలో చిరునవ్వు కదులుతూంటే అంది సుజాత

ప్రియమైన అన్నయ్యా!

పదిహేను రోజుల క్రితం మీ బావగారు స్కూటరు మీద వస్తూంటే ఏక్సిడెంటయింది ఈ రోజే హాస్పిటల్ నుంచి డిస్చార్జ్ చేసేరు. ఆయన సంపూర్ణ ఆరోగ్యంతో ఉన్నారు కొన్నాళ్ళు రెస్ట్ అవసరమని మరో పది రోజులు తీవు పొడిగించారు. ఆయన కొలీగ్ ఒక పంజాబీ. ఈ పదిహేను రోజులు స్వంత అన్నదమ్ముడిలా నాకు అండగా నిలిచేరు ఎన్ని వేలు ఖర్చు పెట్టుంటారో. ఆ ఋణాన్ని తీర్చుకోగలం కాని, ఆయన చూపించిన ఆప్యాయతకు వెల కట్టలేము. ఆ ఋణం మాత్రం తీర్చుకోలేనిదే

నాన్నగారికి కాని, నీకుగాని వ్రాస్తే కంగారు పడతారని మీకు వ్రాయలేదు నన్ను మన్నించు. ఆ భగవంతుడు ఆయన స్నేహితుని రూపంలో ఆదుకున్నాడు

నీ ముద్దుల చెల్లి

నీకు నమస్కరిస్తూ.

ఆ ఉత్తరాన్ని చదివి శ్రీపతి కళ్ళు చెమర్చాయి. కొన్ని క్షణాల్లో నిలద్రొక్కుకున్నాడు

"సుజా! రేపే బయలుదేరి ఢిల్లీ వెళ్తాను. ఎరియర్స్ పదివేలు తీసుకుని వెళ్తాను అక్కడ అవసరానికి ఆదుకోవచ్చు. దయాచారికి చెప్పి వెళ్తాను, మిమ్మల్ని చూసి వెళ్తూ ఉండమని ఆ భగవంతుడు కరుణామయుడు. కాని చెల్లెల్ని, బావగార్ని చూసి వస్తే తప్ప నాకు మనశ్శాంతి ఉండదు", అతని కళ్ళల్లో నీళ్ళు తిరుగుతూంటే చూసిన ఆ స్త్రీలిద్దరూ అవాక్కయి అలానే ఉండి పోయారు. ○



**వీరమాచనేని శ్రీధర్, విజయవాడ**

రామలక్ష్మిగారూ! సమాజంలో వర కట్నం యివ్వడం పుచ్చుకోవడం ఎప్పుడు నశి స్తుందంటారు?

ఇచ్చేవాళ్లు పుచ్చుకునే వాళ్ళు ఉన్నంత కాలం యిలాంటివి నశించవు. పుచ్చుకునే వాళ్లు ఎలాగైనా పుచ్చుకుంటారు- చట్టరీత్యా నేరమైతే- దాని పరిధి దాటి అందుకుంటారు. ఇచ్చేవాళ్లూ అంతే- ఏదో రూపంలో ముట్ట చెప్తారు. 'ఆడపిల్ల భారం వదుల్చుకున్నా' మని వీళ్లూ. 'జీవితాంతం పోషించవద్దా' అని వాళ్లూ సర్ది చెప్పుకుని- వూరుకుం టారు. వివాహం ఇద్దరు వయోజనులైన యువతీ యువకుల మధ్య అన్నా, వైవా హిక బంధానికి మించిన సన్నిహిత బంధం యింకోటి వుండదనీ, అందుకే- షరతులకు కాక ప్రాధాన్యం ఇతర విషయాలకివ్వాలనీ- తల్లితండ్రులు గుర్తించటం- వివాహం తమ సంపూర్ణ వ్యక్తిత్వ వికాసానికి కాని- అప్ప నంగా చాకిరీకో మనిషిని తెచ్చుకోడం కాదని- అమ్మాయీ అబ్బాయి గుర్తించడం జరి గితే- నెమ్మది నెమ్మదిగా పరిస్థితి మారుతూ రావచ్చు. కట్నం విషయం వచ్చేసరికి- యీ కాలం అమ్మాయిలకేనా పౌరుషం వస్తోంది గాని- ఎక్కువగా అబ్బాయిలకి రావడంలేదు దురదృష్టమే!

**అయిలా శ్రీనివాసరావు, నరసారావుపేట**

నాటి రాజులకు నేటి రాజకీయ నాయ కులకు-

తేడా తక్కువే. కనీసం రాజులకు కాస్త మంచిపని చేసి కాలం చేద్దామన్న కోరికేనా వుండేది. వీళ్లకదీ లేదు. ఎన్నాళ్లుంటామో అన్న ఆట తప్పించి!

డబ్బు గొప్పదా? స్నేహం గొప్పదా?

దేనికది గొప్పదే- డబ్బు దగ్గిర నిక్కచ్చిగా వుంటే- స్నేహం నిలుస్తుంది. ..

రామజన్మభూమి బాబరిమసీదు..

ఉచ్చరించకూడని పదాలుగా తయారుచే శారు వీటిని- మన నాయకులు! ఎద్దులు కుమ్ముకుంటూ లేగని పొడిచినట్టు- వీళ్ల తమ కుమ్ములాటల్లోకి అమాయకులను లాగి పొట్టన పెట్టుకుంటున్నారు! నన్నడిగితే- కనీసం ఓ ఐదు సంవత్సరాలపాటు- 'మత పరమైన'వేమీ జరగనివ్వకూడదు. అప్పడేనా మనిషి సృష్టించిన మతం పేరిట కొట్టుకు చావడం మరిచిపోతారేమో.

**వై.ఎస్. ఎన్. మూర్తి, తాళ్లపూడి**

నాకు క్రికెట్ క్రీడాకారుడినవ్వాలని కోరిక కాని ఆ అదృష్టం కలగడంలేదు.

అదృష్టం మిమ్మల్ని వెతుక్కుంటూ రావ




డానికి ఆగితే ఎలా? మీరే దాన్ని వెతు క్కుంటూ వెళ్లాలి ముందు- తాళ్లపూడిలో ఆడండి. మెట్టు మెట్టుగా పైకి రావాలి మరిచిపోకూడదు

**బి.వి.లక్ష్మి, కాకినాడ**

దురదృష్టవంతులు- ధైర్యంగా బ్రతకలేరా అక్కయ్యా

బ్రతికవచ్చు దురదృష్టం- బలహీనులనే పట్టి పీడిస్తుంది మనసు గట్టిదైతే- దురదృ ష్టపు తలతన్ని- నిలబడవచ్చు. వినలేదా- జీవి తపు విషమ సమస్యలు- బలహీనులని యింకా బలహీనపరుస్తాయి. బలవంతులని యింకా బలవంతులని చేస్తాయి

ఈనాటి మత మౌఢ్యాన్ని గురించి మీ అభిప్రాయం?

ఏముంది- మనిషి మతం కోసం- ఏమైనా చేయ సాహసిస్తాడు- మతం గురించి రాస్తాడు, పోరాడుతాడు, చస్తాడు. గాని- దానికోసం బ్రతకడు!!

ఎందుకంటే ఈ ఉపన్యాసాలు, ప్రమా ణాలు- అరచేతిలో స్వర్గాలు చూపించటం! ఇదంతా మోసం కాదా?

ఏం చేస్తాం సోదరీ, మనలో చాలా మంది కాళీ వాగమ్మలాంటి వాళ్లమే- సరుకు కాస్తా చేయవుగాని- తెగ చప్పుడు చేస్తూ పోతాయి!

**బి.ఆర్.మూర్తి, మచిలీపట్నం**

శ్రీ శ్రీ గారి సిరిసిరిమువ్వలో ఆరు ప్రాసల పదాలున్న ఏ పేజీతో వుంది కవి త్వాల పాఠ్యాంశాని మధ్య లేదా దాన్ని కలిపేస్తారు కిర్ర్ మన షవర్క్‌గా తీసుకు న్నారని అనుకోవచ్చా

మత్తుగాయి పాటకే రాతకే కూడా విలువ ఏముంటుంది? పాదరలో ఏదో బలం లేకపోతే కదా- ఎవరేనా వ్యక్తి మాషణికి దిగేది?! అలా అని వూరుకున్నారు!

**పోలోజు ధనలక్ష్మీచారి, బోడుప్పల్**

మొదట్లో అందరూ కాంగ్రెస్‌వారే అంటున్నారు చంద్రశేఖర్. కామెంట్ ప్లీజ్

ఏముంది వీర సోషలిస్టుకి పదవీ వ్యామోహం ఎక్కువైతే-యిలాగే పిచ్చిగా మాట్లాడుతారని- మనం గ్రహించాలి

మండల్ కమిషన్ ద్వారా లాభం ఎవ రికి?

ఇలాంటి వాటిలో లబ్ధిదారులెప్పుడూ- రాజకీయవేత్తలే!

○



# 1942 అక్టోబరు 11న విడుదలైన

# శ్రీ రాజరాజేశ్వరీవారి "సుమతి"

[కన్నాంబ, సి.యస్.ఆర్, రామకృష్ణశాస్త్రి, బళ్లారి లలిత, పద్మావతీదేవి, ఆరణి, కె.వి. సుబ్బారావు, వెంకటచలం, జె శేషగిరి- కళాకారులు. దర్శకత్వం· కడారు నాగభూషణం.]

భగవంతుని లీలలు దురవగాహం. సూర్యరశ్మి నెరుగని శుద్ధాంతకాంత, ఎన్నడూ చేయిజాచి అడిగి ఎరుగని అతివ వేడినిప్పులు కక్కుతూన్న ఎండలో ప్రతిగుమ్మం ఎక్కి దిగుతూంది- కారణం-

కుష్ఠురోగంతో బాధపడ్తూన్న మూర్ఖుడగు తన భర్తమీద ప్రేమానుబంధం- సేవా తత్పరత.

మండుటెండలోని- వీధుల దృశ్యాలన్నీ మద్రాసులోని తిరువాంబూరు వీధుల్లో చిత్రీకరణ జరిపారు: ఆ తదుపరి జెమినీ స్టూడియోలో ముఖ్య సన్నివేశాలన్నీ చిత్రీకరించారు.

సుమతి పాతివ్రత్యాన్ని కడు సమర్థవంతంగా చిత్రీకరించి- విశేష జనాదరణ, ముఖ్యంగా మహిళా ప్రేక్షకాదరణ పొందేలా కృషి చేసినవారు- యీ చిత్ర దర్శకులు శ్రీ కడారు నాగభూషణంగారు.

సతీత్వ ధర్మాన్ని మరిచిపోయి, హైందవ స్త్రీ సాంప్రదాయానికి కళంకం తెసుకువస్తున్న యీనాటి మగువలకు సరియైన మార్గాన్ని చూపి సంసార రంగంలో ఆశాజ్యోతిని వెలిగించే సముజ్వల చిత్రం యిది.

## అలనాటి మేటి చిత్రాలు (15)




అక్టోబరు 19-వ తేదీ

పదకొండు కేంద్రాలలో

బ్రహ్మాండమైన విడుదల




దర్శకుడు

కడారు నాగభూషణం

★

విడుదల కేంద్రాలు

| | |
|---|---|
| శ్రీదుర్గాకళామందిరం | బెజవాడ |
| బృందావన టాకీస్ | బందరు |
| శ్రీసరస్వతి టాకీస్ | గుంటూరు |
| శ్రీసత్యనారాయణ టాకీస్ | తెనాలి |
| జయా టాకీస్ | రాజమండ్రి |
| క్రౌన్ టాకీస్ | కాకినాడ |
| శ్రీరామకృష్ణ టాకీస్ | ఏలూరు |
| శ్రీకృష్ణ సినిమా | విజయనగరం |
| రాజేశ్వరీ టాకీస్ | సికింద్రాబాదు |
| శ్రీవినాయక సినిమా | నెల్లూరు |
| సాగర్ టాకీస్ | బెంగుళూరు |

SOLE PROPRIETORS

SARASWATI TALKIES LIMITED,

HEAD OFFICE -- BEZWADA. | BRANCH — Gandhinagar, BANGALORE CITY.

1942 అక్టోబరు 19వ తేదీ- విజయదశమి రోజున యీ చిత్రం- బెజవాడ- శ్రీ దుర్గాకళామందిరం, బందరు- బృందావన టాకీస్, గుంటూరు- శ్రీ సరస్వతీటాకీస్, తెనాలి- శ్రీ సత్యనారాయణ టాకీస్, రాజమండ్రి- జయాటాకీస్, కాకినాడ- క్రౌన్ టాకీస్, విజయనగరం- శ్రీ కృష్ణసినిమా, సికింద్రాబాదు- రాజేశ్వరీటాకీస్, నెల్లూరు- శ్రీ వినాయకసినిమా, బెంగుళూరు- సాగర్ టాకీస్‌లోనూ విడుదలైంది.

భక్తికి- ముక్తికీ- సందేశానికి 'సుమతి' ఒక చక్కని చిత్రం.

సేకరణ: భీశెట్టి

# పిట్సుబర్గులో ఏడుకొండలవెంకన్న!

కళాప్రపూర్ణ శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి *1990* జూన్ ఏడవ తేదీన కొందరుసాహితీ మిత్రులూ, బంధువుల ఆహ్వానంమీద అమెరికాకి వెళ్లిన సందర్భంగా అమెరికా గురించి వ్రాసిన వ్యాసం యిది.

అది జూలై 18వ తేదీ ప్రభాత సమయాన క్లీవ్‌లాండ్‌లో పిట్సుబర్గుకు బయలుదేరాం మా కుటుంబ సభ్యులతో. ఎందుకు? పిట్సుబర్గులో ఏముంది? ఎవరున్నారు? బంధువులున్నారా? లేరు.



పిట్సుబర్గులో శ్రీ వేంకటేశ్వరుని దేవాలయం.

మరి స్నేహితులో? వారూలేరు. మరి ఎందుకు వెళ్ళి నట్లు అని మీరు ప్రశ్నించవచ్చు.

అదే ఇక్కడి తమాషా. ఎక్కడ అమెరికా, ఎక్కడ ఇండియా. ఎక్కడ ఆంధ్ర ప్రదేశ్, ఎక్కడ ఏడుకొండల తిరుపతి వెంకటేశ్వరుడు. ఇక్కడి కెలా వచ్చాడు.

అమెరికాలో వున్న ఆంధ్రులంతా కలిసి కట్టినది పిట్సుబర్గు వెంకటేశ్వరస్వామి దేవాలయం. ప్రేరేపించినవారు పిట్సుబర్గులో ఉద్యోగాలు చేసుకునే తెలుగువారు.

క్లీవ్‌లాండ్‌కు నూటయాభై మైళ్ళ దూరంలో పెన్సిల్వేనియాలో వున్న అతి పెద్ద పట్టణం పిట్సుబర్గు-అమెరికా వారంతా గర్వించ తగింది పిట్సుబర్గు పట్టణం.

క్లీవ్‌లాండ్ పొలిమేరలు దాటి కొంత దూరం వెళ్ళిన తరువాత పచ్చని చెట్లతో దట్టమైన అడవులు. ఆ అడవులను చీల్చుకుంటూ పోయే అతి విశాలమైన, ప్రశాంతమైన సిమెంటు తారు రోడ్లు, ఎక్కడ చూసినా ఎత్తైన కొండలు. కొండల మీద పచ్చని వృక్షాలు. మధ్య మధ్య మైదానాలు, అందంగా కత్తిరించిన పచ్చని మైదానాలు పంటకు రాబోయే మొక్క జొన్న పొలాలు. పొలాలమధ్య అక్కడక్కడ విసిరేసినట్లు రైతుల ఇళ్ళు. అదంతా మనస్సును రంజింపచేసే ప్రశాంతవాతావరణం.

కళాప్రపూర్ణ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

మధ్య మధ్య చిన్న చిన్న పట్టణాలు. ఆ పట్టణాల్లో అక్కడక్కడ పరిశ్రమలతో



ఆలయ ముఖద్వారం.

పాటు కార్ల కంపెనీలు. ఎవరు కొంటారా అని ఎదురు చూసే వివిధ రకాల పేర్లుగల కార్లు.

పిట్సుబర్గుకు వెళ్ళే దారి ప్రయాణం తిరుపతి నుంచి, మదనపల్లికి బాకరాపేట అడవుల మధ్య నుంచి వెళ్ళినట్లుంటుంది.

ఈ సుదూర ప్రయాణంలో ఎత్తుపల్లాల స్లోపులు గలిగిన రోడ్లు, మధ్య మధ్య

# పిట్సుబర్గులో వెంకన్న

విశ్రాంతి మందిరాలు తినటానికి తిను బండారాలు పిట్సుబర్గు ప్రవేశించేముందు నుంచే రోడ్ మెలికలు మెలికలుగా పాము నడకలా వంకర టింకరగా వుంటుంది

పిట్సుబర్గు చాలా పెద్ద పట్టణం స్టీల్ పరిశ్రమ ఇతర పరిశ్రమలు, చిన్న పరిశ్రమలు అనేకం వున్నాయి అంతా కొండల మయం ఆ మాటకొస్తే ఒకరకంగా మిట్ట మీదే వున్నట్లుంది. అన్ని రోడ్ మలుపులు ఎగుడు దిగుడులు ఏ ప్రక్క చూచినా దట్టమైన అడవి. ఎత్తుమీద ఎన్నో ఇళ్ళుంటే, అంతకంటే పల్లంలో ఎన్నో ఇళ్ళు, రోడ్లన్నీ పాలరాతిలానున్నగా పాలుపోసి మళ్ళీ ఎత్తుకోవచ్చున్నట్లుంటాయి.

చుట్టూ ఎత్తైన కొండలు, మధ్య మధ్య మరికొద్ది ఎత్తైన గుట్టలు ఆ గుట్టల మధ్య పువ్వులులేని చెట్ల పొదలు. ఆ మనోహర వాతావరణంలో లక్క ఇళ్ళులా, అన్నీ చెక్క ఇళ్ళు. మరికొన్ని అతి చిన్న పొదరిళ్ళు. ఆ ఇళ్ళముందు బుల్లి బుల్లి రోడ్లు ఇంటిచుట్టూ కత్తిరించిన గడ్డిలాన్లు అందమైన రంగు రంగుల పూలచెట్లు, ఎక్కడచూచినా ఇళ్ళముందు పచ్చిపడివున్నట్లు అందమైన ఎన్నో రకాల గందరగోళపు కార్లు, ఇళ్ళముందు కార్లు కాపలా, ఇళ్ళల్లో మనుషులు రోడ్‌మీద ఒక్క పురుగు కనపడదు సైకిళ్ళు తొక్కేవాళ్ళు, స్కూటర్ల వాళ్ళు, ఆటో రిక్షాలవాళ్ళూ అసలే కనపడరు

పిట్స్‌బర్గు హిట్సుబర్గులా కనిపిస్తుంది నిజంగా ఆ పిట్సుబర్గ్ ఇదొక స్విట్జర్‌లాండ్‌లా కనిపిస్తుంది అక్కడున్న అనేకమైన కొలనులు లేకపోయినా, చిన్న కాలువలు, అతి పెద్ద అలిగేని నది ఈ అనంతమైన సుందర వాతావరణంలో ఏడుకొండల వెంకన్న ఎక్కడున్నాడో అంతుపట్టలేదు ఇంకా ఎక్కడ? ఇంకా ఎక్కడ-అనుకుంటూ వుండగానే నూరు అడుగుల ఎత్తున్న ఒక ఓవర్ బ్రిడ్జి కనిపించింది దానికి మూడు ఆర్చిలు పైబ్రిడ్జి మీదుగా కార్లు దూసుకుపోతున్నాయి మా కారు ఆర్చి దాటి కుడిచేతి ప్రక్కకు తిరిగింది ఇంతకీ చెప్పొచ్చేదేమంటే నిజానికి మేము కొండలమీదే తిరుగుతున్నాం అలా అలా నాలుగైదు మెలికలు తిరిగి మళ్ళీ కొంచెం ఎత్తుకు వెళ్ళాం అక్కడనుంచి కొంచెం దూరంగా చెట్ల మధ్యనుంచి ధవళకాంతిలో ధగ ధగ లాడుతూ ఒక హిందూ దేవాలయం కనిపించింది ఎత్తైనా కొండమీద గుడి, ఆ గుడి వెనుక దట్టమైన అడవి, అడవితోపాటు ఎంతో ఎత్తైన కొండ భక్తులందరికి ఒడలు పులకరించే దృశ్యమది.

అలా అలా గుడిముందుకు చేరేసరికి ఎత్తైన గాలిగోపుర దర్శనం. ఇరుపైపుల వైష్ణవ మత ద్వారపాలకులు-ముందుగా నన్ను చూడండంటూ విఘ్నేశ్వరుని బుల్లి దేవాలయం. దేవాలయం ముందు ఇరపై కార్లు బారులు తీరి వున్నాయి అది రెండంతస్థుల భవనం క్రింద కచేరీలకూ, కళ్యాణాలకూ ఉపన్యాసాలకూ శిక్షణకూ ఆడిటోరియం, ముందు ఎత్తైన ధ్వజస్తంభం పై అంతస్థులో గుడి.

విఘ్నేశ్వరులవారి దర్శనం అయిన తరువాత రెండవ అంతస్థు మెట్లు ఎక్కుతూ వుండగా, వెంకటేశ్వరుని



కళ్యాణమంత్రోచ్చారణ స్పష్టంగా వినిపిస్తోంది హాలులో ఒకరు కళ్యాణం చేయిస్తున్నారు

గుడి ప్రవేశం ముందు వరకూ ఎండలో వచ్చిన మాకు గుడి ప్రవేశం చల్లదనాన్నిచ్చింది గుడి అంతా సెంట్రల్ ఏ సి

అతి సన్నిహితంగా భక్తులకు దర్శనమిచ్చే వెంకటేశ్వర విగ్రహం అందంగా వుంది. మరో ప్రక్క గదిలో, పద్మావతి అలమేలుమంగ అందంగా అలంకరించివున్నాయి గర్భగుడి ఇరుప్రక్కలా శంఖు చక్రాలు అలంకరించివున్నాయి

ఇంతలో మా మనుమడు ఒక ప్రశ్న వేశాడు, ఏమని గాడ్ మాట్లాడడా అని-

లేదు మాట్లాడడన్నాను గాడ్ గదా? ఎందుకు మాట్లాడడు అని మరో ప్రశ్న - దానికి నా సమాధానంలేదు.

అందరూ భక్తి శ్రద్ధలతో వినమ్రులై అనంతమైన ఆనందంతో కళ్ళు మూసుకు నమస్కరిస్తున్నారు నేను మాత్రం అలాగే నిలబడి గుడినంతా కలయ చూస్తున్నాను - ఇంతలో దబ్బపండులా వున్న బెంగుళూరుకు చెందిన సారనాధ్ అర్చకుడు ముందుకువచ్చాడు అందరి గోత్ర నామాలతో అర్చనచేయించి, కర్పూరం కలిపిన నీళ్లతో తీర్థం ఇచ్చి- షడగోపురం ఆశీర్వాదంతో కర్పూర హారతి ఇచ్చాడు. తరువాత అందరికీ దోరగా పండి ఎండిన ద్రాక్షపళ్ళ ప్రసాదం ఇచ్చాడు.

తరువాత, తిరుపతి లడ్డు-పులిహోర, దద్దోజనం అందరూ ఆరగించారు. గుడి అంతా ఏ మూలకు వెళ్ళినా, పరిశుభ్రంగా వుంది గ్రేనైట్ స్టోన్ గోడలకు అమర్చివుంది-ఒక ప్రక్క గ్రంధాలయముంది. గుడి క్రిందభాగంలో ఆఫీసువుంది. ఆ ఆఫీసులో హైదరాబాదు నుంచి వచ్చిన సూరంపూడి సుదర్శన్ మేనేజరుగా పని చేస్తున్నాడు వయస్సు మళ్ళిన అమెరికన్ ఆమె అకౌంట్సు చూస్తూవుంది. -

1976లో బెంగుళూరుకు చెందిన యం. ఆర్. సంపత్కుమార్ భట్టరు తిరుపతి ఆస్థాన విద్వాన్‌గా వున్నవారు పిట్సుబర్గు వచ్చి ఆగమ శాస్త్ర ప్రకారం ఈ గుడిని ప్రప్రథమంగా కట్టించి తరువాత చికాగో, కాలిఫోర్నియా, వాషింగ్టన్, బోస్టన్ - డేటన్ మొదలైన చోట్ల వెంకటేశ్వర ఆలయాలను నిర్మించాడు.

మరో అర్చకుడు వరదరాజభట్టరున్నారు. మొత్తంమీద నలుగురు అర్చకులు, ఇద్దరు వంటవాళ్ళు వున్నారు

ఇది అమెరికా గడ్డమీద ప్రప్రథమంగా నిర్మించిన వెంకటేశ్వర దేవాలయం. అమెరికాలో వున్న ప్రతి తెలుగువాడూ, దీనిని దర్శిస్తాడు-కళ్యాణోత్సవం, బ్రహ్మోత్సవం, వసంతోత్సవం, హిందూ పండుగలన్నీ జరుగుతాయి. ఏనుగు, గరుత్మంతుని వాహనాలున్నాయి.

ప్రతి సంవత్సరం ఈ దేవాలయాన్ని పదివేలమంది భక్తులు దర్శిస్తారు. మిలియన్ డాలర్సు ఆదాయంవస్తుంది. ఒక శిల్పికూడా దేవాలయంలో వున్నాడు ప్రస్తుతం కృష్ణుడు రథంమీదనున్న అర్జునునికి గీతోపదేశం చేస్తున్న శిల్పాన్ని చెక్కుతున్నారు-సంవత్సరానికి ఖర్చు 7 లక్షల డాలర్లు వుంటుంది.

అర్చకులకు క్వార్టర్సు వున్నాయి శని ఆదివారాల్లో చాలామంది భక్తులు వస్తారు ప్రస్తుతం తమిళనాడుకు చెందిన శ్రీమతి

జయమణే ప్రతి ఆదివారం, నృత్యం క్లాసులు నడుపుతూ వున్నారు

ప్రతి సంవత్సరం ఇండియానుంచి మృదంగం, వయొలిన్, ఒకల్ విద్వాంసుల్ని రప్పించి సంగీతపు క్లాసుల్ని నడుపుతున్నారు దీనికి అమెరికాలో వున్న వారు వచ్చి సంగీతాన్ని నేర్చుకుంటారు ప్రతి ఆదివారం సంస్కృత పాఠాలు నడుస్తాయి అప్పుడప్పుడు మత సంబంధమైన ఉపన్యాసాలు నడుస్తాయి

వెంపటి సత్యం వచ్చి ఇక్కడ నృత్య ప్రదర్శనిచ్చారు ఆంధ్రప్రదేశ్ నుంచి వీరగంధం వెంకటసుబ్బారావు మొదలైన వారు హరికథలు చెప్పారు- తివాసీలు పర్చిన ఆడిటోరియం వుంది మరో ఆడిటోరియం, పాఠాల కొరకు అమెరికా ఆర్కిటెక్ కడుతున్నారు అమెరికా వాసులకు కావలసిన టబ్, షవర్‌బాత్ లాంటి అన్ని సౌకర్యాలూ వున్నాయి

గుడిముందు పచ్చనిలాన్, లాన్ చుట్టూ రోజా పూలచెట్లు దేవాలయ నిర్వహణకు పదిహేనుమంది డైరక్టర్లు వున్నారు పదిహేనుమంది ఎగ్జిక్యూటివ్ సభ్యులున్నారు ఇరవై రెండుమంది ట్రస్టు ఫండ్ కమిటీ సభ్యులున్నారు

తిరుపతిలో జరిగే కార్యక్రమాలన్నీ ఇక్కడా జరుగుతున్నాయి అయితే మోసగాళ్ళు లేరు, కోతులు లేవు పోయినా పులిహోరా దద్దోజనం ఆరగించి, హరే కృష్ణా హరేరామా టెంపుల్‌కు బయలుదేరుతుండగా, పదిహేను మంది అమెరికన్స్ వెంకటేశ్వర దర్శనానికి వచ్చారు వారిలో కొందరు రోగగ్రస్థులు, వారూ ఎంతో భక్తి శ్రద్ధలతో నమస్కారాలు చేశారు

మేము అక్కడ వుండగానే నలుగురైదుగురు కార్లలో వచ్చారు నన్ను గుర్తుపట్టారు కుశల ప్రశ్నలు జరిగాయి.

ఇంతకీ నేను వెంకటేశ్వరునికి దణ్ణం పెట్టనేలేదు మరి ఆయన ఏమనుకున్నాడో, అక్కడ నుంచి వెస్టు వర్జీనియాలో వున్న వుయ్‌లింగ్ హరేకృష్ణ టెంపుల్‌కు కదిలిపోయాము

అది ఒక సుందర మందారం
పిట్స్‌బర్గు దేవాలయం.

పచ్చని అమెరికాలో ఆంధ్రులందరూ ఆరాధించే దేవుడున్నందుకు అందరూ గర్వించాల్సిందే

ఆ కార్యకర్తలకు అభినందనాలు చెప్పాల్సిందే ○

# మీకు తెలుసా?

## ఎక్కువమందిని అవుట్ చేసిన వికెట్ కీపర్

వికెట్ కీపర్‌గా ఎక్కువమందిని అవుట్ చేసిన ఘనత ఎస్ ఎం. హెచ్ కిర్మానిది అతను పాల్గొన్న 88 పోటీలలో



198 మంది బ్యాట్స్‌మెన్‌లను అవుట్ చేశాడు (160 కాట్ బిహైండ్, 38 స్టంపింగ్)

## ఎక్కువ స్టంపింగ్స్ (ఇన్నింగ్స్)

ఒక టెస్ట్ ఇన్నింగ్స్‌లో ఎక్కువ స్టంపింగ్‌లు చేసిన ప్రతిభ కిరణ్‌మోరేకు దక్కుతుంది ఒకే టెస్ట్ ఇన్నింగ్స్‌లో ఐదు స్టంపింగ్‌లు చేసి మోరే ప్రపంచ రికార్డు స్థాపించాడు 1988 జనవరిలో వెస్టిండీస్‌తో జరిగిన పోటీలో రెండవ ఇన్నింగ్స్‌లో మోరే స్టంపింగ్ చేశాడు

## టెస్ట్ పోటీలో క్యాచ్‌లు

టెస్ట్ పోటీలో ఎక్కువ క్యాచ్‌లు పట్టింది యజువింద్రసింగ్. 1977 జనవరి 28 నుంచి ఫిబ్రవరి 2 వరకు బెంగుళూరులో ఇంగ్లండ్‌తో జరిగిన టెస్ట్‌లో సింగ్ 7 క్యాచ్‌లు పట్టి రికార్డు సృష్టించాడు

## మరో ఆటకు ప్రాతినిధ్యం వహించిన టెస్ట్ క్రికెటర్

1928లో అమ్‌స్టర్‌డాంలో జరిగిన ఒలింపిక్ గేమ్స్‌లో పాల్గొన్న జాతీయ హాకీ బృందంలో సభ్యుడిగా టెస్ట్ క్రికెటర్ నవాబ్ పటౌడి (సీనియర్) భారత్ తరపున ప్రాతినిధ్యం వహించారు

## హిర్వానీ బౌలింగ్ ప్రతిభ

నరేంద్ర హిర్వానీ పాల్గొన్న మొదటి నాలుగు టెస్ట్ పోటీలలో బౌలింగ్‌లో ప్రతిభ చూపెట్టి రికార్డులు సృష్టించాడు మొదటి మూడు టెస్టులలోనే 31 వికెట్లు సంపాదించాడు

## ఒకే ఓవర్‌లో ఎక్కువ పరుగులు

ప్రపంచంలో ఒకే ఓవర్‌లో ఎక్కువ పరుగులు చేసిన వారిలో రవిశాస్త్రి రెండవ వాడు 1985లో బొంబాయి బరోడా జట్ల మధ్య జరిగిన రంజీట్రోఫీలో రవిశాస్త్రి ఒకే ఓవర్‌లో 36 పరుగులు చేశాడు

## ఒకే ఇన్నింగ్స్‌లో ఎక్కువ సిక్సర్లు



1984-85లో బొంబాయిలో జరిగిన రంజీట్రోఫీలో రవిశాస్త్రి 13 సిక్సర్లు కొట్టాడు ఈ పోటీ బరోడా జట్టుతో జరిగింది

## జీవితంలో ఎక్కువ డబుల్ సెంచరీలు

తన జీవితంలో ఎక్కువ డబుల్ సెంచరీలు చేసిన ఘనత విజయ్‌మర్చంట్‌కు దక్కుతుంది 1941-46 మధ్య మర్చంట్ 11 సార్లు డబుల్ సెంచరీలు సాధించాడు

సేకరణ: తిలక్

# సినిమా.. సినిమా..

దర్శకుడ్నయ్యాను. ఆయన రాధికతో కలిసి ఒక డ్యూయెట్‌ను, స్వయంగా ఓ సోలో ను పాడారు. నాయికగా కొత్త నటి ఉంటుంది" అన్నారు డాక్టర్ శివప్రసాద్. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో డాక్టర్ ఏ. విజయలక్ష్మి సమర్పించే శ్రీ సాయి మాధవీ ఆర్ట్స్ తొలి చిత్రంలో నూతన్ ప్రసాద్, వేలు, వెన్నిరాడై మూర్తి, రాజ్ వర్మ, గరగ, వై. విజయ, ఫణి, తిరుపతి రంగన్నల కళాకారులు పాల్గొంటున్నారు.

రక్షిస్తుంది. నాయికా నాయకుల మధ్య ఉత్తరాల రాయబారం నడుపుతుంది. వాళ్ళతో పాటు డాన్స్ చేస్తుంది. కొన్ని సన్నివేశాలలో కడుపుబ్బ నవ్విస్తుంది కూడా. ఇంతే కాక సింహం, వందలాది సర్పాల రూపాలతో దుర్గ అమ్మవారు వచ్చి భక్తులను కాపాడే దృశ్యాలు ఒళ్ళు పులకరింప జేస్తాయి," అన్నారు లక్ష్మీకాంత్. ఈయన సమర్పణలో "దేవీ పూజ, దేవీ వ్రతం" అనంతరం నీలిమ



"నా ఇల్లే నా స్వర్గం"లో దివ్యభారతి

స్రవంతి మూవీస్ చిత్రం

"స్టీరియో సోనిక్ సౌండ్ సిస్టమ్ అదనపు ఆకర్షణ. డిసెంబర్ 25 నుంచి 30 వరకు కొడైక్కెనాల్‌లో షూట్ చేశాం. జనవరి 4 నుంచి ఫిబ్రవరి 10 వరకు తిరుపతి పరిసరాలలో, మార్చి 20 నుంచి

ఎగ్జిక్యూటివ్స్: వల్లూరుపల్లి రమేష్ బాబు, కె.వి. కృష్ణారావు, నిర్మాత: రవి కిశోర్.

"శివ-శక్తి"లో నరేష్

"శివ- మనిషి ఎంత కరుకో మనసంత మెత్తన. మనసులో ప్రేమానురాగాలు దాచుకునే పాత్ర. శక్తి- పూర్తిగా

నెలాఖరు వరకు హైదరాబాద్‌లో షూటింగ్" అన్నారు ఉప్పలపాటి నారాయణరావు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే : దర్శకత్వంలో శారదాదేవి సమర్పించే స్రవంతి మూవీస్ చిత్రంలో నాగార్జున, విజయశాంతి, చంద్రమోహన్, తనికెళ్ళ భరణి, గుంటూరు శాస్త్రి, ఢిల్లీ గణేష్, బెనర్జీ, మురళి, కృష్ణభగవాన్, కాకినాడ భద్రం, కాంతలత, కొత్త విలన్, కార్తీక్ విజయకుమార్ పాల్గొంటున్నారు. తనికెళ్ళ భరణి సంభాషణలకర్త. ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం స్వరకల్పనలో వేటూరి, సీతారామశాస్త్రి, వెన్నెలకంటి అద్భుతదీపక్ గీతాలు రాశారు. హరి అనుమోలు ఛాయ, శ్రీకర ప్రసాద్ కూర్పు, సాయిబాబు నిర్వహణతో తమ్ముడు సత్యం ఎగ్జిక్యూటివ్ నిర్మాత. ప్రొడక్షన్

"నడుస్తున్న చరిత్ర" లో పుండరీకాక్షయ్య, ప్రసన్నకుమార్, శాంతిలత



అమాయకపు పాత్ర. ఈ రెండిటినీ సురేష్ అద్భుతంగా నిర్వహించారు" అన్నారు భరద్వాజ. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో సూరపనేని భావ నారాయణ నిర్మించిన సాయి ప్రొడక్షన్స్ "శివ-శక్తి" చిత్రంలో లిజి, సిందు, కోట శ్రీనివాసరావు, రమేష్, జి. నిర్మల ఆదిగా గలవారు పాల్గొన్నారు. దివాకరబాబు, భువనచంద్ర, రాజ్-కోటి, జయరాం, రామలింగేశ్వరరావు, కళ, రాజు, మురళీ రామయ్య ప్రభృత సాంకేతికవర్గంతో వి. ప్రతాపరావు సహ నిర్మాత. జి. రామారావు సమర్పణ.

### శ్రీ అన్నపూర్ణ సినీ చిత్ర తాజా చిత్రం

తమిళ హిట్ చిత్రం "నడిగన్" ఆధారం. కొడైక్కెనాల్‌లో ఔట్‌డోర్ షూటింగ్. ఫిబ్రవరిలో షూటింగ్ పూర్తవుతుంది" అన్నారు కాట్రగడ్డ ప్రసాద్. ఈయన నిర్మాణ సారథ్యంలో టి. ఆర్. తులసి నిర్మిస్తున్న శ్రీ అన్నపూర్ణ సినీ చిత్ర తాజా చిత్రంలో సుమన్, అమల, షావుకారు జానకి, బాబూ మోహన్, మల్లికార్జున రావు, ప్రతాప్‌చంద్రన్, డబ్బింగ్ జానకి వగైరా నటవర్గం. ఓంకార్ మాటలు, వేటూరి పాటలు, రాజ్-కోటి సంగీతం, మహీధర్ ఛాయ, శ్రీనివాసరాజు శిల్పం, నైకా విశ్వనాథ్ సంయుక్త దర్శకత్వం, మురళీ రామయ్య కూర్పు. దోనేపూడి ప్రసాద్ నిర్వహణతో శరత్ దర్శకుడు.

రాజేంద్రప్రసాద్ "ప్రేమ తపస్సు"

"రాజేంద్రప్రసాద్ ప్రోత్సాహంతో



"తల్లిదండ్రులు"లో బాలకృష్ణ

కులశేఖర్, రాజశేఖర్ మాటలు రాశారు. వెన్నెలకంటి, వేదవ్యాస గీతాలను రాజా స్వరపరిచారు. ఎస్. ఎస్. రాజా, ఛాయ, రంగారావు శిల్పం, శ్రీను నృత్యాలు, సతీష్ కూర్పుతో టి. ఉషారాణి నిర్మాత.

### "కార్తీకమాసం"

ఈ చిత్రంలో ఏనుగు 'రాము' చేసిన అద్భుతాలు హైలైట్స్. ఇది ఫెక్ట్స్ చేస్తుంది. చిన్న పిల్లలతో కలిసి దాగుడు మూతలు ఆడుతుంది. వేగంగా దూసుకు వస్తున్న లారీని ఆపి, దాని కింద నలిగి పోబోయే పసిబిడ్డను

ఆర్క్ ఫిలిమ్స్ అందించే మరో భక్తిరస ప్రధాన చిత్రం "కార్తీక మాసం" రవిబాబు, విమల్‌రాజ్, కనక, దీప, సరళ ఆదిగా గల వారు పాల్గొన్నారు. వసంతకుమార్ రచన, ఇళయరాజా సంగీతం, నరసింహారావు కూర్పు, నాగండ్ల శివనారాయణ నిర్వహణతో వి. వెంకట్రావు నిర్మించిన ఈ చిత్రానికి ఏ. ఆర్. సోమసుందర్ దర్శకుడు.

జి. వి. జి.

సీరియల్

# భారత మహాకవిత్రయం

## భాగవతుల సుబ్రహ్మణ్యం

**ఇంతవరకూ సాగినకథ-15:** చాళుక్య ప్రభువు రాజరాజ నరేంద్రుల కుల బ్రాహ్మణుడు నన్నయ భట్టారకుడు సోమేశ్వర త్రైలోక్యమల్లుడు రాజ్య బహిష్కరణ చేసిన నారాయణభట్టు- నన్నయద్వారా రాజాశ్రయం సంపాదించి అగ్రహారాలు దానంగా పొందుతాడు నన్నయ మరణానంతరం మహాభారతాంధ్రీకరణ అవిచ్ఛిన్నంగా సాగేందుకు రాజరాజ నరేంద్రుడు ఏర్పాట్లు చేస్తాడు దశకుమార చరిత్రను ప్రయోజనాత్మకంగా తీర్చి దిద్దాలనుకుంటాడు కేతన

(గత సంచిక తరువాయి)

శాపానుగ్రహ శక్తి యుక్తుడు, అమలాచారుడు, సాహిత్య విద్యాపారీణుడు, ధర్మ మార్గ పథికుడు, అర్థార్థిలోకావన వ్యాపార వ్రతుడు, వృద్ధుడైన మంత్రి భాస్కరుడు తన మనుమడు తిక్కన గృహానికి వేంచేశాడు.

ఆ సమయానికి తిక్కన అర్ధనిమీలిత నేత్రుడై శివధ్యానంలో వున్నాడు

మనుమని ధ్యాననిష్ఠకు అంతరాయం కలిగించడం ఇష్టంలేక అక్కడే వేదిక మీద వున్న తాటాకుపాత్రం తిరగేయ సాగాడు భాస్కర మంత్రి

అది- తన మనుమడు ఇటీవలే ఆరంభించిన 'నిర్వచనోత్తర రామాయణం'

గత మాసం రోజులుగా, కృత్యాద్యవస్థతో సతమతమై ఇటీవలే తొలి పద్యం లిఖించినట్టున్నాడు

తాళపత్రం తీసి చూసేంతలో తిక్కన కన్నులు తెరిచాడు ఎదురుగా తాత గారు.

వెంటనే వినమ్రంగా శిరసు వంచి, రెండు చేతులూ మస్తకానికి ఆనించి జోడించి-

'సార కవితాభిరాము గుంటూరు
విభుని
మంత్రి భాస్కరు మత్పితా
మహుని దలచి
యైన మన్నన మెయిలోక మాదరించు
వేళ నా కృతి గుణములు వేయునేల?'

అని, పితామహుని పలకరించాడు

"ఏరోయ్ మనవడా? చాలా కాలంగా ఊరిస్తూ వస్తున్న ఉత్తర రామాయణం ఆరంభించినట్టున్నావే!" చిర్నవ్వుతో అన్నారు భాస్కరామాత్యులు.

సమాధానంగా పద్యమే చెప్పాడు తిక్కన.

"ఎత్తరి నైనను ధీరో
దాత్త నృపోత్తముడు రామ
ధరణీపతి స
ద్వృత్తము సంభావ్యమగుట
నుత్తర రామాయణోక్తి
యుక్తుడ నైతిన్"

పూర్వ రామాయణం రాయకుండా ఉత్తర రామాయణం ఎత్తుకున్నావే!"

అది నువ్వు రాస్తావని వదిలేశాను" నవ్వేస్తూ అన్నాడు తిక్కన

'తాతతో పరిహాసమా? ఇక నేనెంత కాలం వుంటాననీ? ఏపాటి మాత్రం వుండనీ? నిరుత్సాహంగా అన్నారు భాస్కరులు

"నీకేం తాతయ్యా! సంపూర్ణ శతాయుష్కుడవి! శతాధిక వత్సర జీవి వైన నువ్వే మాకు అన్ని విధాలా మార్గదర్శకుడవి"

"పూర్వ రామాయణం రాయాలన్నది నా చిరకాలవాంఛ! అలా అని చాలా కాలంగా చెప్తూ వస్తున్నాను తప్ప, రాయలేక పోయానే అన్న బాధ కూడా కించిత్ నాకుంది"

పోనీలే తాతయ్యా! రామాయణాన్ని ఆదికవి నన్నయ 'రామాభ్యుదయం'గా రాశారు కదా! రామకథ ఎవరు రాసినా రక్తి కడుతుంది కారణం- రామకథ

అంతా బాగానే వుంటుంది... ఒకరు స్పృశించిన అంశాన్ని నేను స్పృశించడ మెందుకని ఉత్తర రామాయణ గాథ నెత్తుకున్నాను."

"రాఘవాభ్యుదయం నేనూ చూశాను. అది చంపూ కావ్యం. అదికాక గోనబుద్ధ భూవిభుని రంగనాథ రామాయణం వుండనే వుంది"

"అందుకే కదా! గద్యపద్య సమ్మిశ్రితంగా కాక నిర్వచనంగా వ్రాయాలని నేను సంకల్పించింది!" దీర్ఘం తీసూ అన్నాడు తిక్కన.

"అంటే... నువ్వు కూడా నేటి శివకవుల ప్రభావానికి లోనయ్యావా?" అనుమానంగా ప్రశ్నించారు భాస్కరులు.



"అయ్యాను... అయితే ఎంత వరకూ? మార్గానుసరణ వరకు మాత్రమే! కాని, ఈ శివకవులపై పరోక్షంగా విమర్శనాస్త్రాలు సంధించడానిక్కూడా నేను వెనుకాడబోను. నా దృష్టిలో కుకవు లెవరైనా దుర్విటులతో సమానం!"

"బుధారాధనా విధేయుడివి కదా! వారిపై అంత అధిక్షేపానికి కారణం!"

"అది మీకు తెలిసిందే! వీరి వీరశైవం ఎలా చిందులు తొక్కుతోందో- ఎలా శివమెత్తిపోతోందో చూస్తున్నారు కదా! నన్నయను ఎత్తిపొడుస్తూ 'అరూఢ గద్య పద్య సంస్కృత భూయిష్ఠ ప్రబంధ రచన మానుగా సర్వసామాన్య సామా

న్యంబు గాదు' అని ప్రవచిస్తున్న రోజులివి. మరి ఈ దేశి కవితాశాఖ, సంస్కృత వాఙ్మయ మర్యాదకు లోబడదు కదా!"

"ఓహో! ప్రాస నియతి లేని సంస్కృత వ్యాకరణానికి, తెలుగును శాసించగల హక్కు లేదని వాదించే శివకవులంటే అందుకా నీకంత ఆక్షేపణ?"

"అంతేకాదు! తెలుగు కవితకు ప్రత్యేక భూషణాలు ఎన్నో! రంగనాథ రామాయణం చూశారు గదా! ఛందస్సు చూస్తే 'దేశి'లో వుంది. ద్విపద. ఇతివృత్తం సంస్కృత రామాయణమే!

"నిజమేరోయ్ మనవడా! నేనీ విషయం గుర్తించలేక పోయాను సుమీ! జాను తెనుగు, దేశికవిత... ఇవన్నీ సిద్ధాంత పరమైన రాద్ధాంతాలే తప్ప, వాటి అంతస్తత్వం ఏమిటో నీలాంటి కవులే కనుక్కోవాలి".

"తాతగారు తమరు మీకు నేను దగ్గులు నేర్పాలా? సార కవితాభిరాములైన తమరు తెలీనట్టు నటించి ఊరకే నన్ను పెద్దవాణ్ణి చేస్తున్నారు."

తిక్కన ఘంటాన్ని రక్షించిన ఒర-

భారత మహా కవిత్రయం

"లేదురా తిక్కనా! 'అల్పాక్షరంబుల ననల్పార్థ రచన' తమ సారస్వతపు ప్రత్యేక లక్షణమని విర్రవీగుతున్న వీళ్లపై విమర్శనాస్త్రాలు సంధించాల్సిందే!"

"అయితే, అనుభవసారంతో మీరు నన్ను సమర్థిస్తున్నారన్న మాట! మీ ప్రేరణతో ఈ నిర్వచనోత్తర రామాయణ పీఠికనే ఓ గొప్ప సాహిత్య సమీక్షా పర్వంగా తీర్చిదిద్దుతాను"

"భేష్! అదే జరిగితే, నీ ఈ పీఠిక తెలుగున ఆలంకారిక సంఘాన అగ్ర గౌరవాన్నంద గలదు" నిండుగా దీవించారు భాస్కరులు

"ధన్యోస్మి తాతా! ధన్యోస్మి! మీ దీవెన ఫలించు గాక! ఇదుగో! తొలి విమర్శనాస్త్రం సంధిస్తున్నాను. చూడండి!..

'జాత్యముగాని నొప్పయిన
సంస్కృత మెయిడఁ జొన్ప వాక్యసాం
గత్యము చేయుచో నయిన గద్యము
తో డుగఁ జెప్పి వెట్ట దౌ
ర్గత్యము దోప ప్రాసము ప్రకారము
వేఱగు నక్షరంబులన్
గ్రా త్యను రూపమంచు నిద
సూరుల కివ్విధమింపు జింపదే?"

(ఇంకా వుంది)

# "ఏ భార్య అయినా భర్తని కొంగుకి కట్టుకోబోతే ఆ భర్త తొందరగా చేజారిపోతాడు!"



## అంటోంది ఏకతా

'అవ్వల్ నంబర్' ద్వారా దేవానంద్ పరిచయం చేసిన కొత్త తార ఏకతా. ఆ చిత్రం ఫ్లాప్ అయినా, ప్రస్తుతం ఏకతా బిజీగానే ఉంది. తలాష్, అమన్ కే ఫరిస్తే, గ్యాంగ్, జాన్ సే ప్యారా, తహల్కా, ఫతేహ్, ఇతరా మొదలైన చిత్రాల్లో నటిస్తున్న ఏకతా చాలా బోల్డ్ గర్ల్. కొన్ని క్లిష్టమైన ప్రశ్నలకి కూడా చాలా బోల్డ్‌గా, తెలివిగా జవాబులు చెప్పగలదు.

ప్ర: ఆదిత్యపంచోలీ భార్య జరీనా వహాబ్ రెండోసారి తల్లి కాబోతోందనీ, ప్రస్తుతం ఆదిత్య పంచోలీతో మీ ప్రేమ ఫుల్‌స్వింగ్‌లో ఉందనీ జనం చెప్పుకుంటున్నారు. జరీనా భర్త కోసం పంపిన భోజనం కూడా మీరిద్దరూ పంచుకుని తింటున్నారట. ఇది నిజమేనా?

జ: చూడండి సార్! నేను తిరుగుబోతుని కావాలని సినిమాల్లోకి రాలేదు. అలా కావాలనుకుంటే సినిమాల్లోకే రానవసరంలేదు. బయట నుంచే బోలెడు గ్రంథాలు నడిపి, చాలా సంపాదించుకోవచ్చు. ఆదిత్య పంచోలీతో నేను నటిస్తున్నాను. రెండుమూడు సార్లు ఆయనతో, ఆయన సతీమణి పంపిన భోజనం నేను షేర్ చేసుకుని తిన్నానే అనుకోండి- ఇదేం మహాపరాధమా? మటన్ స్పెషల్ ఉంది అని ఆయన అడిగిన మీదట మేకప్ రూంలో రెండుసార్లు జరీనాగారు పంపిన భోజనం ఆదిత్యతో తిని వుంటాను. ఇది తప్పా? అర్థం పర్థం లేకుండా సంబంధాలు కలిపి నీచంగా మాట్లాడటం ఈ చిత్రసీమలో చాలా సర్వ సాధారణమైన విషయం.!

ప్ర: తను పంపిన భోజనం తన భర్తతో కలిసి మీరు హాయిగా తినటం మాత్రమేనా జరీనాకి మీ మీద కోపానికి కారణం?

జ: జరీనాగారికి నా మీద కోపమా? చాలా ఆశ్చర్యం! ఆదిత్యతో నేను కలిసి పని చేస్తున్నాను. ఆయనతో మధురమైన సంబంధాలున్నాయి. హి ఈజ్ వెరీ నైస్. పోతే జరీనాకి కోపం తెప్పించగల పనేదీ నేను చేయలేదు సార్! ఇంకో సంగతి- ఏ భార్య అయినా భర్తని కొంగుకి కట్టుకోబోతే, ఆ భర్త తొందరగా చేజారిపోతాడు! ఇది నేను జరీనాగారికి చెప్పటం లేదు- ఇది చాలా సర్వసాధారణ విషయమని చెప్తున్నాను. ఎవరికైనా అప్లై అవుతుంది.

ప్ర: మిమ్మల్ని మీరు చాలా స్ట్రిక్ట్‌లైన్ చేసుకుంటున్నట్టు, డిసిప్లిన్‌కి ప్రాముఖ్యత ఇవ్వబోతున్నట్లు క్రిందటిసారి అన్నారు. కాని



అలాంటిదేమీ మార్పు మీలో కనిపించటం లేదే?

జ: మీరు పొరబడుతున్నారు. నేను చాలా మారిపోయాను. ఇప్పుడు నేను చాలా సీరియస్ అయిపోయాను. ఎవరు కనిపిస్తే వాళ్ళతో నవ్వుతూ మాట్లాడటం లేదు. కాలక్షేపానికి కూడా వినోదాన్ని ఆశ్రయించటం లేదు. నేను నటిస్తున్న సాటి నటులతో మాత్రమే మాట్లాడుతున్నాను. ఇక్కడ అడుగు తీసి అడుగు వేస్తే, వాటికి వెకిలి నవ్వులతో అర్థాలు సృష్టిస్తారు. మొదట్లో ఎవరేమన్నా చాలా సీరియస్‌గా తీసుకుని, చాలా సేపు బాధపడేదాన్ని. ఇప్పుడు ఈ పరిశ్రమ 'పల్స్' తెలుసుకున్నాను! ఐ కేర్ ఎ ఫుట్ ఆఫ్ సచ్ థింగ్స్....

ప్ర: మీరు పెళ్ళి చేసుకోరా?

జ: ఇదేం ప్రశ్నసార్? నాకేం తక్కువని? నేను అందంగా లేనా? వయసులో లేనా? ఏం లేదని పెళ్ళి చేసుకోను? పెళ్ళి చేసుకుని, సెటిల్ అయిపోవాలన్న ఆలోచన నాకూ వస్తోంది. చెప్పా చేయకుండా, చడీ చప్పుడు లేకుండా పెళ్ళి చేసేసుకుంటాను. ఎవ్వరినీ పిలవను!

ప్ర: ఎవ్వరినీ పిలవరా?

జ: అవును, ముఖ్యంగా ప్రెస్‌ని! నోటికొచ్చినట్టు నా గురించి రాసారు. రాస్తున్నారు. వాటిలో నిజాలేవీ ఉండవు. నేను వాళ్ళ పట్ల ఎప్పుడూ 'మిస్ బిహేవ్' చేయలేదు. అయినా ప్రెస్ నా గురించి చాలా జుగుప్సాకరంగా రాసింది. ప్రెస్

# కదంబం

## పిచ్చాసుపత్రిలో హిట్లర్

నరరూప రాక్షసుడని పేర్గాంచిన హిట్లర్ ఒక సారి ఓ పిచ్చాసుపత్రికి వచ్చాడు. అక్కడి వార్డన్‌లు ముందే తర్ఫీదు ఇచ్చినట్టు అక్కడున్న పిచ్చివాళ్ళందరూ "హిట్లర్‌కీ జై! హిట్లర్‌కీ జై!" అని జయజయ ధ్వానాలు చేయసాగారు. హిట్లర్ పరమానంద భరితుడయ్యాడు. ఆ పిచ్చివాళ్ళ వెనుక ఉన్న ఒక వ్యక్తిని చూడగానే హిట్లర్ ముఖద్యుతులు మారాయి. అతన్ని దగ్గరికి పిలిచి, "వాళ్ళతో పాటు నువ్వు ఎందుకు జై అనలేదు?" అని అడిగాడు.

"అయ్యా! పిచ్చి వాళ్ళకు, వాళ్ళను చూసుకునే వార్డన్‌ని నేను," అని జవాబు వచ్చింది

## అందమైన వ్యక్తి

రద్దీగా ఉన్న బస్సులోకి ఇద్దరు యువతులు ఎక్కారు ఇటు అటు చూశారు ఎక్కడా ఖాళీ లేదు. అంతా పురుషుల మయం వాళ్ళల్లో ఒక అమ్మాయి మెదడులో ఓ మెరుపు మెరిసింది. "ఏ అందమైన వ్యక్తి అయినా లేచి తన సీటు నాకిస్తే ఎంత బావుణ్ను!" అంది.

వెంటనే చాలా మంది మగరాయుళ్ళు సీట్లలోంచి లేచి నిలుచున్నారు.

## గురుభక్తి

అంబేద్కర్ అసలు పేరు భీమరావు అన్న విషయం ఎంత మందికి తెలుసు? ఆయన చదువుకున్న స్కూల్లోని ఓ మేస్టారి పేరు అంబేద్కర్ ఆ గురువు వల్ల తనకెంతో జ్ఞానోదయం అయినందుకు తన పేరును అలా మార్చుకున్నారట

## ప్రమోషన్ లేని హోదా

చలోక్తులు విసరడంలో నీలం సంజీవరెడ్డిగారు ఘటికులు ఆయన రాష్ట్రపతిగా ఉన్న చివరి రోజుల్లో అభిప్రాయ భేదాలవల్లనో, దేహారోగ్యం దృష్ట్యానో ఆ పదవి నుంచి విరమించదలచినట్లు పలువురికి చెప్పేవారు ఒకసారి బి బి సి విలేఖరి ఆయన్ని ఇంటర్వ్యూ చేస్తూ, "ఇంత గొప్ప పదవి నుంచి తప్పుకోవాలని ఎందుకు అనుకుంటున్నారు?" అడిగాడు.

"ఏం పదవండీ.... ప్రమోషన్ లేని పదవి," అన్నారు రెడ్డిగారు.

కాస్సేపటికి గాని ఆయన వాక్చాతురత లోని భావం ఆ విలేఖరికి బోధపడింది కాదు.

## ఐశ్వర్య రహస్యం

జపాన్‌లోని 50 ఏళ్ళ యోషియాకి "దుస్తుమి" అనే సంస్థ అధినేత. నేడు ప్రపంచంలోని మిక్కిలి ధనవంతులలో ఆయనొకడు ఆయన ఆస్తి పాస్తులు 28,000 కోట్లకు పైగా ఉంటాయి "మీరింత సంపన్నులుగా ఉండడంలోని కిటుకు ఏమిటి?" అని ఆయన్ని ఒక పాత్రికేయుడు అడిగాడు

"మా ఫ్యాక్టరీలో నా కంటికి తెలీకుండా పూచిక పుల్లయినా బయటకు వెళ్ళడానికి వీల్లేదు," అన్నాడాయన

## పెద్ద హోటల్

ప్రపంచంలో అత్యధిక గదులున్న హోటల మాస్కోలోని "హోటల్ రష్యా" ఇక్కడ 3 200 గదులున్నాయి.

## దేశం పేరు లేని స్టాంప్

ఈ ప్రపంచంలో ఇంగ్లాండ్ స్టాంపులలో నే ఆ దేశపు పేరు ఎక్కువగా ఉండదు

## మొరగని కుక్క కరుస్తుందా?

మొరిగే కుక్క కరవదంటారు మొరగని కుక్క కరుస్తుందా? ఆస్ట్రేలియాలోని 'టింకో' జాతి కుక్కకు మొరగడం తెలీదు కరవడం సరేననుకోండి

–జి. వి. జి.

## ......చేజారిపోతాడు!

నా పట్ల 'సవతి తల్లి'లా ఎందుకు వ్యవహరిస్తుందో నాకు అర్థం కాదు.

ప్ర: 'అవ్వల్...' తర్వాత దేవానంద్ మిమ్మల్ని పట్టించుకోలేదు. అయినా ఆయనంటే మీరు పడి చస్తారు. ఆయన గురించి గొప్పగా చెప్తారు. ఎందుకని? ఇలా మీకు పబ్లిసిటీ కావలసినంత వస్తుందనా?

జ: ఆయన గురించి మీరు పొరపడుతున్నారు. దేవ్‌సాహబ్ చాలా మంచిమనిషి. నేను బిజినెస్ రిలేషన్‌తో మాట్లాడటం లేదు. అయన నన్ను కూతురిలా ప్రేమిస్తారు. మిగతా వాళ్ళతో ఆయన్ని నేను పోల్చుకోలేను. ఆయన కలిసినప్పుడు నాలోని ఉత్సాహం రెట్టింపవుతుంది

ప్ర: ఇంతగా మీరంటే ఇష్టపడితే, ఆయన 'సౌకరోడ్'లో మీకెందుకు అవకాశం ఇవ్వలేదు?

జ: 'సౌకరోడ్'లో హీరోయిన్ వివాహిత. నేను సూట్ కాను. నేను చిన్నపిల్లగా కనిపిస్తాను. అందుకే, అమితామోడీ సయ్యద్ మోడీ లైఫ్ ఆధారంగా తీసే



'సౌ కరోడ్'లో నేను లేను.

ప్ర: తలాష్‌లో మీరు జాకీ ష్రాఫ్ భార్యగా వివాహిత పాత్ర పోషిస్తున్నారుగా, అక్కడెలా సూట్ అయ్యారు?

జ: తలాష్‌లో నేను నా వయసు ప్లే చేస్తాను. కాని 'సౌకరోడ్'లో అది వీలు కాదు, అక్కడ హీరోయిన్ మెచ్యూర్డ్‌గా కనిపించాలి... నేను దేవ్‌సాబ్ ఫిల్మ్ 'అమన్ కే ఫరిస్తే' చేస్తున్నాను.

ప్ర: మరో మాట, మీ పేరు అనిల్ శర్మాతో కూడా కలిపి మాట్లాడుకుంటున్నారు....

జ: ఓహ్, నో- ప్లీజ్! అలా అనకండి! ఆయన గురించి నేనలా ఆలోచించలేను కూడా!

-సుంకర భాస్కరరావు

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## "హలో! హలో!!"

త్వరలో!
అతి త్వరలో...!!

ఇది సూపర్ లేడీ రైటర్ సువర్ణాకన్నన్ అపూర్వ సృష్టి!!



చిక్కటి చీకటిలో ఒంటరి నక్షత్రం లాంటి రాజాగారి భవంతి! అందులోపల నల్లత్రాచు అంటే భీతి! భీతి! అందరి మొహాల్లో ఎనలేని భీతి! భయం! ఎనలేని భయం! ఎందుకు? ఎవరా? నల్లత్రాచు? ఏమాతని విలయ తాండవం? ఆ కాలనాగు విషపు కోరలకు రాజాబలి కావల్సిందేనా? లేకదాని పుత్కారాలకు ఎదురువున్నదా?

పాఠకలోకాన్ని క్షణం క్షణం ఉత్కంఠతతో ముంచెత్తుతూ మీరు ఎవ్వరూ ఎదురు చూడని మలుపులతో కొసవరకూ రసవత్తరంగా అమిత వేగంగా సాగే కథా గమనంతో అత్యద్భుత సూపర్ సస్పెన్స్ సీరియల్!

## "డాక్టర్లు వస్తున్నారు జాగ్రత్త!"

త్వరలో! త్వరలో!

డాక్టర్లను చూసి భయమేల? ఆంధ్రసచిత్రవారపత్రిక పాఠకుల కోసం చావా శివ కోటి సీరియల్!



రోగుల పట్ల సేవా భావం లేని డాక్టర్లపై శివకోటి ధ్వజమిది! అమాయక జనాలకు హెచ్చరిక గడుసు వైద్యులకు వార్నింగ్!

ధనార్జనే జీవిత ధ్యేయంగా భావించే ఒక డాక్టరు చేసిన పని పర్యవసానం. సైన్సు ప్రగతి-వైద్యం దుర్గతి! ఇకపైనా? కానేకాదు. అంటున్న సరికొత్త సీరియల్ త్వరలో మీ ముందు కొస్తూంది!

# రంజన్ నిషాన్

మరపురాని కళానిధులు

భారతదేశపు సినిమా నటులలో బహుముఖ ప్రజ్ఞకలవారు ఏ కొద్దిమందో వుంటారు. మిగతా వారంతా కేవలం నటన మీదే దృష్టి నిల్పి నటులుగానే చెలామణి అవుతుంటారు. ఒక నటుడిగా తెరమీద కన్పించే వ్యక్తి సకల కళాపారంగతుడిగా అన్ని కళా విభాగాల్లో రాణించే వ్యక్తులు బహు అరుదుగా కనిపిస్తారు! అలాంటి అరుదైన కళాకారుల్లో అగ్రగణ్యుడు రంజన్ ఇతని ప్రజ్ఞాపాటవాలు తమిళ, హిందీ ప్రాంతాల వాళ్లకు తప్ప, మన తెలుగువారికి తెలీదనే చెప్పాలి.

## తొలిచిత్రం

1948వ సం.లో విడుదలయిన జెమినీ వారి "చంద్రలేఖ" (తమిళ) చిత్రం దక్షిణ భారతమంతా సంచలనం సృష్టించింది. ఆ

'బాగ్దాద్'లో



రోజుల్లో 30 లక్షల ఖర్చుతో భారీగా తీసిన తొలి చిత్రమది. ఆంధ్రదేశంలో ఈ చిత్రం ప్రతి పట్టణంలోనూ ప్రదర్శింపబడి విజయవంతమైంది. ఈ చిత్రంలో ప్రధాన పాత్రలు అన్నదమ్ములుగా ఎమ్.కె రాధ, రంజన్ నటించారు. చంద్రలేఖగా



'భాగీ సిపాహీ'లో

రాజకుమారి నటించింది. రాధ పాత్ర సాత్వికమైంది. రంజన్ పాత్ర తద్విరుద్ధం. ఈ పాత్రను ఎంత క్రూరంగా మలుచుకొని నటించాడో ఆ చిత్రం చూచిన వారికి యిప్పటికీ గుర్తుంటుంది! చిత్రం ఆద్యంతం తన గంభీర నటనాపటిమతో ప్రేక్షకులను ఆకట్టుకున్నాడు.

ఇదే చిత్రాన్ని హిందీలో డబ్ చేసి బొంబాయి వంటి ప్రముఖ నగరాల్లో బ్రహ్మాండమైన ప్రచారంతో విడుదల చేసినప్పుడు ప్రతి ఒక్కరూ చూచి ఆనందించారు. చిత్రానికి కనకవర్షం కురిసింది. బొంబాయి నిర్మాత- దర్శకుల దృష్టి రంజన్‌పై పడింది రంజన్‌ని ఆహ్వానించారు!

దక్షిణాది నుంచి అనేకమంది తారలు ఉత్తరాది వెళ్లి స్థిరపడ్డారు కానీ, నటులు వెళ్లి బొంబాయిలో స్థావరం ఏర్పర్చుకున్నవారు లేరు. అందుకు భిన్నంగా రంజన్ 1950-60 సం మధ్య కాలంలో బొంబాయిలో నివాసం ఏర్పర్చుకొని అనేక చిత్రాల్లో వైవిధ్యమైన భూమికలు పోషించి రాణించాడు...

ఆరిపాక సూరిబాబు

## బాల్యం

దక్షిణాదిలో ప్రముఖ సివిల్ ఇంజనీర్‌కి నాల్గవ పుత్రుడుగా రంజన్ 1918 మార్చి 2వ తేదీన జన్మించాడు. ఈతను ప్రముఖ కర్నాటక సంగీత విద్వాంసురాలికి పుత్రుడు.

రంజన్ బాల్యం నుంచి చదువుతోపాటు, ఆట పాటలయందు కూడా ఎంతో చురుకుగా, ఉత్సాహంగా పాల్గొంటుండేవాడు. తల్లి దగ్గర శాస్త్రీయ సంగీతం అభ్యసించాడు. చదువులో ఎప్పుడూ ముందంజలోనే వుండేవాడు. మద్రాసులో బి.యస్. సి. పరీక్షయందు ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు.

1939 సం.లో కేమ్‌బ్రిడ్జ్‌లో చదువుదామని నిశ్చయించుకున్నాడు. అప్పుడే ప్రపంచ ద్వితీయ సంగ్రామం వచ్చుట వలన అనుకున్నట్లు చదువుకోలేకపోయాడు.

రంజన్ కుటుంబం స్వతహాగా భాగ్యవంతులు కావడం వల్ల ఉద్యోగాల కోసం ప్రయత్నించలేదు.

ఈ సమయంలో రంజన్ కళలపై దృష్టి మరల్చాడు. సంగీతం, సాహిత్యం, నృత్యం, ఈత, యోగా, ఇంద్రజాలం వంటి ప్రక్రియలయందు సాధన చేశాడు.

1941లో 'నృత్యకళాశాల' స్థాపించాడు. కొందరికి శిక్షణనిచ్చి తమ బృందంతో ఎన్నో పట్టణాలు పర్యటించి ప్రదర్శనలిచ్చాడు. నృత్యాలు నవీనంగా సమకూర్చి, వాటికి అనువగు గీతాలు రాసేవాడు. నర్తకులకు తగిన వస్త్రాలంకారము కూడా చేసేవాడు. ఇలా నాట్యాచార్యుడుగా కీర్తి గాంచాడు.

ఆ తర్వాత 'నాట్యమ్' అనే తమిళ పత్రికను తన సంపాదకత్వంలో నడిపేవాడు.

## తమిళ చిత్రాలు

ఈ విధంగా ప్రఖ్యాతి గాంచుతున్న రంజన్‌పై తమిళచిత్ర నిర్మాతల దృష్టి పడింది. మొట్ట మొదట 'ఋష్యశృంగ' అనే చిత్రంలో ప్రధానపాత్ర నటించాడు.

ప్రేక్షకులు మెచ్చుకున్నారు. ఆ తర్వాత భక్త నారద, మంగమ్మ శపథం, శాలివాహన చిత్రాలలో ప్రధాన పాత్రలు నటించి, దక్షిణాది ప్రేక్షకులచే శభాష్ అనిపించుకున్నాడు.

వసుంధర- రంజన్‌ల జంట తమిళ ప్రేక్షకులకు కన్నులపంటగా వుండేది. ప్రత్యేకించి 'మంగమ్మ శపథం' ఈ జంటకు గొప్ప పేరు తెచ్చింది. ఇదే చిత్రాన్ని ఆ తర్వాత తెలుగులోను, హిందీలోనూ రంజన్ నాయక పాత్రధారిగా చిత్రాలు తీశారు.

జెమినీవారు హిందీ "నిషాన్" (తెలుగులో అపూర్వసహోదరులు) తీశారు. అందులో రంజన్ కవల సోదరుల పాత్రలను అద్భుతంగా పోషించి సెహభాష్ అనిపించుకున్నాడు. సాహస పాత్రలు రంజన్‌లా ఎవరూ నటించలేరు అనే ఖ్యాతి నార్జించుకున్నాడు.

అప్పటి వరకు మద్రాసు జెమిని స్టూడియో పర్మనెంట్ నటుడుగా పని చేసే రంజన్ తన నిబంధన గడువు పూర్తవగానే బొంబాయి చేరుకున్నాడు.

## హిందీ చిత్రరంగంలోకి...

సింద్‌బాద్-ది-సైలర్- భాగీ, సిన్‌సినాకీ- బుబ్లాబూ, శమ్‌శీర్, బాగ్దాద్, అల్లారుక్, కాఫీలా, ఆలీబాబా- నలభైదొంగలు, తాజ్‌పోష్, భాగీ సి పాహి, మరికొన్ని సాంఘిక, సాహసిక చిత్రాల్లో నటించి ఉత్తరాది ప్రేక్షకుల అభిమానాన్ని పొందాడు

ఫిల్మిస్థాన్‌వారు రంజన్ సాహితీ దృక్పథం గ్రహించి చిత్రకథ కోరారు. రంజన్ కొత్త తరహా కథను కల్పించి ఇచ్చాడు. దాన్ని "మునీంజీ" పేరుతో దేవానంద్, నళినీజయవంత్, ప్రాణ్ ప్రధాన పాత్రధారులుగా తీశారు. ఈ చిత్రం దేశమంతటా విజయఢంకా మ్రోగించింది. ఈ చిత్రాన్ని తెలుగులో "ఇంటి గుట్టు" పేరుతో రామారావుతో తీశారు.

బొంబాయి నుంచి మద్రాసు వచ్చి అనేక తమిళ చిత్రాలలో నాయకుడిగా నటిస్తుండేవాడు. అతను నటించిన "కొండవీటి దొంగ" (డబ్బింగ్) ఆంధ్రదేశంలో బాగా ప్రదర్శింపబడింది. ఈ చిత్రంలో రంజన్ నాట్యాలు, ముష్టియుద్ధాలు ప్రేక్షకులను మైమరపింపజేశాయి.

"మంగళ" (తెలుగు)లో భానుమతితో నాయకుడిగా ద్విపాత్రాభినయంతో ఆంధ్ర ప్రేక్షకుల అభిమానాన్ని చూరగొన్నాడు.

తమిళ, హిందీ, తెలుగు చిత్రాలలో సుమారు నూరు చిత్రాలలో ప్రధాన పాత్రలు నటించిన రంజన్ కేవలం నటుడే కాదు, కథకుడు, వాగ్గేయకారుడు, మెజిషియన్, పత్రికా సంపాదకుడు, క్రీడాకారుడు, వాద్యకారుడు, విమానచోదకుడు, చిత్రకారుడు, ఇంకా ఎన్నో కళాప్రక్రియలలో నైపుణ్యం కల గొప్ప కళాకారుడు.

'తాజ్‌పోష్'లో శ్యామాతో



'మంగళ'లో రంజన్



## వివాహం

1942 సం.లో నృత్యము, సంగీతము వచ్చినటువంటి యువతిని సాంప్రదాయ ప్రకారం పెళ్లి చేసుకున్నాడు. నాట్య, నాటక, సంగీత కార్యక్రమాల్లో రంజన్ తోబాటు భార్య కూడా పాల్గొనేది.

రంజన్‌కి స్వంత విమానం కూడా వుండేది. కొన్ని చిత్రాలలో క్రూరంగా నటించగా, చాలామంది రంజన్ క్రూరుడే అని భ్రమించేవారు. నిజ జీవితంలో చాలా సౌమ్యుడు, దానశీలి, అందరితోను ఆత్మీయతతో జీవించేవాడని అంటారు అతనితో పరిచయమున్నవారు

రంజన్ తరుచు అమెరికా వెళుతుండేవాడు ఎందుకు వెళ్తున్నాడో అందరికీ తెలియదు! భారతీయ ఆధ్యాత్మిక తత్త్వాన్ని, వేద సారాన్ని అమెరికావాసులకు వినిపిస్తుండేవాడు. భారతీయతత్త్వాన్ని ఉపన్యాసాల రూపంలో ఎన్నోసార్లు అమెరికాలో వినిపించి గొప్ప తత్త్వవేత్తగా పరిగణింపబడ్డాడు.

ఇంతటి మహామనిషి తన పాంచభౌతిక దేహాన్ని సెప్టెంబరు '83 సం.లో అమెరికాలోనే విడిచిపెట్టాడు తన 60వ యేట అతన్ని గురించి తెలిసినవారు ఎవరూ మరచిపోవడం కష్టం



రామాపురంలో వెనకబడిన జాతుల వారి ముఖాలు ఆనందంతో వెలిగిపోతున్నాయి. అగ్రకులాల వారి ముఖాలు కాంతిహీనంగా మారుతున్నాయి.

యువజన సంఘం ప్రెసిడెంటుగా ఎన్నికైన కృష్ణ మెళ్ళో పూల దండలు మెరుస్తున్నాయి. ప్రెసిడెంటు ఊరేగింపులో పాల్గొన్నవారు పేదవారైనా వారి ముఖాల్లో చైతన్యం ఉట్టిపడుతూంది.

"పెసెంటు కిట్టుగోడ్కి జేయ్" అన్నాడు ఒక యువకుడు.

"జై....!" అన్నారు మిగతావారు.

"రావుడూ! అలాకాదురా అనడం. యువతరం ప్రెసిడెంటు కృష్ణగార్కి జై.... అనాలి" అన్నాడు చదువుకున్న యువకుడు.

"రావుడు చదువుకున్నవాడు కాదు రాఘవా! అన్యం పుణ్యం తెలియని అమాయకుడురా! ఆడెలా పిలిస్తే పోయిందేముంది" అన్నాడు కృష్ణ.

"యువతరం ప్రెసిడెంటు కృష్ణగారికి"

"జై.... జై...... జై....." అంటూ వీధుల్లో తిరుగుతున్నారు. ఆ జేజేలు అగ్రకులాల వారి గుండెల్లో శూలాల్లా గుచ్చుకుపోతున్నాయి. ఊరేగింపు ఎదురుగా వస్తున్న వ్యక్తిని చూచి, అవతారంగారూ! నమస్కారమండి" అన్నాడు కృష్ణ.

"ఏవిట్రోయ్ కృష్ణా? మంత్రిగారిలా పూలదండలు వేసుకుని ఊరేగుతున్నావు" అని ఈర్ష్యగా చూశాడు అవతారం.

"అవతారంగారూ! పూలదండలు మంత్రులకు మాత్రమే పరిమితం అనడం అన్యాయం. నన్ను యువతరం సంఘానికి ప్రెసిడెంటుగా ఎన్నుకున్నారండి". అన్నాడు కృష్ణ.

"కులద్వేషాల కుళ్ళుతో కూరుకుపోతున్న ఈ గ్రామాన్ని వెలుగులోకి తీసుకువస్తావా కృష్ణా!" అన్నాడు అవతారం.

"అందుకే మా వెనకబడిన కులాలన్నీ ఏకమయి ఈ సంఘాన్ని స్థాపించింది" అన్నాడు కృష్ణ.

"కృష్ణా! ప్రెసిడెంటు భుజంగయ్యగారు ఊడలు దిగిన మర్రి చెట్టురా.

కుర్రగాలి దాన్ని ఏం కూల్చగలదు" అవతారం అన్నాడు.

"చలిచీమల ముందు కాలసర్పం ఏం చెయ్యగలదండి" అన్నాడు యువకుడు.

"అవతారంగారూ! కులమతాల పేరుతో రక్తాన్ని కాలవల్లా పారిస్తున్న రాష్ట్రమండి మనది రాజ్యాంగ బద్ధంగా మా కులాలకు నిర్ణయించిన రిజర్వేషన్లను అధికార బలంతో దూరం చేస్తున్న సర్పంచ్‌కి తగిన గుణపారం చెప్పటానికే ఈ యువతరం స్థాపించబడింది. ఇంక మీ అధికార దాహాన్ని నిర్మూలిస్తాం. మీ నక్కజిత్తులను ఉపయోగించి, ఆ భుజంగయ్యగారిని మా మీదకు ఉసిగొలిపేరంటే మీ మక్కెలు విరగ్గొడతాం" అని గుంపులో ఒక యువకుడు అరిచాడు

కుర్రాళ్ళ ఉద్రేకం పసిగట్టి అవతారం తప్పుకున్నాడు.

ఊరంతా ఊరేగిన ఊరేగింపు కృష్ణ ఇంటికి వచ్చింది.

తాటాకు ఇంటి అరుగుమీద నులక మంచం మీద కూర్చుని చుట్ట కాలుస్తున్న కామయ్య కిరువైపులా రెండు మేకపిల్లలు కూర్చున్నాయి. కొన్ని మేకలు అరుగుమీద, మరి కొన్ని ఇంటి ముందు ఉన్నాయి. తన వంకే మిర్రున చూస్తున్న కామయ్య చూపులను తట్టుకోలేక కృష్ణ నేలవంక చూస్తున్నాడు.

"వోరి కిట్టుగే ఫూన్కం వొచ్చిందేటిరా మెల్లో దండేస్కున్నావు!" అన్నాడు కామయ్య ముఖం చిట్లించుకుంటూ.

"మన వెనకబడిన కులాల యువకులందరూ కలిసి మీ కృష్ణను యువతరం సంఘం ప్రెసిడెంటుని చేశాం తాతా!" అన్నాడు ఒక యువకుడు.

"నా మనవడు ఊర్కి పెద్దోడయ్యాడన్నమాట. వోరికిట్టా నువ్వు మనూరోళ్లందరి కన్నా బాగా సదువుకుని ఉజ్జోగం చేసి నన్నుద్ధరిత్తావని నా రెక్కలు ముక్కలుసేసి సదివించాను. సంగాలు, సమ్మెలంటూ నీ బతుకును బుగిపాలు సేసుకోకురా!" అన్నాడు కామయ్య.

"ముసోడా! ఇట్టా యేదాంతం సెపుతూ మన కులం వోర్ని ఎదవల్ని సేత్తున్నావు ఇక నీ మాటలు ఇనుకోం" అన్నాడు రావుడు.



# ఎదురీత

"వోర్రావుడూ! పెజా పెబుత్తం, పెజా పెబుత్తం అంటూ బుజంగయ్య గోరి మీద కాలుదువ్వి అరిసేత దెబ్బలు తిన్నావు. నీకింకా బుద్దిరాలేదేట్రా!" అన్నాడు కామయ్య హేళనగా.

"తాతా అయాల నువ్వడ్డడకపోతే! నాయాల ఆ ......బుజంగయ్య గోరి బుర్రట్టుకొచ్చి మనకిట్నుడు గుడికాడొ డేద్ను" అన్నాడు రావుడు రోషంగా.

"బుజంగయ్యగోరి బుర్ర సింబోతు బుర్రకాదురా ఎదవా! అరి బుర్రట్టు కొత్తే, ఆ రోళ్ళొచ్చి మన బుర్రలొట్టుకు పోరా!" అన్నాడు కావయ్య.

"తాతా! భుజంగయ్యగారు కొడితే మనం ఊరుకోవాలా!" అడిగాడు కృష్ణ గంభీరంగా.

"అరి సేలో గడెత్తుకొచ్చి, తిరిగి అరిమీద ఎదుర్కుంటే ఏటి సేత్తార్రా!" అన్నాడు కామయ్య.

అందరూ తలలు వంచుకున్నారు.

"ప్రభుత్వం మన వెనకబడిన కులాల వారికి ఎన్నో సౌకర్యాలను కల్పించింది. అవి మనకు అందకుండా ఆయన అధికారంతో ఆపుచేయిస్తున్నారు. ఇక ఆయన ఆటలు సాగనివ్వకుండా చేయాలనే మేము ఈ సంఘాన్ని స్థాపించాము" అన్నాడు కృష్ణ.

"బుజంగయ్యగోరి మీద ఎదురు తిరిగి నోరెవరు బతికి బట్టకట్టలేదురా! నా మాటని ఆ దండలు తీసెయ్యి అయి పూల దండలు కావురా! ఉరి తాళ్ళు. ఉజ్జోగం సేసుకుంటూ సల్లగా బతకరాకిట్టు!" అన్నాడు కామయ్య ప్రాధేయపడుతూ.

"తాతా! ముందుకు పోతున్న మా కాళ్ళకు బంధాలెయ్యకు. ప్రభుత్వం మనకు కల్పించిన సబ్సిడీలను మనం పొందుతూ, మన చీకటి బ్రతుకుల్లో వెలుగు నింపుకునే వీలు కల్పిస్తాను" అన్నాడు కృష్ణ తన నిర్ణయానికి తిరుగులేదన్నట్టు.

ఆ గ్రామం విసిరేయబడ్డ రాయిలా పట్నానికి దూరంగా మారుమూల ఉంది. అక్కడ అన్ని కులాలు లేకపోయినా కొన్ని కులాలు మాత్రం ఉన్నాయి. వాటిలో అగ్రకులస్తులు తక్కువైనా వారికి ధనబలం ఉన్న గురించి మిగతా కులాల వారిని చెప్పుచేతల్లో పెట్టుకుని ఉపయోగించుకుంటున్నారు. భూస్వామి భుజంగయ్య సర్పంచ్. తన మాటే వేదవాక్కుని, తనను దిక్కరించిన వారికి తగిన శాస్తి జరిపిస్తుంటాడు. తరతరాలుగా తన వంశీ కులవల్లే గ్రామ ప్రజలకు జీవనోపాధి కలుగుతుందని, తన పొలాల్లో కూలీ నాలీ చెబుతూ వాళ్ళ భుక్తికి మార్గం కల్పిస్తున్నానని భుజంగయ్య ఉద్దేశ్యం.

ప్రభుత్వం వెనుకబడిన కులాల వారికి కల్పిస్తున్న సబ్సిడీ పథకాలను తన గ్రామస్తులకు ఇప్పిస్తే వారు చెప్పుచేతల్లో ఉండరని భుజంగయ్య ఆ పథకాలను తన గ్రామస్థులకు అందకుండా చేస్తున్నాడు. పేదవారు తమకు అన్యాయం జరుగుతుందని తెలిసినా, అంతా తమ ఖర్మని సర్దుకుపోతున్నారు.ఆ ఊరుని మకుటం లేని మహారాజులా యధేచ్ఛగా పాలిస్తున్నాడు భుజంగయ్య. ఆయన కుతంత్రాలను గ్రహించిన వెనకబడిన యువకులు అంతా ఏకమయ్యారు. తమకు జరిగే అన్యాయాలను అరికట్టాలంటే తమకొక నాయకుడు కావాలని నిర్ణయించుకున్నారు. బి.ఎ. పాసయి ఖాళీగా ఉంటున్న కృష్ణను యువతరం సంఘం ప్రెసిడెంటును చేశారు.

తొమ్మిది దశాబ్దాలను చూచిన కామయ్య వెనకబడిన కులాలవారికి పెద్ద తల. తమ కులవృత్తినే నమ్ముకుని మేకలను మేపుకుంటూ భార్య కాంతమ్మను, కొడుకు చంద్రుణ్ణి, కోడలు చంద్రమ్మను పోషించేవాడు. తనవారు వ్యవసాయ పనులకు కూలికి వెళ్ళి, కామయ్యకు సహాయపడేవారు. కొడుకూ, కోడలూ చదువు కోకపోయినా, వారు లోకం పోకడలను అవగాహన చేసుకునేవారు. స్వాతంత్ర్యం వచ్చినా భుజంగయ్య తమను స్వతంత్రంగా బ్రతకనివ్వడంలేదని చంద్రుడు, చంద్రమ్మ గ్రహించారు. వెనకబడిన కులాలవారిని భుజంగయ్య మీదకు ఉసి గొలిపారు. తన మార్గానికి అడ్డుతగులుతున్న చంద్రుడిని, అతనిని చంపింది చంద్రమ్మేనని కోర్టులో బుజువు చేయించి, ఆమెను ఉరికంబం ఎక్కించి భుజంగయ్య అడ్డు తొలగించుకున్నాడు. అప్పటి నుంచి ఆయన గ్రామానికి సింహస్వప్నమయ్యాడు. కొడుకు కోడలు అకాలమరణాన్ని తట్టుకోలేక కాంతమ్మ కన్ను మూసింది. ఆ ముగ్గురు చావులను చూచిన కామయ్య గుండె రాయి చేసుకున్నాడు. కొడుకు కోడలు యిచ్చిపోయిన అయిదు సంవత్సరాల కృష్ణను పెంచి పెద్దచేశాడు కామయ్య.

"కృష్ణ ఇక్కడ ఉంటే గత స్మృతులు ఆ పసిహృదయాన్ని గాయపరచి, అతనిని రాక్షసుడుగా మార్చి





భుజంగయ్య మీదకు ఉసి గొలుపుతాయి. అతనిలో భుజంగయ్యపై క్రూరత్వం ప్రవేశించకుండా ఉండాలంటే పట్నంలో ఉన్న ప్రభుత్వ హాస్టల్లో చేర్పించు. అక్కడ బాగా చదువుకుని అభివృద్ధి లోకి వస్తాడు. ఉద్యోగం చేసు కుంటూ కృష్ణ నిన్ను సుఖపెడతాడు" అని గుర్నాధం మాష్టారు కామయ్యతో చెప్పారు. కామయ్య అందుకు అంగీ కరించాడు. కృష్ణను పట్నం తీసుకు వెళ్ళి ప్రభుత్వ హాస్టలులో చేర్పిం చారు గుర్నాధం మాష్టారు.

కృష్ణ హాస్టల్లో ఉంటూ శ్రద్ధగా చదువుతూ ప్రతీ క్లాసు ఫస్టు మార్కు లతో పాసవుతూ, గుర్నాధం మాష్టారు సలహాతో స్కాలర్‌షిప్‌తో బి.ఎ. పాసయ్యాడు. ఉద్యోగం అన్వేష ణలో ఉన్న కృష్ణను యువజన ప్రెసిడెం ట్‌గా చేశారు. అతను అయితే తమకు జరుగుతున్న అన్యాయాలను అరికట్టి, భుజంగయ్య కళ్ళు తెరిపిస్తాడనే ఆశతో ఉన్నారు గ్రామ ప్రజలు.

పురాతనమయిన రెండంతస్థులభ వనం వీధి అరుగు మీద మడత కుర్చీలో వెనక్కి జారబడి కాలుమీద కాలువేసుకుని కూర్చున్నాడు భుజంగయ్య. 'తాను కాల్చే' చుట్ట పొగ మేఘాలను సృష్టించేది. ఇప్పుడు చెదిరిపోతుందేమి టబ్బా! అని అనుకుంటున్నాడు. ఆయన భార్య లోపల ఇంటిపనిలో లీన మయింది. కొడుకు నరేంద్ర కాలేజీలో లెక్చరరు ఉద్యోగం చేస్తూ పట్నంలో కాపురం పెట్టాడు. అతనికి తండ్రి నడ వడిక నచ్చక, తండ్రి అంటే అయిష్ట తతో ఉంటున్నాడు. నరేంద్ర భార్య పేరు కమల. ఆ ఇరువురికి కలిగిన సంతానం అపరంజి, శ్యామ్. అపరంజి బి.కాం., శ్యాం బి.ఎ. చదువుతున్నారు. ఆ అక్కా తమ్ముడు కాలేజి శెలవు లకు గ్రామం వచ్చి, తాతా, నాయనమ్మ దగ్గర గడుపుతుంటారు. తన తాతయ్య చేసే అక్రమాలను అరికట్టటానికి యువ తరం వాళ్ళు సంఘం పెట్టుకున్నందుకు అపరంజి ఆనందపడింది. లోపల నుంచి వచ్చిన అపరంజి భుజంగయ్య దగ్గర నిలబడి, "తాతయ్యా! మారే కాలం తోపాటు మనమూ మారాలి. పాతకాలపు పెత్తందారి అక్రమాలు ఇక మీదట సాగవు" అంది.

"గుడ్డొచ్చి పిల్లను ఎక్కిరించినట్టుగా ఉంది నీ వ్యవహారం. సింహం ముందా కుందేళ్ల కుప్పిగంతులు.", అన్నాడు భుజంగయ్య గంభీరంగా.

"నీవు మారకపోతే సింహంకాదు కదా, గ్రామ సింహానికున్న విలువకూడా నీకు దక్కనివ్వరు."

"ఇలాంటి కబుర్లు విని నా తల నెరిసిపోయింది."

"తలుపులు వేసి కొడితే పిల్లి కూడా పులై కళ్ళు పీకేస్తుంది. ఇక నైనా ఒళ్ళు దగ్గర పెట్టుకుని వేసే ప్రతి అడుగు జాగ్రత్తగా వేస్తూ మసులుకో తాతయ్యా!"

"నీకు చదువు చెప్పించినందుకు పాఠాలు బాగా అప్పచెపుతున్నావు. ఈ మాటలు మీ నాన్నతో కూడా అను."

"ఎవరి కర్మకు ఎవరు కర్తలు. అను భవం మీద కాని మీకు తెల్సిరాదు" కోపంగా లోపలికి వెళ్ళింది అపరంజి.

భుజంగయ్య దగ్గరకు వచ్చిన వారు బల్లమీద కూర్చున్నారు.

"విశేషాలేమిటండీ! అడిగారు భుజంగయ్యగారు.

గ్రామాన్ని ఉద్ధరించాలని ఆ కిట్టు గాడిని యువజన సంఘం ప్రెసిడెంటును చేసినప్పటినుండి వెనకబడిన జాతు లోళ్ళకి పట్టపగ్గాల్లేకుండా ఉందండి" అన్నాడు ఒకాయన.

"ఇటువంటి సంఘాలు మనం ఎన్ని చూడలేదు." అన్నాడు భుజంగయ్య మీసం మీద చెయ్యివేసి.

"మొక్కను మొక్కలోనే వంచక పోతే అది మానయితే వంగదండి. వాళ్ళ మీద మీరు తగిన చర్య తీసుకోకపోతే ఇక నుంచి వాళ్ళ ముందు మనం తలవంచ వలసిందేనండి" అన్నాడు ఇంకొకాయన భయంగా.

"వాళ్ళను సామాన్యంగా చూడ కండి. అందరూ చదువుకుని, లోకం పోకడలు తెలుసుకున్న యువకులండి" అన్నాడు మరొకాయన.

"అవతారం మవునంగా ఉన్నావే మిటయ్యా! కుర్ర సంఘాన్ని చూచి భయపడుతున్నావా? ఏమిటి" అడిగారు భుజంగయ్యగారు.

"అదేమీ కాదండి"ఇన్నాళ్ళలా కుర్ర కారు గురించి ఘాటుగా భుజంగయ్యతో చెబితే, చాటుగా దొరికినప్పుడు తొక్క లూడకొడతారని అవతారానికి భయంగా ఉంది.

"కామయ్యగాడు మనవణ్ణి బాగా చదివించి మీ మీదకు ఉసిగొల్పి పాత పగను తీర్చుకోవాలనుకుంటున్నాడండి" అన్నారు ఇంకొకాయన.

"వాడు కొడుకు కోడలను నా మీదకు ఎదురు తిరిగేలా చేశాడు. వాళ్ళే మయ్యారు. వీడూ అదే అవుతాడు" అన్నారు భుజంగయ్యగారు గంభీరంగా

### రాజేష్ ఔదార్యం!



తన సొంత నిర్మాణ సంస్థనుంచి విడు దలౌతున్న "జయ్ శివశంకర్" చిత్రంలో రాజేష్‌ఖన్నా జర్నలిస్టు పాత్ర పోషిస్తు న్నప్పటికీ తన వ్యక్తిగత విషయాలను ఎవరైనా బహిరంగ పరిచినా పట్టించుకో వటంలేదు. ఈ చిత్రంలో తన ప్రస్తుత పరిస్థితిని రచయిత చిత్రీకరించినా, అత నితో తనకున్న స్నేహంకారణంగా దాన్ని అంత తీవ్రంగా పరిగణించటంలేదు రాజే ష్‌ఖన్నా. నిజాలను ప్రజలకు తెలియజే యటమే జర్నలిస్టు ధర్మం. ఆ ధర్మాన్ని తప్పకూడదుకదా! అని సరిపెట్టుకుం టున్నాడు. ఆహా....ఏమి ఉదార స్వభా వుడు!

# ట్వెంటీఫస్ట్ సెంచరీ

అసంతృప్తి జ్వాలల్లో
అలంకార దీపాలు,
నిరంకుశ పాలనలో
నిరవధిక సమ్మెలు!
ప్రజాస్వామ్య రాజ్యంలో
పగా ప్రతీకారాలు,
ప్రజాహిత పత్రికల్లో
పచ్చి నిజాల ప్రచురణలు!
అక్షరజ్ఞానం లేని అయోగ్యుల
అధికార ప్రసంగాలు,
విజ్ఞానాన్ని వెలకట్టి, దేశభవితవ్యాన్ని
వెలకట్టే విజ్ఞానవంతులు!
ఓట్లకోసం పొట్లుపడే
ప్రజా ప్రతినిధులు,
సీట్లకోసం సిగపట్లు పట్టుకునే
ప్రతిపక్ష నాయకులు.



పట్నాల కురుక్షేత్రంలో పోరును
సాగించే 'కన్నె' పిల్లలు,
కాసుల కలవరంతో కొట్టుమిట్టాడే
నవ 'యువ' వైతాళికులు!
ఫేషన్లమోజు పరంపరలో
అమెరికన్ స్టైల్ విన్యాసాలు,
ఫిక్షన్‌కింగ్‌ల ఫిక్టింగ్‌లో
ఏషియన్ టైప్ విలాసాలు!
కాలేజీ కుర్రాళ్ళ ఖలేజాలో
ఖబడ్దార్ కబుర్లు,
టీనేజి గర్ల్స్ హృదయాల్లో
ట్వెంటీఫస్ట్ సెంచరీ భావాలు!

-గడిజాల శ్రీసూర్యానంద్

# ఎదురీత

చూస్తూ.

అందరూ నవ్వుకున్నారు. వారి నవ్వులకు అంతరాయం కలిగినట్లు ఒకే సారి ఆగిపోయాయి మేకల్ని తోలుకువస్తున్న కామయ్యని చూసి.

"దండాలయ్యగోరూ!" అని కామయ్య భుజంగయ్య వంక చూస్తూ చేతులు జోడించాడు.

"మీ కిట్టుగాడు యువతరం సంఘానికి ప్రెసిడెంటు అయ్యాడట" అన్నారు భుజంగయ్యగారు అహంభావంగా చూస్తూ.

"కుర్రోళ్ళంతా కలిసెట్టా రటయ్య గోరూ! నానెంత జామాడినా ఆళ్ళు నా మాటలు ఇనుకోవడం లేదయ్యా! ఎన్ని గొరిపోతులు కలిసి కొండను ఢీకినా కొండ కేటవుద్దయ్యా!" అని చెప్పి కామయ్య మేకల్ని తోలుకుని వెళ్ళిపోయాడు. వాళ్ళు తన మనవడు గురించి ఏదో పన్నాగం పన్నుతున్నారు. కృష్ణకు ఏ ప్రమాదం వాటిల్లకుండా చూడమని కామయ్య భగవంతుడీ వేడుకున్నాడు. కామయ్య మేకలను మామిడి తోట కట్టవరకు మళ్ళించాడు. అతను తోటలోకి చూస్తున్నాడు. మామిడితోటలో ఉన్న పాకలోపలి నుంచి బయటకు వచ్చిన శ్యామ్, నీలవేణి కామయ్యను చూచి సిగ్గుతో తలదించుకున్నారు. కామయ్య వాళ్ళ ఉనికిని గ్రహించి, అమ్మాయిగోరూ! పెళ్లిడకొచ్చిన మీరు ఇట్టా సెడుతిరుగుళ్ళు తిరుగుతుంటే మీ బతుకు బుగ్గిపాల వుద్ది. మీ తాతయ్యగోరికి తెలిత్తే ఆరి గుండె ఆగిపోద్దమ్మా!" అని మందలించాడు.

"మమ్మల్ని చూచినట్టు మేష్టారుతో చెప్పేవంటే నీ బుర్ర పగలకొడతాను" అని శ్యామ్ కోపంగా చూశాడు.

"బావూ! మీ లచ్చనాలన్నీ తాతయ్యగోరివేనని నాకు తెల్సు" అన్నాడు కామయ్య.

శ్యామ్, నీలవేణి చెరోవైపూ వెళ్ళిపోయారు.

రోజులు గడుస్తున్నాయి. యువజన సంఘం ద్వారా గ్రామంలో కృష్ణ, రోగాలతో బాధపడేవారిని పట్నం ఆస్పత్రిలో ఎడ్మిట్ చేయించి చికిత్స చేయిస్తున్నాడు. వృద్ధులకు, విధవలకు ప్రభుత్వం ద్వారా లభించే పెన్షన్లను వచ్చేలా చేస్తున్నాడు. సబ్సిడీ పథకాల ద్వారా పేదవారికి బ్యాంకులలో అప్పులు మంజూరు చేయిస్తున్నాడు. తమ గ్రామస్థులకేకాక చుట్టుప్రక్కల గ్రామాలవారికి కూడా సంక్షేమ పథకాలు పూర్తిగా అందేటట్లు చేస్తున్నాడు కృష్ణ. అతను తమ మీద చూపుతున్న శ్రద్ధకు అందరూ అభినందిస్తున్నారు. కృష్ణ వల్ల పేదలు సుఖపడుతుంటే కామయ్యకు ఆనందంగానే ఉంది. మరో వైపు భయంగా ఉంది. నరరూప రాక్షసుడు భుజంగయ్య తన మనవడిపై ఏ అఘాయిత్యం చేయిస్తాడోనని.

కామయ్య గుర్నాథం మాష్టారుతో చెప్పి నీలవేణిని బయటకు రానివ్వకుండా చేశాడని శ్యామ్ గ్రహించి, కామయ్య బుర్ర పగలకొట్టాడు. తలకు బాగా గాయాలు తగిలిన కామయ్యకు చికిత్స చేయించాడు కృష్ణ.

"శ్యామ్ నీ తలమీద ఎందుకు కొట్టాడు" అని కృష్ణ ఎంత అడిగినా కామయ్య నిజం చెప్పలేదు, నిజంచెపితే నీలవేణి బ్రతుకు అల్లరవుతుందని. దెబ్బకు దెబ్బ తీయాలని యువకులు, కృష్ణ భుజంగయ్య ఇంటికి వెళ్ళారు. శ్యామ్ పట్నం పారిపోయాడని తెలుసుకున్నాడు కృష్ణ. "ఇటువంటి పని ఇకనుంచి జరిగిందంటే దెబ్బకు దెబ్బ తీస్తాం" అని కృష్ణ భుజంగయ్యతో చెప్పి వెళ్ళిపోయాడు.

తన పేరు చెపితే గజగజలాడే వెనకబడిన కులాలవారు తన ఇంటికి వచ్చి, తనను బెదిరించడం భుజంగయ్యకు తల కొట్టినట్లుగా అయ్యింది. తోక తొక్కిన త్రాచులా బుసకొట్టి, వాళ్ళ మీద పోలీసుకేసు బనాయించాడు. పోలీసులు గ్రామది వచ్చి యువతరం సంఘం సభ్యులను అరెస్టు చేసి పట్నం పోలీసు స్టేషన్‌కు తీసుకువచ్చారు. వారి కూడా కామయ్య వచ్చాడు. సి.ఐ.గారితో జరిగిన విషయాన్ని చెప్పి, కామయ్య తలకు తగిలిన గాయాన్ని చూపించి, డాక్టరు సర్టిఫికెట్టు చూపించాడు కృష్ణ.

సి.ఐ.గారు ఇరుపక్షాల వారు చెప్పిన మాటలు విన్నాడు.

"పాలకులు తప్పులు చేసి, తమ తప్పులను పోలీసు వారి ద్వారా కప్పి పుచ్చుతూ, డిపార్టుమెంటుకు తలవంపులు తెస్తున్నారు. ముసలివాని తలపగలకొట్టి తిరిగి వాళ్ళ మీద పోలీసు కేసు పెట్టారు. ఇటువంటి తప్పుడు కేసులు మళ్ళీ పెట్టారంటే మిమ్మల్ని అరెస్టు చేయవలసి ఉంటుంది" అని భుజంగయ్యను తీవ్రంగా మందలించారు సి.ఐ.గారు.

తన పేరు చెపితే గడగడలాడుతూ పనిపూర్తిచేసే పోలీసు అధికారి తనను మందలించడం భుజంగయ్యకు అవమానంగా ఉంది. తాను ఒక మెట్టు దిగినట్టు కృష్ణ ఒక మెట్టు ఎక్కినట్టుగా బాధపడుతున్నాడు భుజంగయ్య.

నీలవేణికి నెల తప్పిందని తెలియగానే గుర్నాధం మేష్టారుకి బీపీ పెరిగి కాలూ, చెయ్యి పట్టు తప్పాయి. ఆయన్ని యువతరం సభ్యులు పట్నం తీసుకువెళ్ళి జనరల్ ఆస్పత్రిలో ఎడ్మిట్ చేశారు. నీలవేణి గర్భవతి కావటానికి కారణం భుజంగయ్య మనవడని ఊరంతా ప్రాకిపోయింది. యువజన సంఘంవారు భుజంగయ్య దగ్గరకు వచ్చారు.

"భుజంగయ్యగారూ! మీ మనవడు శ్యామ్ నీలవేణిని నమ్మించి మోసగించాడు. ఆమె గర్భవతి అయింది. ఇక ఆమెను ఎవరు వివాహం చేసుకుంటారు. శ్యామ్‌కు, నీలవేణికి పెళ్ళి జరిపించాలి." అన్నాడు కృష్ణ.

"చెడు తిరుగుళ్ళకు అలవాటుపడిన ఆ అమ్మాయిని ఎవరు గర్భవతిని చేశారో ఎవరు చెప్పగలరు. నా మనవడివల్లే అది గర్భవతి అయిందని నమ్మకం ఏమిటి. అదీకాక మా రెండు కులాలు వేరు వేరు కులాలు. ఈ విషయంలో నా మనవడి జోలికి వచ్చేరంటే నేనూరుకోను." అని భుజంగయ్య కళ్లెర్ర చేశాడు.

నీలవేణిని తీసుకుని యువజన సంఘంవారు పట్నం వెళ్ళారు. నరేంద్రను కలుసుకుని, జరిగిన విషయాన్ని చెప్పాడు కృష్ణ.

నరేంద్ర, అతని భార్య విమల, కూతురు అపరంజి ఆలోచనలో పడ్డారు. తమ కొడుకు వల్ల మరో అమ్మాయి జీవితం నాశనం కాకూడదని, ఆమె ఏ కులస్తురాలయినా ఆ ఇద్దరికి వివాహం జరిపించాలని విమల, అపరంజి నరేంద్రతో చెప్పారు. గుర్నాధం మాష్టారు అంగీకారంతో శ్యామ్‌కు, నీలవేణికి వివాహం జరిపించాడు నరేంద్ర. ఆ వివాహానికి రమ్మని పిలిస్తే భుజంగయ్య వెళ్ళడం మానివేశాడు. ఆయన వెన్నెముక విరిగినంత బాధ కలిగింది. తీరని అవమానం పొందాడు. కృష్ణ మీద మరింత ద్వేషం రగులుకుంది.

వరకట్నం పూర్తిగా ఇవ్వలేదని అవతారం కోడల్ని పుట్టింటి దగ్గర వదిలేశాడు. ఆ విషయాన్ని తెలుసుకున్న యువతరంసంఘంవారు అవతారం కోడలను తీసుకువచ్చి, "ఈమెను కట్నం పూర్తిగా తేలేదనే సాకుతో హింసించారంటే, మీ తండ్రీ కొడుకులను జైలులో పెట్టిస్తాము" అని చెప్పి, ఆ అమ్మాయిని భర్తతో కలిపారు.

వెనకబడిన కులస్థురాలు ఎరకమ్మ కన్యగా ఉండగా భుజంగయ్య ఆమెను చేరదీశాడు. ఆయనకు ఎరకమ్మ ఇద్దరు కొడుకులను కన్నది. తరువాత ఆమెను భుజంగయ్య వదిలేశాడు. ఆమెను పుట్టింటివారు చేరనివ్వలేదు. ఎరకమ్మకు జరిగిన అన్యాయాన్ని చూచిన గుర్నాధం మాష్టారు ఆమె, పిల్లల్ని అనాధ శరణాలయంలో జేర్పించారు. ఎరకమ్మ కూలిపనులు చేసుకుంటూ జీవనోపాధి సాగిస్తుంది. ఆమె కృష్ణ దగ్గరకు వచ్చి తన పరిస్థితిని చెప్పి ఏడ్చింది. ఆమె దీన స్థితికి జాలిపడిన యువతరం సభ్యులు ఎరకమ్మ కొడుకులకు భుజంగయ్య ఆస్తిలో భాగం రాబట్టాలని కృష్ణకు చెప్పారు. కృష్ణ పట్నం వెళ్ళి, లాయరుతో ఎరకమ్మ సంతానం గురించి చెప్పాడు. "కన్యను చేరదేసిన వ్యక్తికి పుట్టిన మగ సంతానానికి ఆ వ్యక్తి ఆస్తి మీద హక్కు ఉంటుంది" అని ప్లీడరు కృష్ణతో చెప్పారు.

యువతరం సంఘంవారు ఎరకమ్మను తీసుకుని భుజంగయ్య ఇంటికి వచ్చారు. ఆయన కొడుకులతోపాటు సమానంగా ఎరకమ్మ కొడుకులకు ఆస్తి వాటా పంచకపోతే తమ సంఘం ద్వారా ఎరకమ్మ కొడుకుల చేత కోర్టులో దావా వేయిస్తామని భుజంగయ్యతో చెప్పాడు కృష్ణ. ఆ మాటలు భుజంగయ్య మీద పిడుగుపడ్డట్టయింది. కృష్ణ అన్నంత పనిచేస్తాడని, కోర్టుకెక్కితే తన పరువు పోతోందని గ్రహించిన భుజంగయ్య తనకు పుట్టిన ఎరకమ్మ ఇద్దరి కొడుకులకు చెరో ఐదెకరాల మాగాణి వ్రాశాడు.

యువతరంగా వెలసి, గ్రామానికి వెలుగు తీసుకువస్తూ, మరోవైపు భుజంగయ్య కోరలను అణచివేస్తున్న కృష్ణ ఔదార్యానికి అందరూ మెచ్చుకుంటున్నారు. తన అక్రమాలను ఒక్కొక్కటి వెతికి తనను దెబ్బతీస్తూ, అవమానపరు





# నిత్య జీవితంలో కెమిస్ట్రీ

## కీటకాలమీద రసాయనిక పదార్థాలు

కీటకాలు తమ పరిసరాలలో వున్న కొన్ని రసాయనిక పదార్థాలను గుర్తించడం ద్వారా తమ ప్రవర్తనను మార్చుకుంటాయి. ఈ రసాయనిక పదార్థాలను "సిగ్నలింగ్ కెమికల్స్" లేక "సెమియో కెమికల్స్" అని అంటారు. కీటకాలను ఆకర్షించే పదార్థాల కోసం అన్వేషణ ఈ శతాబ్దం మొదట్లోనే ప్రారంభమైనప్పటికి, 1960 దశాబ్దం దాకా తొలి పదార్థం "బాంబికాల్" యొక్క గుర్తింపు, ఉత్పత్తి సాధ్యం కాలేదు. ఈరోజు మాస్‌స్పెక్ట్రోమెట్రి, గాస్‌క్రోమటోగ్రఫీ మొదలైన అధునిక పద్ధతుల సాయంతో "సెమియో కెమికల్" యొక్క నిర్మాణాన్ని కొద్ది నెలల్లోనే కనుక్కోవచ్చు. వీటిని కీటకాలను ఆకర్షించే ఎరలుగా కీటకాలను పారద్రోలడానికి ఉపయోగించవచ్చు. "సెమియో కెమికల్స్"ను రెండు గ్రూపులుగా విభజించవచ్చు. ఒకే వర్గానికి చెందిన జీవుల మధ్య పనిచేసే రసాయనాలను ఫిరోమోన్స్ అంటారు. భిన్నవర్గాల మధ్య పనిచేసే రసాయనాలను "అల్లేలో కెమిక్స్" అంటారు. "అల్లేలో కెమిక్స్"ను అల్లోమోన్స్, కైరోమోన్స్ అని రెండు విధాలుగా విభజిస్తారు. అల్లోమోన్స్ రసాయనాన్ని విడుదలచేసే వర్గానికి ఉపయోగపడతాయి. కైరోమోన్స్ రసాయనాన్ని స్వీకరించే వాటికి ఉపయోగపడతాయి. చాల సెమియోకెమికల్స్ అనేక విధాలుగా ప్రవర్తిస్తాయి. తేనేటిగలు పుష్పాల నుండి వచ్చే సువాసనలచే ఆకర్షించబడి వాటిలోని మకరందాన్ని గ్రహిస్తాయి. అదే సమయంలో తేనెటీగల మూలంగా పుప్పొడి వ్యాపించడం వల్ల పువ్వులకు మేలు కలుగుతుంది. ఈ సందర్భంలో పూల వాసనలు అల్లోమోన్స్‌గా, కైరోమోన్స్‌గా రెండు రకాలుగా వ్యవహారిస్తాయి. అలాగే ఒకే పదార్థం భిన్నవర్గాలలో భిన్న చర్యలకు దోహదమవుతాయి. ఉదాహరణకు డై హైడ్రో ఆక్టినొడియొలైడ్, ఆక్టినిడిన్ అనే రసాయనాలు రెండూ రాణిచీమ ఫిరోమోన్స్‌గా, పిల్లలలో జత కట్టే స్వభావానికి సంబంధించిన రసాయనాలుగా వ్యవహరిస్తాయి. చాలా మందికి సెమియో కెమికల్స్ అంటే కీటకాల లైంగిక చర్యలకు సంబంధించిన ఫిరోమోన్స్ అనే అభిప్రాయం ఉంది. బాష్పస్థితిలో వుండే ఈ రసాయనాలు స్త్రీ కీటకాలచే విడుదల చేయబడి మగకీటకాలను సంయోగానికి ఆకర్షించడానికి ఉపయోగపడతాయి. ఫిరోమోన్స్‌లో జాడను కనుక్కోవడానికి, సరిహద్దులను గుర్తించడానికి, ప్రమాదాన్ని సూచించడానికి ఎన్నోరకాలు ఉన్నాయి. చీమలు, తేనెటీగలు, కొన్ని క్షీరదాలతో విధేయత, యవ్వన దశను త్వరితం చెయ్యడం, ఉత్పత్తిని అణచివేయటానికి సంబంధించిన ఫిరోమోన్స్ ఉన్నాయి. ఫిరోమోన్స్ కీటకాలను నియంత్రించడానికి అదుపు చేయడానికి బాగా ఉపయోగిస్తాయి. ఫిరోమోన్ ఎరగా ఉపయోగించి జిగురుగా ఉన్న "ట్రాప్స్" సహాయంతో పేడ పురుగులను, చిమ్మట పురుగులను పట్టుకొని నిర్మూలిస్తారు.

-మహావాది రాయలు

## ఎదురీత

స్తున్న కృష్ణను భుజంగయ్య భుజంగంలా ఎప్పటికయినా కాటు వేయాలని నిర్ణయించుకున్నాడు. దానికి పర్యవసానంగా

ఒకనాటి అర్ధరాత్రి కామయ్య ఇల్లు అగ్నిమంటలకు ఆహుతైపోయింది. ఆ మంటల్లో కృష్ణ, కామయ్య కాలిపోయారని తెలిసి ఆ సంఘటన అందరికీ కన్నీరు తెచ్చింది. కొందరు పైకి వినిపించేలా ఏడుస్తున్నారు.

ఈ పని భుజంగయ్యే చేయించి ఉంటాడని గ్రహించిన జనమంతా ఆగ్రహావేశాలతో "నరరూప రాక్షసుడువంటి ఆ ... భుజంగయ్యను సజీవ దహనం చేయాలని" అనుకుంటూ కిరసనాయిలు సీసాలతో భుజంగయ్య ఇంటివైపు పరుగులుతీశారు.

పొరుగూరు తగువు విప్పటానికి వెళ్ళి వచ్చిన కృష్ణ ఇంటితోపాటు తాతయ్య కూడా కాలిపోయాడని తెలుసుకుని కుప్పలా కూలిపోయాడు. తల్లిదండ్రులను చంపించి, తనను పెంచి పెద్దచేసిన తాతను అగ్నికి ఆహుతిచేసిన భుజంగయ్యను కాల్చి చంపాలని ఆవేశంతో కొరకంచు పట్టుకొని అడుగులు వేస్తున్నాడు కృష్ణ.

"దుర్మార్గుని సన్మార్గునిగా చేయాలికాని, నువ్వు దుర్మార్గుడివి కారాదు" అని చెప్పిన గుర్నాధం మాష్టారు మాటలు జ్ఞప్తికి వచ్చిన కృష్ణ చేతిలో కొరకంచు జారిపోయింది.

ఇంటిలో దాక్కున్న భుజంగయ్యను బయటకు లాక్కువచ్చి, చేతులతో తల వొక దెబ్బా కొడుతూ తమ ఆవేశాన్ని చల్లార్చుకుంటున్నారు. అంతలో కృష్ణ వచ్చి గుంపును దూసుకువెళ్ళి భుజంగయ్య మీద దెబ్బలు పడనీయకుండా అడ్డుగా నిలిచాడు.

మంటల్లోకాలిపోయాడనుకున్న తమ నాయకుడు సజీవంగా తమ మధ్య ప్రత్యక్షమవగానే వాళ్ళందరూ ఒక్కసారే ఉప్పొంగిపోయారు. కృష్ణను భుజాల మీద ఎత్తుకొని అవధులు ఎరుగని ఆనందంతో, "యువనాయకుడు కృష్ణ జిందాబాద్" అంటూ ఏక కంఠంతో అరిచారు.

"కృష్ణా! నీలాంటివారు ఊరికి ఒకరుంటే గ్రామాల్లో జరిగే అవినీతి, కుల ద్వేషాలు అరికడతారు. ప్రతి గ్రామాలలో యువత విజృంభించాలి. అప్పుడే మన గాంధీ మహాత్ముడు కన్న ఆశయాలు నెరవేరతాయి. మా తాతయ్య ఆగ్రహావేశాలకు నీ వారందరూ బలైపోయారు. ఒంటరివాడివైన నీకు నేను జంటగా ఉంటాను" అని అపరంజి కృష్ణ చెయ్యిపట్టుకుంది. ఆ జంట వంక అందరూ ఆనందంగా, ఆశ్చర్యంగా, వింతగా చూస్తున్నారు. ●

# హలో! డాక్టర్ నేనేం చెయ్యాలి?



**డా. కొత్త రవీంద్రబాబు**

**కె. రవి, కాకినాడ:**

కుడిబీజం పైన నరంలా వాచివుంది.

హెట్రజాన్ బిళ్లలు రోజూ మూడు, సైనస్టాట్ ఫోర్ట్ బిళ్లలు రోజూ రెండు భోజనం తర్వాత పదిహేను రోజులు వాడండి.

తగ్గకపోయినా నొప్పి ఎక్కువైనా డాక్టరు గారికి చూపించుకోండి

**కె. శ్రీనివాస్, ఖమ్మం:**

వయస్సు 20సంవత్సరములు ముఖం మీద నల్లటి మచ్చలు, జిడ్డుగా వుంటుంది. ఏ సోపు ఏ క్రీమువాడాలి.

ఏ సోపూ వాడవద్దు, క్రీములనవసరం బికోజింక్ గొట్టం రాత్రి భోజనానంతరం ఒకటి చొప్పున రెండు నెలలు వాడండి. సున్నిపిండితో ముఖం రుద్దుకోండి.

**అభాగ్యురాలు, కావలి:**

రచయితగా సమాజాని కందించే అమూల్యమైన సలహా ఏమిటి?

నా వయస్సు 20 సంవత్సరాలు వివాహం కాలేదు. యోని పక్క ఉండలా వుండి నొక్కితేపోయి మరలా వస్తుంది. కుంకుడు గింజంత వుంది.

జ: రచయితగా సమాజానికి సలహా లిచ్చేంత గొప్పవాడిని కాను.

బిళ్లవలన నొప్పి లేకపోతే భయపడనవసరం లేదు.

లేడీ డాక్టరు గారికి చూపించుకోండి

**ఎ.ఆర్.రావు, బందరు:**

చంకలో బిళ్లలున్నాయి.

శస్త్రచికిత్స చేయించుకుని బిళ్లలను పెథాలజీ పరీక్షలకు పంపండి. రిపోర్టును బట్టి తర్వాత వైద్యం అవసరమయ్యేది లేనిది తెలుస్తుంది.

**బి. సుబ్బారావు, నెల్లూరు.**

మా అమ్మాయి వయసు 18 సంవత్సరములు తనలో తను మాట్లాడుకుంటూ వుంటుంది ఎవరో వచ్చారంటుంది దేవతలువచ్చి మాట్లాడి వెళ్లారంటుంది

మీ అమ్మాయి మానసిక వ్యాధితో బాధపడుతున్నది. సైకియాట్రిస్ట్‌కు చూపండి

**పి సుందరమ్మ, బందరు.**

మా అమ్మాయి జుట్టు పీక్కుని తింటుంది అందువలన ప్రమాదమా?

జుట్టు తినడం అన్నది మానసిక వ్యాధి లక్షణం తిన్న జుట్టు జీర్ణకోశంలో పేరుకుని అనేక అనర్థాలను కల్గిస్తుంది జీర్ణకోశంలో పేరుకు పోయిన జుట్టును ట్రైకోబెజొవార్ అంటారు శస్త్రచికిత్స చేసి తీసివేయవలసి వుంటుంది మానసిక వైద్యనిపుణుని సంప్రదించండి

**సి.ఎస్ రావు, తాడిగడప**

వయసు 25 సంవత్సరములు వివాహం కాలేదు లైంగిక శక్తి తగ్గిందన్న అనుమానంతో వేశ్య దగ్గరకు వెళ్లాను "చిన్న వయస్సులో ఇలా వుంటే ముందుముందు ఎలా?" అంది భయం పుట్టి ఘోరంగాఫెయిలయ్యాను చాలా బాధగా వుంది

నీలో ఏ లోపం లేదు ట్రయల్స్ మాని వివాహం చేసుకో

**ఎ. రామారావు, అద్దంకి.**

మా అబ్బాయి వయస్సు తొమ్మిది నెలలు హెర్నియా వున్నది ఆపరేషన్ చేయాలన్నారు భయంగా వుంది

నిర్భయంగా ఆపరేషన్ చేయించండి. హెర్నియా వచ్చాక వెంటనే ఆపరేషన్ చేయాలి

**ఎ. హుసేన్, కడప**

అంగం మీద పుండు పడింది విడిఆర్ఎల్ పాజిటివ్

1 64 పెనిడ్యూర్ 24 లక్షల యింజక్షన్లు వారానికొకటి చొప్పున నాలుగు వారాల పాటు చేయించుకోండి మీతో పాటు మీ శ్రీమతికి కూడా అదే దోసులో అదే ఇంజక్షన్లు చేయించుకోండి

**ఎస్ బి బాబు, ఒంగోలు.**

వెంట్రుక లూడుతున్నాయి, తెల్లబడుతున్నాయి జ్ఞాపకశక్తి తక్కువ

జింకోఫర్ గొట్టాం రాత్రి భోజనం తర్వాత, మెమొరాయ్ ఫోర్ట్ బిళ్ళ ఉదయం భోజనం తర్వాత రెండు నెలలపాటు వాడిచూడండి.

**పి రామకృష్ణ, నెల్లూరు.**

మా అబ్బాయి వయసు పన్నెండు సంవత్సరములు తరచు కడుపునొప్పి వస్తున్నది ఎన్ని పరీక్షలు చేయించినా ఫలితం లేదు

మీ అబ్బాయికి ఎబ్డామినల్ ఎపిలెప్సి వుందేమో? ఎలెక్ట్రో ఎన్‌సెఫలోగ్రఫీ పరీక్ష చేయించండి మేజెటాల్ రెండు వందల మిల్లీ గ్రాముల బిళ్ళలు రోజు రెండు చొప్పున మూడు నెలలు వాడండి ○



సీరియల్



# నేత్రధనుస్సు

## సాతవాహన

**ఇంతవరకూ సాగినకథ-13:** డేగర్ ముఠా సి.బి.ఐ. ఆఫీసర్ యశ్వంత్‌కుమార్‌ను కిడ్నాప్ చేస్తుంది గతంలో ఆఫీసర్ల ఆచూకీపై దర్యాప్తు చేస్తున్న ఫైలును అందజేయమని ముఠా నాయకుడు చిదానందం-యశ్వంత్‌ను బలవంత పెడతాడు కిడ్నాప్ కేసు గురించి ఆరాతీస్తున్న ఇన్‌స్పెక్టర్ కార్తికేయ పట్టుకున్న దుండగులలో నలుగుర్ని నయనతార గుర్తిస్తుంది. అరెస్టయిన ఆ నలుగుర్ని ఎలాగైనా తప్పించాలని ముఠా నాయకుడు చిదానందం ప్రయత్నిస్తాడు

**(గత సంచిక తరువాయి)**

కోర్టు హాలు కిక్కిరిసి పోయింది

యశ్వంత్ కిడ్నాప్ కేసులో నలుగురు కిడ్నాపర్స్ పట్టుబడ్డారన్న వార్త సంచలనాన్ని రేపింది ఆ కేసులో నే ఓ పసిపాప మర్డర్ కూడా. . కలిసి వుండడం ఆ సంచలనానికి మరింత ఆజ్యం పోసింది

అయితే ఆ నాడు విచారణకు తీసుకో బోతున్న కేసు జనంలో తీవ్రమైన ఆసక్తి రేకెత్తించడానికి కారణం మాత్రం వేరే వుంది

నయనతార

ఓ అంధురాలు ఆ నలుగురు ముద్దాయిల్ని ప్రత్యక్ష సాక్షిగా గుర్తు పట్టడమే కాకుండా వాళ్ళకు వ్యతిరేకంగా కోర్టులో సాక్ష్యం కూడా చెప్పబోతున్నదన్న వార్త సామాన్యుల్నే కాకుండా న్యాయశాస్త్రవేత్తల్ని కూడా ఆకర్షించింది

ఒక అంధురాలు ప్రత్యక్ష సాక్షిగా నేరస్తుల్ని గుర్తుపట్టడమనేది కోర్టు అంగీకరిస్తుందా?

అందరి మనసుల్లోనూ ఇదే ప్రశ్న

పీపుల్స్ గేలరీ ముందు వరసలో మేజర్ చక్రవర్తి, నయనతార, మాస్టర్ మనోజ్ వరుసగా కూర్చున్నారు హాలు మధ్య నున్న రౌండ్ టేబుల్ చుట్టూ కూడా అప్పటికే లాయర్లు నిండుగా కూర్చున్నారు జడ్జి ఇంకా రాలేదు పీపుల్స్ గేలరీలో కూర్చున్న వాళ్ళందరి కళ్ళూ నయనతార మీదే వున్నాయి

కోర్టు హాల్లో వున్న గోడగడియారం ఉదయం పదిన్నర గంటలు కావడానికింకా కొద్దినిమిషాలుందని సూచిస్తోంది సెకండ్ల ముల్లు టక్ టక్ టక్‌మంటూ ముందుకు జరిగిపోతోంది

ఇంతలో చిదానందం ముద్దుని వెంటబెట్టుకుని పీపుల్స్‌గేలరీలో అడుగు పెట్టాడు

'దీనబంధు' చిదానందాన్ని అక్కడ గుర్తుపట్టని వాళ్ళెవ రుంటారు అందరూ గుర్తు పట్టారు అయితే ఈ కేసులో చిదానందాని కున్న ఇంట్రెస్టు ఏమిటనేది మాత్రం ఎవరికీ అర్థం కాలేదు వాళ్ళకు సంఘసేవ వృత్తి చేస్తున్న వాడిలా చిదానందం నేరుగా నయనతార కూర్చున్న చోటుకి నడిచాడు

మేజర్‌చక్రవర్తి చిదానందాన్ని చూస్తూనే గుర్తుపట్టాడు

'వణక్కం మేజర్‌వాడీ, చిదానందం మొట్టమొదట మేజర్ చక్రవర్తినే పలకరించాడు

'హలో చిదానందం గారూ, మనం కలుసుకుని చాలా ఏళ్ళయి పోయింది అప్పుడెప్పుడో మీ శరణాలయం వార్షికోత్సవం రోజున, అన్నాడు మేజర్ చక్రవర్తి

తన మొహంలో ఎంత ప్రసన్నత కనబర్చ బోయినా ఆయన ప్రస్తుతం వున్న మానసిక పరిస్థితిలో అలా చేయలేక పోయాడు ఎంత ప్రయత్నించినా ఆయన మొహంలో గాంభీర్యం మాత్రమే తొణికిస లాడింది.

"మీకుదా రొంబా జ్ఞాపక శక్తి మేజర్ వాడీ," మొహం చాటంత చేసుకుంటూ ప్రశంసాపూర్వకంగా అన్నాడు చిదానందం "మీ కోడల్దా మా శరణాలయింలో పెరిగినాది తానె! అందుకువా ఈ కష్ట కాలంలో ఓ మాటు చూసి పోదామని వస్తి అయ్యయ్యయ్యయ్యో! నా శరణాలయంలో దా పెరిగినాది బిడ్డ- ఎంత కష్టముదా పడతావుందావు చిట్టితల్లీ!' అంటూ ఎక్కడలేని ఆప్యాయత వొలకబోస్తూ నయనతారతల మీద చెయ్యి వేశాడు చిదానందం

మనసులో విషం నింపుకొని చిదా నందం తనని పలకరించడానికి వచ్చాడని కానీ. ఆ కేసులో ముద్దాయిలకు అతనే డిఫెన్సు ఏర్పాటు చేశాడని కానీ నయనతారకు వూహ కూడా లేదు

"నీ బర్తను కాపాడే ఏర్పాట్లు నేనుదా పెంచుదు.' అని ప్రతిజ్ఞ చేసి మరీవెళ్ళి మేజర్ చక్రవర్తి పక్కకెళ్ళి కూర్చున్నాడు చిదానందాన్ని గుర్తించిన వాళ్ళెద్దరు సగౌరవంగా లేచి అతనికీ ముద్దుకీ కూర్చోవడానికి చోటిచ్చారు

ఇంతలో జడ్జి వస్తున్నాడని కోర్టు బెయిలిఫ్ ఎనౌన్స్ చేయడంతో కోర్టు హాలంతా ఒక్కసారిగా నిశ్శబ్దం వ్యాపించింది

జడ్జి వస్తున్న అడుగుల చప్పుడు కోసం నయనతార చెవులు రిక్కించింది

టక్ టక్ టక్ టక్..

జడ్జి వస్తున్నాడు

ఆ మాట అర్థం చేసుకుంటూనే ఎవరూ తనకు చెప్పనక్కర్లేకుండా, అందరితో పాటు లేచి నిలబడింది

జడ్జి కూర్చుంటూనే అందరితోపాటు తనూ కూర్చుంది

కోర్టు ప్రొసీడింగ్స్ ప్రారంభ మయ్యాయి

ఇన్‌స్పెక్టర్ కార్తికేయ యశ్వంత్ కిడ్నాప్ కేసులో ముద్దాయిలు నలుగుర్నీ కోర్టులో ప్రవేశపెట్టాడు ఆ తర్వాత బోనెక్కి వాళ్ళని తనే విధంగా పట్టుకున్నాడో సాక్ష్యం చెప్పాడు కార్తికేయ దిగిపోతూనే ప్రాసిక్యూటర్ నయనతార పేరు పిలిచాడు



అందరూ ఆసక్తిగా ఎదురు చూస్తున్న క్షణం వచ్చేసింది.

నయనతార లేచి నిలబడింది.

ఆమె ఎవరి సాయమూ లేకుండా తనంతట తనే విట్నెస్ బాక్స్ వైపు వెళ్తుంటే జనంలో గుసగుసలు వ్యాపించాయి.

నయనతార విట్నెస్ బాక్స్‌లో కెళ్ళి ప్రమాణస్వీకారం చేసింది.

ప్రాసిక్యూటర్ తన ప్రశ్నలు ప్రారంభించారు.

నయనతార ఎంతో నిబ్బరంగా తన భర్త కిడ్నాప్ జరగడం గురించీ, తన కూతురు బేబీ హత్యకు గురికావడం గురించీ చెప్పింది. ఆ ప్రశ్నలకు సమాధానం చెబుతుండగా ఆమె మొహంలో సంపూర్ణంగా గాంభీర్యం వ్యాపించింది. అయినా ఆమె ఆ ప్రశ్నలకు సమాధానం చెబుతున్న పద్ధతిని చూస్తుంటే అందరికీ ఆమె ఎంతటి మానసిక వేదన అనుభవించిందో అవగతమవుతోంది.

ఆ తర్వాత ఎదురైంది అసలైన ప్రశ్న.

"నయనతారగారూ, ఆ నాటి దుస్సంఘటనలో మీరు విన్న అడుగుల చప్పుళ్ళని మళ్ళీ వింటే గుర్తుపట్ట గలరా?" అడిగాడు పబ్లిక్ ప్రాసిక్యూటర్.

"గుర్తుపట్ట గలను." చెప్పింది నయనతార.

"అయితే ఈ కేసులో ముద్దాయిలు నలుగురూ ఇప్పుడు మీ ముందు నడుస్తారు. ఆ అడుగుల చప్పుళ్ళూ, ఆ నాటి సంఘటనలో మీరు విన్న అడుగుల చప్పుళ్ళూ ఒకటి అవునో కాదో గుర్తించండి," అన్నాడు పబ్లిక్ ప్రాసిక్యూటర్.

సి. బి. ఐ. డైరెక్టర్ కరుణాకర్ సాయంతో చిదానందం ఏర్పాటు చేసిన డిఫెన్స్ లాయర్ అంతవరకూ ఒక్క అబ్జెక్షన్ కూడా లేవనెత్త లేదు. అయితే పబ్లిక్ ప్రాసిక్యూటర్ ఎప్పుడైతే ఆ ప్రశ్న అడిగాడో ఆ మరుక్షణం ఆ డిఫెన్స్ లాయర్ దిగ్గున లేచి నిలబడ్డారు.

**1991లో విద్యుచ్ఛక్తి, ఇంధనం, విడిభాగాలు, తదితర పదార్థాల ధరలు పెరగడంతో మాస్కో భూగర్భ రైల్వే నిర్వహణ వ్యయం 19 కోట్ల రూబుళ్ల నుండి 40 కోట్ల రూబుళ్లకు పెరగనున్నదని మాస్కో మెట్రో ఉపాధ్యక్షుడు ద్మిత్రీగయేవ్ చెప్పారు** తక్షణ చర్యలు గైకొనకపోతే జనవరి 10 నుండి మెట్రో సిబ్బందికి జీతాలివ్వడం కూడా కష్టమవుతుందని ఆయన చెప్పారు 'మెట్రో ఛార్జీలు పెంచినా ఆ ఆదాయం రైల్వే మంత్రిత్వశాఖకే చెందుతుంది. అందువల్ల ఆశించిన ఫలితాలు సమకూరవని, మాస్కో నగరపాలిక అధ్యక్షుడు గవ్రీల్ పొపోవ్




అన్నారు. నగరపాలక సంస్థకు మాస్కో మెట్రోను బదలాయించినట్లయితే యీ సంస్థ ఆర్థిక సమస్యలు పరిష్కారమయ్యే అవకాశముందని ఆయన చెప్పారు.

'ఈ సమస్యను పై విధంగా చూడటం సరికాదు. 1990లో మాస్కో మెట్రో రైల్వే మంత్రిత్వశాఖకు 10 లక్షల రూబుళ్లు చెల్లించి, 330 లక్షల రూబుళ్లు గ్రాంటుగా పొందింది ఆర్థిక సంబంధాలు విచ్ఛిన్న మవుతున్న దశలో ప్రస్తుత వ్యవస్థలను క్రియాశీలంగా కొనసాగించడం మంచిది వాటి స్థానంలో కొత్తవాటిని నెలకొల్పబూనడం ప్రయోజనదాయకం కాదని గయేవ్ అన్నారు మార్కెట్ ఆర్థిక వ్యవస్థ స్థిరంగా నెలకొన్నాక యాజమాన్యం మార్పు గురించి ఆలోచించవచ్చునని, ఎట్టి పరిస్థితులలోనూ దీనిని నగరపాలికకు అప్పగించరాదని ఆయన చెప్పారు

# నేత్రధనుస్సు

"యువరానర్, ఈ ప్రశ్నకు నేనభ్యంతరం చెబుతున్నాను ఒక గుడ్డిది ముద్దాయిల్ని ఎలా గుర్తుపట్ట గలుగుతుందో నా కర్థం కావడం లేదు అన్నాడు

"యువరానర్, డిఫెన్స్ లాయర్‌గారు ఈ సాక్షిని గుడ్డిది అని సంబోధించడం పట్ల నేను తీవ్రమైన అభ్యంతరం తెలియ జేస్తున్నాను, అన్నాడు

డిఫెన్స్ లాయర్ ఆశ్చర్య పోతున్నట్టుగా చూశాడు

'ఓ గుడ్డిదాన్ని గుడ్డిది అనడంలో తప్పేమిటో నా కర్థం కావడం లేదు యువరానర్ పబ్లిక్ ప్రాసిక్యూటర్ గారు ఎలాగూ ఈ ప్రశ్న లేవనెత్తారు కాబట్టి ఈ సాక్షిని కొన్ని ప్రశ్నలు క్రాస్ ఎగ్జామినేషన్లో అడగడానికి అనుమతి కోరుతున్నాను అన్నాడు

నేనింకా చీఫ్ ఎగ్జామినేషన్ పూర్తి చెయ్యలేదు యువరానర్ అభ్యంతరం చెప్పాడు ప్రాసిక్యూటర్

యువరానర్, పబ్లిక్ ప్రాసిక్యూటర్ గారు అడిగిన ప్రశ్న ముద్దాయిల్ని ఈ సాక్షి గుర్తుపట్టడం గురించి మామూలు సందర్భాల్లో అయితే ప్రాసిక్యూటర్ గారి ప్రశ్న అనుమతించ దగ్గదే అయితే ఈ సందర్భంలో మాత్రం ఆ ప్రశ్న కేవలం అనుచితం మాత్రమే కాదు అసందర్భం కూడా ఈ సాక్షి ప్రాసిక్యూటర్ గారి ప్రశ్నకు సమాధానం చెప్పకముందే నేను కొంత క్రాస్ ఎగ్జామినేషన్ చేయడం అత్యవసరం యువరానర్ ఆ తర్వాత ప్రాసిక్యూటర్ గారి దగ్గర ఇంకేమైనా ప్రశ్నలు మిగిలితే కావలిసినంత సేపు చీఫ్ ఎగ్జామినేషన్ జరుపుకోవచ్చు ఈ సాక్షి ప్రాసిక్యూటర్ గారి ప్రశ్నకు సమాధానం చెప్పడానికి ముందే క్రాస్ ఎగ్జామినేషన్ చెయ్యడానికి అనుమతి కోరుతున్నాను. డిఫెన్స్ లాయర్ వినయం ఒలుకుతుంది

జడ్జి ఒక్క క్షణం ఆలోచించాడు

ఓకే ప్రొసీడ్ అన్నాడు

పబ్లిక్ ప్రాసిక్యూటర్ ఇంకేమి చెప్పలేక కూర్చున్నాడు

చూడండి నయనతార గారూ మీకు కళ్ళు లేవు కదూ' అడిగాడు డిఫెన్స్

వున్నాయి తడుముకోకుండా సమాధానం చెప్పింది నయనతార

ఆ జవాబు వింటూనే కోర్టు హాల్లో గుసగుసలు చెలరేగాయి నిశ్శబ్దంగా వుండవలసిందని జడ్జీ ఆర్డర్ చేయాల్సొచ్చింది కోర్టు హాల్లో నిశ్శబ్దం వ్యాపించింది

నయనతార చెప్పిన సమాధానానికి డిఫెన్స్ లాయర్ ఆశ్చర్య పోతున్నట్టుగా చూశాడు

నయనతార గారూ మీకు కళ్ళు లేవు తన ప్రశ్న ఆమెకు అర్థమైందో లేదో నన్న అనుమానంతో మళ్ళీ అన్నాడు

వున్నాయి ఇవిగో నా కళ్ళు

నయనతార తన రెండు కళ్ళూ చూపించే సరికి డిఫెన్స్ లాయర్ ఆ పూట మొట్ట మొదటి సారిగా ఖంగుతిన్నాడు ఆమె విశాల నేత్రాల వైపు చూస్తూ అతను గుటకలు మింగుతుంటే కోర్టు హాల్లో అందరూ నవ్వడం మొదలెట్టారు

అయితే నా ప్రశ్న మరో విధంగా **అడుగుతాను, సర్దుకుంటూ అన్నాడు డిఫెన్స్ లాయర్ "నయనతార గారూ, మీకు చూపు లేదు, అవునా?**

' వుంది, అంది నయనతార

మీరబద్ధం చెబుతున్నారు, అరిచాడు డిఫెన్స్ లాయర్

"కాదు నిజం చెబుతున్నాను నాకూ చూపుంది నేను కళ్ళతో చూడలేక పోయినా మనసుతో లోకాన్ని చూడగలను అంత తీవ్రంగానూ' అంది నయనతార

డిఫెన్స్ లాయర్‌కి అప్పుడు దారి దొరికింది

'దట్స్ ఎక్జాక్ట్లీ మై పాయింట్, ఎగిరి గంతేస్తూ **అన్నాడు నయనతార గారూ ఇది కోర్టు ఈ కోర్టుకు మీ మనసుతో పని లేదు నేనడుగు తున్న ప్రశ్న శారీరకంగా మీకు చూపున్నదా లేదా?అన్నది మీరు మీ రెండు కళ్ళతో చూడలేరు, అవునా?**

అవును నెమ్మదిగా అంది నయనతార

డిఫెన్స్ లాయర్ అప్పుడు తేలిగ్గా వూపిరి పీల్చుకున్నాడు

**"అంటే మీరు గుడ్డివారు అవునా? మళ్ళీ అడిగాడు**

**"అవును - అవును, అసహనంగా అంది** నయనతార

**డిఫెన్స్ లాయర్ విజయగర్వంతో మొదట పబ్లిక్** ప్రాసిక్యూటర్ కేసి చూశాడు **ఆ తర్వాత జడ్జీ వైపు తిరిగాడు**

'**దేర్‌ఫోర్ యువరానర్, ఈ సాక్షి గుడ్డిది. అన్నాడు.**

పబ్లిక్ ప్రాసిక్యూటర్ చివాల్న లేచి నిలబడ్డాడు

'**యువరానర్, ఈ సాక్షికి కంటిచూపు లేకపోవచ్చు అంత మాత్రంచేత డిఫెన్స్ లాయర్** గారు మాటి మాటికీ **ఈ సాక్షిని గుడ్డిది గుడ్డిది అని** సంబోధించడం **అమర్యాదకరంగా వుంది, కోపంగా** అన్నాడు

'తను గుడ్డిదాన్నని **ఈ సాక్షే స్వయంగా** ఒప్పుకుంది యువరానర్, **తాపీగా అన్నాడు డిఫెన్స్** లాయర్

నయనతార బోన్లోంచి హఠాత్తుగా ఆక్రోశించింది –

**"అవును యువరానర్, నేను గుడ్డిదాన్నే ముమ్మాటికీ గుడ్డిదాన్నే ఓ గుడ్డిదాన్ని గుడ్డిదే అనన్వివ్వండి యువరానర్, గుడ్డిదే అనన్వివ్వండి. ఆ** కోర్టు హాల్లో **ఆమె** కంఠం ప్రతిధ్వనించింది

**ఆమె కళ్ళ వెంట కన్నీళ్ళు జారిపోతున్నాయి**

**జడ్జీ ఆమె వైపు సానుభూతిగా చూశాడు**

'మీరు **వాడుతున్న సంబోధనలోని తీవ్రత** తగ్గిస్తే **బావుంటుంది కౌన్సెలర్, అన్నాడాయన**

**"ఆల్‌రైట్ యువరానర్ ఈ సాక్షిని ఇక మీద**

అందురాలని సంబోదిస్తాను దానివల్ల నా పాయింట్లో మార్పు లేదు ఈ సాక్షి నిజంగా గుడ్డిదె ఈమె ఏదీ చూడలేను అలాంటప్పుడు ఈ కేసులో ముద్దాయిల్ని గుర్తుపట్టమని ఈ సాక్షిని కోరడం పబ్లిక్ ప్రాసిక్యూటర్ గారు విసిరిన చమత్కారంగా నేను భావిస్తున్నాను, నవ్వుతూ అన్నాడు డిఫెన్స్ లాయర్

"గుర్తుపట్ట గలను యువరానర్, నేనీ కేసులో ముద్దాయిలు నలుగుర్నీ గుర్తుపట్ట గలను.' విట్నెస్ బాక్స్‌లోంచి ఆత్రంగా అంది నయనతార "నేను గుడ్డిదాన్నైతే కావచ్చు కానీ ఒక్కసారి ఎవరి అడుగుల చప్పుడైనా వింటే వారి మొహం చూసిం దానికంటే స్పష్టంగా గుర్తుపట్ట గలను

'ఇటీజ్ ప్రిపాస్టరస్ యువరానర్ ఈ సాక్షి తాను గుడ్డిదని ఒప్పుకుంటూ కూడా ఈ కేసులో ముద్దాయిల్ని గుర్తుపట్ట గలనని చెప్పడం కేవలం హాస్యాస్పదం కాబట్టి ఈ కేసులో ముద్దాయిల్ని గుర్తించ డానికి ఈ సాక్షిని అనర్హురాలిగా ప్రకటించ వలసిందిగా కోర్టు వారిని కోరు తున్నాను. అంటూ కూర్చున్నాడు

జడ్జి పబ్లిక్ ప్రాసిక్యూటర్ వైపు చూశాడు

"డిఫెన్స్ వాదన సబబుగానే వుందను కుంటాను మిస్టర్ ప్రాసిక్యూటర్, అన్నా డాయన

"కానీ, యువరానర్ , ప్రాసిక్యూట రేదో అనబోయాడు కానీ తన మాట పూర్తి చేయలేక పోయాడు

"డిఫెన్స్ వారి వాదనతో నేనూ ఏకీభవిస్తున్నాను ఈ సాక్షి అంధురాలు కావడం చేత ఈ కేసులో ముద్దాయిల్ని గుర్తుపట్ట డానికి అనర్హురాలిగా కోర్టు నిర్ణయిస్తోంది, అన్నాడు జడ్జి

'నో' అరిచింది నయనతార "ఒక్క అవకాశం నాకు ఒక్క అవకాశం ఇప్పించండి యువరానర్, నేనీ ముద్దాయిల అడుగుల చప్పుళ్ళు' గుర్తుపట్ట గలను, ఆక్రోశించింది

"చూడమ్మా, ఇది కోర్టు ఈ కోర్టు నిర్ణయంలో కొన్ని న్యాయ సూత్రాల మీద ఆధారపడి వుంటాయి ఆ న్యాయసూత్రాల ఆధారంగానే ఈ ముద్దాయిల్ని గుర్తు పట్టడానికి నిన్ను అనర్హురాలిగా ప్రకటించడం జరిగింది, అన్నాడు జడ్జి

నయనతార పిడికిళ్ళు బిగించి లోలోపలే కుంచించుకు పోయింది

జడ్జి పబ్లిక్ ప్రాసిక్యూటర్ కేసి తిరిగాడు

"ఎనీమోర్ క్వశ్చన్స్ మిస్టర్ ప్రాసిక్యూటర్?"

"నో యువరానర్, నో మోర్ క్వశ్చన్స్" అంటూ నిస్సహాయంగా కూర్చుండి పోయాడు ప్రాసిక్యూటర్

డిఫెన్స్ లాయర్ చటుక్కున మళ్ళీ లేచి నిలబడ్డాడు

"దేర్‌ఫోర్ యువరానర్, ప్రాసిక్యూషన్ వారి ప్రధాన సాక్షినే కోర్టువారు అనర్హురాలిగా ప్రకటించినందువల్ల ముద్దాయిల్ని జడ్జిమెంట్ ప్రకటించేంతవరకూ ఫార్మల్‌గా

## రాణిగారి రాచరికం!

రాజులు తమ విలాసాలకు ఎంత ఖర్చు చేస్తారో, మహారాణులు కూడా తమ సౌందర్య పోషణకోసం అంతే ఖర్చు చేస్తారు. ఇదొక చారిత్రక వాస్తవం అయితే- ఆధునిక కాలంలో కూడా అలాంటి వ్యక్తులు ఉన్నారంటే ఆశ్చర్యమేస్తుంది! తొమ్మిదేళ్ళ క్రితం వరకు ఒక స్కూలు టీచర్‌గా పని చేసి, అనంతరం వేల్స్ యువరాజు చార్లెస్‌ను పెళ్ళాడిన డయానా తన దుస్తుల కోసం వెచ్చించే మొత్తమెంతో తెలిస్తే మ్రాన్పడి పోతాం. ఆ కుటుంబంతో ఎంతో కాలంగా సన్నిహితంగా ఉన్న ఆండ్రూ మార్టిన్ అనే ఆయన ఇటీవల ఒక పుస్తకాన్ని రచించారు. అందులో రాణిగారి ఖర్చుల వివరాలు చాలా ఉన్నాయి

పెళ్ళయినప్పటి నుండి ఇప్పటి వరకు ఆమె పందొమ్మిది లక్షల డాలర్లు దుస్తుల కొరకు వెచ్చించారట ఏడాదికి ఆమె ఖర్చు రెండు లక్షల డాలర్ల పైచిలుకేనట డయానాకు 95 ఈవినింగ్ గౌన్లు, 176 డ్రెస్‌లు, 178 సూట్లు, 54 కోట్లు, 141 టోపీలు, 71 బ్లౌజులు, 29 స్కర్ట్‌లు, పాతిక జతల ట్రేజర్లు, 29 జాకెట్లు, 350 చెప్పుల జతలు, 200 పర్సులు ఉన్నాయట ఇవికాక ప్రతి ఏడాది అండర్‌వేర్లపై 22,950 డాలర్లు, నైట్‌వేర్లపై 34 వేల డాలర్లు, మేజోళ్ళపై 11,475 డాలర్లు వెచ్చిస్తారట

–ఎస్. భూమారెడ్డి

పర్సనల్ బెయిల్ మీద విడుదల చేయవలసిందిగా కోరుతున్నాను" అన్నాడు

జడ్జి ప్రాసిక్యూటర్ వైపు చూసాడు

"మీరు ప్రవేశపెట్టవలసిన సాక్ష్యం ఇంకేమైనా వుందా మిస్టర్ ప్రాసిక్యూటర్?"

ప్రాసిక్యూటర్ కళ్ళు దించుకుని లేదన్నట్టుగా తలూపాడు

"అయితే డిఫెన్స్‌వారి కోరిక మీద ముద్దాయిల్ని ఫార్మల్‌గా బెయిల్‌మీద విడుదల చేస్తున్నాను" అంటూ ఆర్డర్ పాస్ చేసి బెంచిమీదనుంచి లేచి వెళ్ళిపోయాడు జడ్జి

నలువైపులా గుస గుసలు వ్యాపించాయి

మేజర్ చక్రవర్తి మొహంలో గాంభీర్యం చెక్కు చెదరలేదు అయితే ఆయన కళ్ళలో తీవ్రమైన నిస్పృహ వ్యక్తమవుతోంది

కార్తికేయ మొహంపైన డిసప్పాయింట్‌మెంట్ స్పష్టంగా కనిపిస్తోంది

చిదానందం కళ్ళలో విజయగర్వం తొణికిసలాడుతోంది

నయనతార స్తంభీభూతురాల్లై ఇంకా అలా నిలబడే వుంది

* * * * *

కోర్టు కారిడార్

నలువైపులా టకటకా అడుగుల చప్పుళ్ళు వినిపిస్తున్నాయి

సాయంత్రం అయిదు గంటలా అయిదు నిమిషాలైంది

జడ్జి తన ఛాంబర్స్‌లోంచి బయటి కొచ్చాడు ఛాంబర్స్ బయట నిలబడ్డ బంట్రోతు సలాం స్వీకరించి చకచకా తన కారు వైపు నడవనారంభించాడు దారిలో ఎదురొచ్చిన వాళ్ళందరూ ఆయనకు వినయంగా నమస్కరిస్తున్నారు అందరి సమస్కారాలూ స్వీకరిస్తూ ఆయన ముందుకు నడుస్తున్నాడు

టక్... టక్. టక్ .. టక్. .

నలువైపులా వినిపిస్తున్న అడుగుల చప్పుళ్ళ మధ్య ఆయన బూట్ల శబ్దం కలిసిపోతోంది

అకస్మాత్తుగా వెనకనుంచి ఓ స్త్రీ కంఠ స్వరం వినిపించింది-

"మిస్టర్ జడ్జ్!"

జడ్జి వులిక్కిపడి వెనక్కి తిరిగారు.

ఆ మరుక్షణం ఆయన ఆశ్చర్యానికి అంతులేదు

ఎదురుగా నయనతార నిలబడివుంది

"ఒక గుడ్డిది మిమ్మల్నింతమందిలో ఎలా గుర్తు పట్టిందని నిర్ఘాంతపోతున్నారా జడ్జిగారూ?"

ఆయన మొహంలో తాండవమాడుతున్న ఆశ్చర్యాన్ని కళ్ళతో చూసినట్టుగానే వ్యంగ్యంగా అడిగింది

'జడ్జి ఒక్కక్షణం ఆ ప్రశ్నకు సమాధానం చెప్పలేకపోయాడు

"కానీ కానీ " ఏదో అనబోతూ తడబడ్డారు

"కళ్ళులేనివాళ్ళందరూ గుడ్డివాళ్ళుకారు యువరానర్ కళ్ళుండీ చూడలేనివాళ్ళే నిజమైన గుడ్డివాళ్ళు" నయనతార కంఠం ఖంగుమంది

"చూడమ్మాయ్ " జడ్జి మళ్ళీ ఏదో అనబోయాడు

"ఆవండి యువరానర్, మీరేం చెబుతారో నాకు తెలుసు" ఆవేశంతో గర్జించింది నయనతార "కోర్టు విచారణ న్యాయసూత్రాల మీద ఆధారపడి వుంది అంతేగా? ఏది యువరానర్ న్యాయం?

ఎక్కడుంది యువరానర్ న్యాయం? మీ కలంలో సిరాతో పాటు బంది అయ్యిందను కుంటున్నారా? కాదు యువరానర్, కాదు న్యాయం ఎవరి చేతుల్లోనూ బందీకాదు మీరు న్యాయదేవతకు సేవ చేసేవారే తప్ప న్యాయదేవత మీకు సేవ చేయదు యువరానర్, ఎన్నటికీ చేయదు "

జడ్జి నిరుత్తరుడై ఆమె చెప్పే మాటలు వింటున్నారు

"ఇప్పటికైనా గుర్తించారా యువరానర్? ఇన్ని అడుగుల చప్పుళ్ళ మధ్య మీ అడుగుల చప్పుడు నేనెలా స్పష్టంగా గుర్తు పట్టగలిగానో అలాగే ఆ దుర్మార్గుల అడుగుల చప్పుళ్ళు కూడా నేను గుర్తుపట్టగలిగాను ఇప్పుడు కూడా నా సాక్ష్యం అంగీకరించలేరా యువరానర్?"

ఆమె అడిగిన ప్రశ్న తూటాలా జడ్జి గుండెలో దిగబడింది

"ఆ నలుగురి అడుగుల చప్పుళ్ళు నా గుండె చప్పుళ్ళతో కలిసి మోగుతున్నాయి యువరానర్. నా రక్తంలో కలిసిపోయి కాలకూట విషంలా నా గుండెను భగభగా మండిస్తున్నాయి. మీ రిచ్చిన తీర్పు మీరు తిరగరాయలేకపోవచ్చు. కానీ, నేనా తీర్పు తిరగరాయబోతున్నాను.

పొరపాటు చేశాను యువరానర్, మిమ్మల్నీ మీ న్యాయస్థానాల్నీ నమ్మి నేను చాలా పొరపాటు చేశాను నాలాంటి అంధులకు ఈ కోర్టుల్లో న్యాయం దొరకదని నాకు తెలిసిపోయింది. ఈరోజునుంచి ఈ క్షణంనుంచి నా మనసే నా న్యాయస్థానం నేను లిఖించబోయేదే తీర్పు. నేనా తీర్పు రాసిననాడు మీ న్యాయస్థానాలన్నీ తమ న్యాయశాస్త్రాలు తిరగరాయాలి యువరానర్

"ఈ క్షణం నుంచి నేను మీ న్యాయ వ్యవస్థమీద ఆధారపడను నా తీర్పు నేనే రాసుకుంటాను యువరానర్, నా తీర్పు నేనే రాసుకుంటాను

అవి మాటలు కావు

నయనతార గుండెలోంచి వెలువడుతున్న అగ్ని బాణాలు

అప్పటికే చుట్టూ జనం గుమి గూడారు

వాళ్ళిద్దరూ అలా ఒకరి కొకరు ఎదురెదురుగా నిలబడి వుండగానే కొందరు పోలీసులు అక్కడికి పరుగెత్తుకుంటూ వచ్చారు.

వాళ్ళొచ్చే సమయానికి నయనతార గిరుక్కున వెనక్కి తిరిగింది

"ఆగండి ఆమెను వెళ్ళనివ్వండి."

# నేత్రధనస్సు

అజ్ఞాపించాడు జడ్జి

ఆమెను పట్టుకోబోతున్న వాళ్ళల్లా ఆ పోలీసులు ఆగిపోయారు

"నేరాన్ని శిక్షించ నలసిన ఈ న్యాయ వ్యవస్థ ఇప్పటికే ఆమె విషయంలో ఒక నేరం చేసింది మీరు మరో నేరం చేయకండి," అన్నాడు జడ్జి

తల పైకెత్తుకుని ఎలాంటి తడబాటూ లేకుండా సూటిగా ముందుకు నడుచుకుంటూ వెళ్ళిపోతున్న నయనతారను అందరూ కళ్ళప్పగించి చూస్తూ వుండి పోయారు

* * * * * *

నయనతార నేరుగా మేజర్ చక్రవర్తి నిలబడివున్న చోటుకి నడిచింది

అక్కడ వున్న మాస్టర్ మనోజ్ ఆమె చెయ్యి పట్టుకున్నాడు

"రండి మావయ్యా, ఈ న్యాయస్థానాలలో న్యాయం నేతిబీరకాయలో నెయ్యి వంటిదని తెలిసిపోయింది," కొడుకుని దగ్గరికి తీసుకుంటూ అంది నయనతార

మేజర్ చక్రవర్తి ఏదో అనబోయాడు

ఇంతలో పక్కనుంచి పకపకానవ్వు వినిపించింది

మేజర్ చక్రవర్తి వులిక్కిపడి అటువైపు చూశాడు

ఎవరో పిచ్చివాడు

జుట్టు తైల సంస్కారం లేక చిందర వందరగా వుంది గడ్డం బాగా పెరిగిపోయింది బట్టలు చిరిగి నలిగి మాసికలు పడివున్నాయి ఓ చెత్త బండీకి తాడుకట్టి తమవైపు లాక్కొస్తున్నాడు వాళ్ళు తనవైపు చూస్తూనే అతను ఆగిపోయి మరోసారి పకపకానవ్వాడు

"నువ్వక్కడ నేనిక్కడ- మన మధ్య ఎంతో వుంది" అన్నాడతను

నయనతార ఆ మాటలు వింటూనే అతనెవరో పిచ్చివాడని అర్థం చేసుకుని ముందుకు పోబోయింది

పిచ్చివాడు చప్పున ఆమె చెయ్యి పట్టుకున్నాడు

"ఆగు ఏదో చెయ్యాలని పోబోతున్నావ్ ఏం చెయ్యాలో నేను చెబుతాను," అంటూ చటుక్కున ఆమె చెయ్యి వదిలిపెట్టి ముందుకు పరిగెత్తాడు

అతనేం చేయబోతున్నాడో మేజర్ చక్రవర్తి అర్థం చేసుకోబోయేలోపలే అతనో పెద్ద రాయందుకుని పరిగెత్తుకుంటూ వచ్చాడు

మేజర్ చక్రవర్తి కంగారు పడ్డాడు

ఆయన ఆ పిచ్చివాణ్ని పట్టుకోబోయే లోపల ఆ పిచ్చివాడు తనే ఆగిపోయాడు

"హుష్!" నోటి మీద వేలుంచుకుంటూ మేజర్ చక్రవర్తికేసి చూస్తూ అన్నాడు

మేజర్ చక్రవర్తి కూడా ఆగిపోయాడు

పిచ్చివాడు చటుక్కున తన చేతిలోని రాయి నయనతార చేతిలో వుంచేసి పిచ్చిగా నవ్వాడు

"ఏం చెయ్యాలో తెలిసిందా? ఇదీ ఇది చెయ్యాలి నువ్వు," అంటూ మరోసారి పిచ్చిగా నవ్వి ముందుకెళ్ళిపోయాడు

నయనతార తన చేతిలో వున్న రాయి పారేయబోయింది

మేజర్ చక్రవర్తి చప్పున ఆమె చేతిలోని రాయి తనందుకున్నాడు

"ఏమిటి మావయ్యా ఆ పిచ్చివాడి మాటలు?" తేరుకుంటూ అంది నయనతార

మేజర్ చక్రవర్తి తన చేతిలోని రాయికేసి సాలోచనగా చూశాడు

"అతను పిచ్చివాడే కావచ్చు తల్లీ?కానీ, అతను చేసిన పిచ్చిపనిలోనే ఏదో అర్థం వున్నట్టు నాకనిపిస్తోంది," అన్నాడు

నయనతార మొహంలో ఆశ్చర్యం కనిపించింది

'అవును తల్లీ ఆ అర్థం లేని మాటల్లోనే ఒక వింత అర్థముంది ఆ పిచ్చివాడు నన్ను గుండె రాయి చేసుకోమంటున్నాడు," మెల్లగా అన్నాడు మేజర్ చక్రవర్తి

నయనతార నిర్ఘాంత పోయింది

పిచ్చిగా నవ్వుకుంటూ చెత్తబండి లాక్కెళ్ళిపోతున్న ఆ పిచ్చివాడి కేసి విచిత్రంగా చూస్తుండి పోయాడు మేజర్ చక్రవర్తి

(ఇంకా వుంది)

# వెండితెర-బుల్లితెర

## టూరిస్టుల నాకర్షిస్తున్న "టిప్పు" స్పాట్!

ప్రస్తుత టీవీ సీరియల్స్‌లో అధిక ప్రాచుర్యం పొందినది టిప్పుసుల్తాన్ ఈ సీరియల్ షూట్ చేసిన ప్రదేశాలు, అలాగే "టిప్పు" చరిత్రకు సంబంధించిన ప్రదేశాలకు టూరిస్టులు ఎక్కువగా వెళ్తున్నారు. మైసూర్‌లోని శ్రీరంగపట్నాన్ని వారాంతపు రోజుల్లో టూరిస్టులు అధికంగా సంద ర్శిస్తున్నారు నాటి మైసూర్ చక్రవర్తి దరియాదౌలత్ ప్రదేశాన్ని కూడా వేసవి విడిదిగా యాత్రికులు సందర్శిస్తున్నారు.బ్రిటిష్ వారితో తిరుగులేని పోరాటం జరిపిన టిప్పు ఈ చోటులో వీరమరణం పొందాడని అంటారు.

## హీర్‌గా శ్రీదేవి

నాటి ప్రేమకథల ఆధారంగా సీరియల్స్ నిర్మాణం జరుగుతుండగా, మరో వైపున చిత్రాల నిర్మాణం జరుపుతున్నారు అలనాటి ప్రముఖ ప్రేమకథ "హీర్‌రాంఝా"ను మరలా చిత్రంగా తీస్తున్నారు "నాగినా" చిత్ర నిర్వాహకుడు హర్మేష్‌మల్హోత్రా సారథ్యంలో వస్తున్న ఈ చిత్రంలో



నాయకా నాయికలుగా అనిల్‌కపూర్, శ్రీదేవిలు నటిస్తున్నారు. మిస్టర్ ఇండియా కలెక్షన్స్ స్థాయిలో ఈ ప్రేమకథా చిత్రం ఉంటుందని భావిస్తున్నారు

## గంధర్వుడిగా నితిష్

మహాభారత్ కృష్ణుడు నితిష్ ఒక మళయాళ చిత్రంలో గంధర్వుడిగా నటిస్తున్నాడు ఇతడి సరసన మానవకన్యగా సుపర్ణా ఆనంద్ నటిస్తున్నది 'ముకద్దర్‌కా బాద్‌షా' చిత్రంలో వినోద్‌ఖన్నా సోదరిగా సుపర్ణా నటించింది వైశాలి చిత్రం సుపర్ణాకు మంచి గుర్తింపును తెచ్చింది. నితిష్ సరసన సుపర్ణా నటిస్తున్న ఈ మళయాళ చిత్రానికి దర్శకుడు పద్మరాజన్ ఇంద్రలోకం నుండి వచ్చిన గంధర్వుడు మానవకన్యతో ప్రేమలో పడ్డాక, జరిగే ఆసక్తి కరమైన పరిణామాలు ఈ చిత్ర ముఖ్య కథాంశమని తెలుస్తోంది

– గణపతిరావు, పి.






అడ్వొకేట్: **బి.భాస్కరరావు** ఎం.ఎ.,ఎల్.ఎల్.బి.

**టి. శ్రీహరిరావు, టి. సుందూరు (గుంటూరు జిల్లా)**

ప్రశ్న: నేను వ్రాసిన ప్రశ్నకు సమాధానం ఇంకా ప్రచురించ లేదు ఇందుతో నా కేసు వివరాలు పంపుతున్నాను. మీ సలహా కోరుతున్నాను.

జవాబు: మీరు ప్రశ్నలు ఇంగ్లీషులో పంపుతున్నారు. కాని సమాధానాలు తెలుగులోనే ఇవ్వాలి మీరు మొదట పంపిన ప్రశ్నకు సమాధానం పత్రికవారు ప్రచురిస్తారు మీరు రైల్వేలో ఏ. ఎస్. ఎమ్.గా పని చేసినట్లు రాశారు. మిమ్ము నిర్బంధంగా పదవీ విరమణ చెయ్యించిన ఉత్తర్వులు వివరించలేదు. ఆహుజా కేసులో నిర్బంధంగా పదవీ విరమణ చెయ్యించిన ఉత్తర్వులు 1987లో సుప్రీం కోర్టు కొట్టివేసింది. కాబట్టి మీరు ఈ ఉత్తర్వులు అన్యాయమని, రాజ్యాంగ విరుద్ధమని హైదరాబాద్ లోని సెంట్రల్ అడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యూనల్‌లో పిటిషన్ పెట్టండి

**జి. బ్రహ్మానంద రెడ్డి, కొల్హాపూర్ (మహబూబ్ నగర్ జిల్లా)**

ప్రశ్న మేము "అనియత విద్య" అనే రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు కలిసి నడుపుతున్న స్కీమ్‌లో నిరక్షరాస్యులను, అక్షరాస్యులుగా తీర్చి దిద్దే బోధకులుగా పని చేస్తున్నాము 1980 నుండి ఇప్పటి వరకు నెలకు రూ. 105లు గౌరవ వేతనం ఇస్తున్నారు. ఇప్పటి వరకు పెంచలేదు. ఈ మధ్య నెలకు 333 రూపాయల మీద పర్యవేక్షకులను నియమించారు. మాకు జీతాలు చాలవు. మేము ప్రభుత్వంతో ఎలా పోరాడాలి?

ప్రశ్న: మీరు రాష్ట్ర,జిల్లా సంఘాలుగా ఏర్పడి మీ జీతాలు పెంచమని ప్రభుత్వాన్ని అడగండి మీ ఎమ్. ఎల్. ఏ లు, రాబోయే ఎం. ఎల్ సి ల ద్వారా ప్రభుత్వానికి విజ్ఞాపన పత్రాలు పంపండి అప్పటికీ ప్రభుత్వం మీ జీతాలు పెంచడానికి నిరాకరించినట్లయితే, మీరు ఎడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యూనల్‌లో పిటీషన్ పెట్టండి

**శ్రీకొండ నవీన్, గూడూరు**

ప్రశ్న ప్రజాస్వామ్య దేశంలో "వాగ్దానాలు" చేయటం నెరవేర్చక పోవడం వివక్ష వంటిది, ఇటువంటివి న్యాయస్థానాలలో కూడా ప్రబలు చున్నవి మీ అభిప్రాయం?

జవాబు న్యాయస్థానాలు వాగ్దానాలు చెయ్యవు

**సి. హెచ్. రామారావు, గుంటూరు-6.**

ప్రశ్న : ఏడు నెలల వారం రోజులకు మగ పిల్లవాడు జన్మించెను. మాకు అనుమానంగా ఉంది. కోర్టులో డైవోర్స్ పొందుటకు ఏమి చెయ్యాలి?

జవాబు : మీరు ఈ విషయంలో అనుమానాలు పెంచుకొనే బదులు వైద్యనిపుణుల సలహా పొందటం అవసరం. ఎవరో చెప్పిన మాటలు వినకండి. మీ కుమారుడు అక్రమ సంతానమని మీరు అభియోగము వేసినా మీ కుమారునకు మీరు క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లోని 125 సెక్షన్ క్రింద జీవన భృతి చెల్లించకతప్పదు. ఇక మీరు కోర్టుకు వెళ్లడానికే నిర్ణయించుకుంటే "హిందూ వివాహ చట్టము (1956)లోని" 13 సెక్షన్ క్రింద డైవోర్స్ పిటీషన్ పెట్టుకొనవచ్చును.

**నీరుమళ్ల భాస్కర లింగమూర్తి, న్యూ సంతోష నగర్, హైదరాబాద్-59.**

ప్రశ్న మాది రిజిష్టర్డ్ భాగస్వామ్యము గల ప్లాస్టిక్ పరిశ్రమ మేము ఒక కంపెనీకి ఆరువేలు విలువజేయు ప్లాస్టిక్ బాటిల్‌లను సప్లయి చేశాము. డబ్బు ఇవ్వలేదు. తదుపరి నిలదీసి అడుగగా రెండు పోస్టు డేటెడ్ చెక్కులు ఇచ్చినాడు. అవి బ్యాంకులో ఆ తారీకులలో ప్రజెంట్ చెయ్యగా అతని ఖాతాలో డబ్బులేదని వాపసు ఇచ్చివేశారు మేము లాయర్ నోటీస్ పంపగా లాయర్ ద్వారా జవాబు పంపించాడు ఇక ప్రయోజనం లేదని మేము కోర్టు ద్వారా వారెంట్ ఇప్పించాము కాని అతను మాత్రం కోర్టులో హాజరు అవ్వలేదు మీ సలహా తెలుప వలెను

జవాబు మీ కేసు కోర్టులో ఉన్నది గనుక సమాధానము చెప్పకూడదు. సబ్ జుడీస్ అవుతుంది కదా!

**జి. ఎస్. రాయుడు, షక్కర్ నగర్ (నిజామాబాద్ జిల్లా)**

ప్రశ్న మా హైస్కూలు 1958 నుండి పని చేస్తుంది. నిజాం షుగర్ ఫ్యాక్టరీ వారి మేనేజ్‌మెంట్‌లో నడుస్తున్న ప్రయివేట్

---

ఆంధ్రసచిత్ర వారపత్రిక

న్యాయ చట్టం-ప్రశ్నలు జవాబులు

ప్రశ్న: ..........................................................

పేరు: ..........................................................

పూర్తి చిరునామా: ..............................................

..........................................................................

స్కూలు అయితే 1978 నుండి ఎయిడెడ్ పాఠశాలగా ప్రభుత్వం నుండి గ్రాంట్‌ను పొందుతున్నది గ్రాంట్ ఇన్ ఎయిడ్‌కు మా స్కూలును ఎడ్మిట్ చేసుకున్నప్పుడు మా ఉపాధ్యాయు లందరికీ పే ప్రొటెక్షన్ ఇచ్చారు పెన్షన్ మరియు 10, 15, 22 సం ల ప్రమోషన్ గ్రేడులను ఇవ్వడానికి 1978 సం నకు ముందుగల అన్–ఎయిడెడ్ సర్వీసును లెక్కలోనికి తీసుకోమని ప్రభుత్వం అంటున్నది 1990 డిసెంబర్ మొదలుకొని రిటైర్ అయ్యే టీచర్లకు 1978 నుండి మాత్రమే లెక్కగడితే 12 సం లు మొదలుకొని సర్వీసు కలుస్తుంది మామూలుగా ఇచ్చే యాభైశాతం పెన్షన్‌కూడా సర్వీస్ ప్రకారం తక్కువగా వస్తుంది గవర్నమెంట్, జిల్లా పరిషత్ వాళ్ళకు వలె మాకు మొత్తం సర్వీసును లెక్కలోనికి తీసుకోడానికి కోర్టుకు వెళ్ళమంటారా?

జవాబు మీకు పే ప్రొటెక్షన్ ఇచ్చారు గనుక 1978 ముందు గల అన్–ఎయిడెడ్ సర్వీస్‌ను కూడా కలుపుకోవడం న్యాయం సాధారణంగా ఎయిడెడ్ సర్వీసు మాత్రం పెన్షన్ పొందుటకు లెక్కలోనికి తీసుకుంటారు ప్రభుత్వం స్థానిక సంస్థల ఉద్యోగులకు పెన్షన్ సౌకర్యం కల్పించారు. గనుక జిల్లా పరిషత్ ఉద్యోగులకు పెన్షన్ ఇస్తున్నారు ఇప్పుడు వారి సర్వీసు ప్రొవిన్షియలైజ్ చేశారు మీకు పే ప్రొటెక్షన్ ఇచ్చారు గనుక మీకు కూడా అన్- ఎయిడెడ్ సర్వీసు కలుపుకొని పెన్షన్ మరియు 10, 15, 22 ప్రమోషన్ గ్రేడులను మంజూరు చెయ్యమని ప్రభుత్వానికి పిటిషన్ పెట్టండి ప్రభుత్వం నిరాకరించి నట్లయితే ఎడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యూనల్‌లో పిటిషన్‌పెట్టండి

**ఎస్. లక్ష్మణ్, మానికొండ.**

ప్రశ్న మా అమ్మమ్మకు ఇద్దరు కుమార్తెలు ఒకరు మా అమ్మ మరి యొకరు మా పిన్ని. అమ్మమ్మకు కొంత వ్యవసాయ భూమి, ఇల్లు ఉన్నాయి ఈ మధ్యనే అమ్మివేసినట్లు తెలిసింది మా అమ్మగాని, పిన్నిగాని సంతకాలు పెట్టలేదు. ఆ భూమి కొన్నది కూడా మా పిన్నిగారి అమ్మాయి. మోసము చేసి రిజిస్ట్రేషన్ చెయ్యించింది అమ్మమ్మ వయస్సు 75 సంవత్సరాలు. కోర్టు ద్వారా పరిష్కార మార్గం ఉన్నదా?

జవాబు: మీ అమ్మమ్మ అమ్మిన పత్రాలు చెల్లవని కోర్టులో దావా వెయ్యండి.

**సూర్నేటి సుధాకర్‌రావు, ఖమ్మం.**

ప్రశ్న మాకు ఒక డాబా ఇల్లు ఉన్నది అది ఉప్పు సీతారామమ్మ అని మా తల్లి పేరు మీద ఉన్నది. మా ఇంటిపేరు సూర్నేటి అని ఉన్నది మా తాతగారు ఉప్పు వ్యాపారం చేయుట చేత మా తండ్రి స్కూలు సర్టిఫికేట్‌లో ఉప్పు అని పడినది ఇప్పుడు మున్సిపాలిటీలో ఇంటి పేరు మార్చుటకు సలహా ఇవ్వ వలెను

జవాబు డాబా ఇల్లు మీకు సంక్రమించునట్లు మీ తల్లి వీలునామా వ్రాసి రిజిస్ట్రేషన్ చెయ్యించాలి. ఆ తర్వాత ఇల్లు మీ పేరు మీద మార్చమని మున్సిపాలిటీ వారికి మీరు తెలియపర్చండి

**టి. కృష్ణకుమారి, నాగవరపాడు.**

ప్రశ్న మీరు నా ప్రశ్నకు 30–3–90 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో జవాబు వ్రాసి యున్నారు ట్రాక్టర్ నాకు, నా పిల్లలకు చెందునట్లుగా ట్రాన్సఫర్ చెయ్యించుటకు వేలు ఖర్చు అవుతుందని లాయర్లు అంటున్నారు నా జీవన భృతి గడవడమే కష్టంగా ఉన్నది ఆస్తి వివరములు తెలుపు పత్రములు నా వద్ద ఏమియు లేవు మీ సలహా కోరుచున్నాను

జవాబు మీ భర్త ట్రాక్టర్ మీద బ్యాంక్ నుంచి లోను తెచ్చుకున్నారు గనుక ట్రాక్టర్ మీ భర్త వారసులైన మీకు, మీ పిల్లలకు చెందుతుంది. మీకు లీగల్ హెయిర్ సర్టిఫికేట్ ఇవ్వవలెనని మీ మండల రెవెన్యూ అధికారికి పిటీషన్ పెట్టండి వారు లీగల్ హెయిర్ సర్టిఫికేట్ ఇస్తారు ఆ సర్టిఫికేట్ కాపీ జతచేసి మీ పేరున ట్రాక్టర్ ట్రాన్సఫర్ చెయ్యవలెనని బ్యాంక్ వారికి, మరియు ఆర్ టి. ఓ కు రిజిష్టర్డ్ పోస్టులో పిటిషనులు పంపండి వారు తదుపరి చర్య తీసుకుంటారు

**పి. హెచ్. ప్రభు, ఒంగోలు.**

ప్రశ్న భర్త ఆస్తిమీద భార్యకు, పిల్లలకు హక్కు లేదా?

జవాబు భర్త ఆస్తి మీద భార్యకు, పిల్లలకు హక్కు ఉన్నది

ఒలింపిక్స్‌లో పతకం గెల్చిన

ప్రథమ భారతీయుడు

# నార్మన్ ప్రిచ్చర్డ్



ప్రపంచ క్రీడారంగంలో చరిత్ర సృష్టించిన ప్రథమ ఆసియావాసి, మన దేశస్థుడు నార్మన్ ప్రిచ్చర్డ్ అని మనలో చాలామందికి తెలియదు. ఆంగ్లేయుల పరిపాలనలో క్రీడలంటే ముఖ్యంగా విదేశీ ఆటలలో స్థానము లభించని రోజులలో 90ఏళ్ళక్రితం ఒలింపిక్ క్రీడలలో నార్మన్ ప్రిచ్చర్డ్ మన దేశం తరపున పాల్గొని రెండు రజిత పతకాలు గెల్చాడు. ఒలింపిక్ క్రీడలలో అథెలెటిక్స్‌లో తిరిగి గత తొమ్మిది 'దశాబ్దములలో కనీసం ఒక్క కాంస్య పతకం కూడా మన దేశానికి లభించలేదు. నార్మన్ ప్రిచ్చర్డ్ మన దేశం తరపునయే గాక ఆసియా దేశాల నుండి ఒలింపిక్ క్రీడలలో పాల్గొన్న ప్రథమ వ్యక్తి. 1900 ఒలింపిక్స్ వరకు ఆసియా దేశాలు ఒలింపిక్స్‌లో పాల్గొనలేదు.

1900లో పారిస్‌లో జరిగిన ద్వితీయ ఒలింపిక్ క్రీడోత్సవాలలో విజయం పొందిన మన దేశస్థుని గురించి మన జాతీయ క్రీడాధినేతల వద్ద కూడా అతనిగురించి సరి అయిన సమాచారము లేదు. కాని ఒలింపిక్ క్రీడల రికార్డులు, మన వివిధ జాతీయ క్రీడా సమాఖ్య చరిత్రపుటలు తిరగేస్తే తెలుస్తుంది.

1896లో అధునిక ఒలింపిక్ క్రీడలు ఏథెన్స్‌లో మొట్టమొదటిసారిగా జరిగినప్పుడు మన దేశస్థుడు ఆంగ్లో-ఇండియన్ నార్మన్ ప్రిచ్చర్డ్ ఫుట్‌బాల్, హాకీ, అథెలెటిక్స్‌లలో మంచి ఆటగానిగా ఖ్యాతి పొందాడు. రెండవ ఒలింపిక్స్‌లో మన దేశం తరఫున పాల్గొని విజయం పొందాలని పట్టుదలతో కృషి చేశాడు బ్రిటిష్ క్రీడా సమాఖ్య అధినేతలు నార్మన్ ప్రిచ్చర్డ్ ప్రతిభను గుర్తించి గ్రేట్ బ్రిటన్ జట్టులో వుండవలసినదిగా కోరారు. అందుకు అతను సమ్మతించక తన మాతృదేశం తరపున పాల్గొనుటకు నిశ్చయించాడు.

ద్వితీయ ఒలింపిక్ క్రీడలు పారిస్‌లో జరుగు సమయంలో నార్మన్ ఇంగ్లాండులో యుండుట సంభవించింది. పారిస్ ఒలింపిక్ నిర్వాహకులకు, గ్రేట్ బ్రిటన్ ఒలింపిక్ అధినేతలతో చర్చించి నార్మన్ మన దేశం తరపున పాల్గొన్నాడు. పారిస్ ఒలింపిక్ క్రీడల రికార్డుల వలన నార్మన్ నాలుగు అథెలెటిక్ పోటీలలో పాల్గొన్నట్లు ఆధారాలు యున్నవి నార్మన్ నాలుగు పోటీల ఫైనల్సులో చేరి సంచలనం సృష్టించాడు

60 మీటర్ల పరుగు. ప్రథమ స్థానం యు.ఎస్ వాసి ఆల్విన్ క్రీఎంజిలిప్ 7 సెకండ్లలో పరుగెత్తి బంగారుపతకం గెల్చాడు నార్మన్ అయిదవ స్థానం పొందాడు. రెండవ స్థానం నుండి అయిదవ స్థానం పొందిన నల్గురు 7.2 సెకండ్లలో పరుగెత్తారు. కాని నార్మన్ అయిదవ స్థానంలో తృప్తి పొందవలసి వచ్చినది

110మీ హర్డిల్సు. ఇందులో కూడా నార్మన్‌కు అయిదవ స్థానం దక్కింది. అయిదవ స్థానం టైమింగు వివరాలు లభించలేదు.

200మీ. పరుగు. నార్మన్ 22.8 సెకండ్లలో పరుగెత్తి రజిత పతకం గెల్చాడు. ఒలింపిక్స్‌లో పతకం సాధించిన ప్రప్రథమ ఆసియావాసి అయ్యాడు

200మీ హర్డిల్సు. ఈ పోటీలో కూడా నార్మన్ రజిత పతకం గెల్చాడు. ఫైనల్సులో మేటి అథెలెట్ యు ఎస్.కు చెందిన వాల్టర్ టెక్స్‌బరీపై గెల్చి సంచలనం సృష్టించాడు

నార్మన్ ప్రిచ్చర్డ్ ఒలింపిక్ క్రీడలలో విజయం పొంది స్వదేశం వచ్చినప్పుడు బ్రహ్మాండమైన స్వాగతం లభించింది.

ఒలింపిక్స్ క్రీడలకు ముందు కలకత్తాలో నార్మన్ ప్రిచ్చర్డ్ ఫుట్‌బాల్ పోటీలలో పాల్గొనేవాడు. కలకత్తాకు చెందిన వ్యాపారస్థులు ఫుట్‌బాల్ ఆట అభివృద్ధికి మన దేశస్థులను ప్రోత్సహించు నిమిత్తం 1889లో కలకత్తా డల్‌హౌసీ క్లబ్‌నకు రజిత కప్ బహూకరించారు. ట్రేడర్స్ కప్ ఫుట్‌బాల్ టోర్నమెంటు మన దేశస్థులను అనుమతించిన మొట్టమొదటి అగ్రగామి టోర్నమెంటు. 13 జట్లు యీ పోటీలో పాల్గొన్నాయి సోవా బజార్, సెయింట్ జావియర్ జట్లమధ్య జరిగిన పోటీలో మొదటి 'హాఫ్'లో స్కోరు 0-0. రెండవ భాగంలో సెయింట్ జావియర్ వరుసగా మూడు గోలులు చేసింది. ఆ గోలులు చేసింది నార్మన్ ప్రిచ్చర్డ్. నార్మన్ హాకీ, టెన్నీసు, గుర్రపు పోటీలలో కూడా ప్రావీణ్యత పొందాడు. 1900లో "ఇండియన్ ఫుట్‌బాల్ అసోసియేషన్" గౌరవ కార్యదర్శి పదవి నిర్వహించాడు.

1902లో నార్మన్ ప్రిచ్చర్డ్ హాలీవుడ్‌లో చలనచిత్రాలలో నటించే అవకాశం వచ్చుటతో అక్కడికి వెళ్ళాడు.

మన దేశంలో క్రీడలకు ఎటువంటి ప్రోత్సాహం, గుర్తింపు లేక, బానిసత్వంలో, ఉన్న కాలంలో, 90 ఏళ్ళక్రితం మన దేశస్థుడు సాధించిన విజయాలు, అతని పట్టుదల, కృషి నేటి తరంలో కనిపించుటలేదు.

-ముకరమ్

# సూక్ష్మంలో సాక్ష్యం

జి.వి.జి.

అతను సునాయాసంగా ఆ పెరటి గోడను దూకి, ఆ ఇంట్లోకి ప్రవేశించగల్గాడు. చుట్టూ చీకటి. అతని కళ్ళు ఆ చీకటికి అలవాటు పడేవరకు అతను ఆగాడు. తర్వాత మెల్లగా ఒక్కొక్క అడుగు ముందుకు వేయసాగాడు. ఎదురుగా ఒక తలుపు కనిపించింది. దానికి అటు వైపున గొళ్ళెం పెట్టినట్టు లేదు. అంచేత, మెల్లగా తీయడానికి వీలయింది. అది కిర్రుమని కాస్తంత శబ్దమైనా చేయలేదు. బయలుదేరిన వేళావిశేషం- అనుకుంటూ, అతను హాల్లో ఒ మూల ఉన్న మెట్ల వరకు వెళ్ళాడు. ఆగాడు. ఆ తర్వాత చీకట్లో ఎటు వెళ్ళాలో తోచలేదు.

తను దొంగతనం చేయడానికి ఇలా ఇంట్లోకి జొరబడడం ఇదే తొలిసారి...

ఆకలి. దాన్ని నివారించడానికి తగిన ఉద్యోగం ఎక్కడా దొరకలేదు. అంచేత, అవసరానికి ఇదొక్క మార్గమే తోచిందతనికి. అంతకు మించి అతని బుర్ర పని చేయలేదు.

అతనిప్పుడు ప్రవేశించిన మోతీలాల్ ఇంట్లో ఏ మూల చూసినా డబ్బు మూల్గుతూ పడి ఉంటుందని నిన్న రాత్రే ఓ పాడుపడ్డ సత్రం దగ్గర ఎవరో ఇద్దరు శాల్తీలు చీకట్లో రహస్యంగా గుసగుసలాడుతుంటే చాటుగా తను విన్నాడు. వాళ్ళు ఆ ఇంట్లోకి ఆ మర్నాడు



జొరబడాలని అనుకున్నారు. అంచేత వాళ్ళ కంటే ముందే తను ప్రయత్నించాలనుకున్నాడు.

ఐతే, ఆ ఇంట్లో ఏ నిశాచరుడో ప్రవేశిస్తే, ఆ ఇంటి యజమానిని హెచ్చరించే బర్గ్లర్ అలారం వుందన్న విషయం అతనికి తెలీదు

ఉన్నట్టుండి ఎవరో సమీపిస్తున్న అడుగుల చప్పుడయింది. జేబులోని పిస్టల్‌ని తీసి చేతిలో సిద్ధంగా ఉంచుకోవాల్సిన సమయం ఆసన్నమైంది. కాని, తానింతవరకు ఆ పిస్టల్‌ని ఎవరి మీదా ప్రయోగించి ఎరుగడు. తనను ఎదిరించడానికి వచ్చిన వారిని ఆ పిస్టల్‌తో కేవలం భయపెట్టడమే గాని, ప్రాణాపాయం కల్గించటం మాత్రం అతని అభిమతం కాదు.

ఇంతలోనే అతను అనుకోని విధంగా జరిగిపోయింది. అతని మెడ మీద దెబ్బపడడమేమిటి, చేతిలోని పిస్టల్ జారి కింద పడిపోవడమేమిటి- లిప్తపాటులో జరిగిపోయాయి.

వెంటనే వొంగి, పిస్టల్ కోసం చేత్తో వెతకసాగాడు అది అక్కడ ఉంటేగా అతనికి దొరకడానికి? అది అప్పుడే మరొకరి వశమైపోయింది. ఇక తను కూడా ఆ వ్యక్తికి వశమైపోక తప్పదు.

"ఊఁ.... చేతులెత్తు!" ఒక గంభీర కంఠం పల్కింది.

విధి లేక చేతులెత్తాడు.

## సూక్ష్మంలో సాక్ష్యం

"వెనక్కు తిరుగు! పిచ్చి పిచ్చి వేషాలు వేయక ఎదురుగా ఉన్న గదిలోకి వెళ్ళు!"

మంత్రముగ్ధుడిలా ఆ గదిలోకి వెళ్ళక తప్పలేదు

లైటు వెలిగింది

ఎదురుగా ఒక స్థూలకాయుడు నిలుచొని వున్నాడు "నా పేరు మోతీలాల్", అన్నాడతను చిర్నగవుతో అతని చేతిలో తను తెచ్చుకున్న పిస్టల్ ఉంది'

"చూడబోతే కాస్తో కూస్తో చదువుకున్న వాడిలా ఉన్నావ్. నీకెందుకీ పాడు బుద్ధి పుట్టింది? అలా గుడ్లు తేలవేస్తావేం? ఇలా దొంగతనం చేయడానికి ఇంట్లో దూరడం ఇదే మొదలా? ఏమిటి నీ పేరు?" గర్జించాడు మోతీలాల్

"దాసు"

"ఇంట్లో భార్యాబిడ్డలు తిండి లేక అలమటిస్తున్నారా?"

దాసు తల వొంచుకున్నాడు

"నేనిప్పుడు పోలీసులకు ఫోన్ చేస్తాను. అది నా డ్యూటీ"

దాసు వెంటనే తల ఎత్తాడు, దీనంగా చూశాడు

మోతీలాల్ ఎడమ చేతితో మీసాలు దువ్వుకుంటూ, ఒక్క వికవు నవ్వు విరజిమ్మాడు. "భయపడకు. ఇప్పుడిప్పుడే పోలీసులకు ఫోన్ చేయనులే.... అలా వెనక్కు వెళ్ళు", అంటూ పిస్టల్ కొసను దాసు గుండెకు ఆనించి, అతన్ని వెనక్కు తోసుకెళ్ళాడు.

"ఆ బీర్వా తలుపులు తెరువు. అది ఖాళీగా ఉందిలే"

దాసు అలా చేశాడు.

"ఊఁ ఆ బీర్వా లోపలికి వెళ్ళి నిలుచో!"

దాసుకు దాదాపు గుండె ఆగినంత పనైంది.

"అలా చూస్తావేం? ఫో లోపలికి!" మోతీలాల్, దాసును మెడపట్టి ఒక్క తోపు తోశాడు బీర్వాలోకి దాసు తలకు ఏదో కొట్టుకుంది మరో క్షణంలోనే బీర్వా తలుపులు మూయబడ్డాయి. బయట తాళం వేసిన క్లిక్‌మన్న చప్పుడు వినిపించింది.

దాసు కళ్ళు మరింత చీకట్లు కమ్మాయి. చెవులు కూడా పూడుకుపోయినట్లయి పోయాయి. "తనెందుకు ఈ విధంగా బంధింపబడ్డాడు? ఎంతసేపు ఈ శిక్ష?" నిరాయుధంగా, నిస్సహాయంగా ఉన్న దాసుకు అన్నీ ప్రశ్నలేగాని, జవాబులు దొరకడంలేదు.

ఆ గదిలోనే కాస్త దూరంలో ఓ మూల టెలిఫోన్ ఉండడం దాసు ఇందాక చూశాడు. ఒక వేళ మోతీలాల్ పోలీసులకు ఫోన్ చేస్తాడేమోనని చెవులు రిక్కించాడు. టెలిఫోన్ డయల్ చేస్తున్న చప్పుడైతే వినిపించింది గాని, మోతీలాల్ ఫోన్‌లో ఎవరితో ఏం మాట్లాడుతున్నాడో తెలీడంలేదు

రెండు మూడు నిమిషాల తర్వాత మోతీలాల్ కంఠం కాస్త స్పష్టంగా వినిపించింది. ఇప్పుడు ఎదురుగా ఉన్న ఏ వ్యక్తితోనో మాట్లాడుతూన్నట్టుంది. "నువ్వింత రాత్రి వేళ వస్తున్నావని ఫోన్ చేసినప్పుడే ఊహించాను ఎందుకో.... కాని, హీరాలాల్! నువ్విక్కడికి వచ్చినందువల్ల ఏ మాత్రం ప్రయోజనం లేదు. అత్యాశ వదులుకో. నీతో ఆఖరిసారిగా చెప్తున్నాను. ఒకటే మాట- అంతే.... నే చెప్పిన మొత్తం మీద ఒక్క పైసా

నువ్ ఆఫీసుకొస్తే అరగంట పర్మిషన్ పెట్టొచ్చి నీతో మాట్లాడాలి! ఇలానే ఫోన్ చేసి ఎంచక్కా రెండు గంటలు మాట్లాడుకున్నా ఫర్వాలేదు. !

అయినా చచ్చినా ఇవ్వను!"

"తొందరపడకు! బాగా ఆలోచించు. నేనడిగినంత డబ్బిచ్చి, నా వద్ద ఉన్న నీ ఉత్తరాలను కొనుక్కోకపోతే, నీ గతి ఏమవుతుందో ఆలోచించు!" కాస్త వీలగా ఉంది హీరాలాల్ గొంతు.

"నువ్వెందుకిలా అయిపోయావ్ హీరాలాల్?ఆశకు అంతుండాలి. ఎనభై వేలంటే మాటలా? పదివేలకు పైగా ఒక్క పైసా ఇవ్వలేను. ఇవ్వను.. ఒక్క నిమిషం వ్యవధి ఇస్తున్నాను ఇటో అటో తేల్చేయాలి".

"ఓహో!.. తేల్చకపోతే?"

"ఇంతే సంగతులు".

"బెదిరిస్తున్నావా?"

కొన్నేపు నిశ్శబ్దం.... ఆ తర్వాత ఇద్దరూ కలియబడ్డ చప్పుడు. హఠాత్తుగా 'ఢామ్' అని పిస్టల్ పేలిన ధ్వని. 'అబ్బా'' అన్న మూల్గుడు. అది హీరాలాల్‌ది అయి ఉండాలని దాసు ఊహించేలోగానే నేల మీద ఏదో దబ్బున పడ్డ శబ్దం

బీర్వాలో ఉన్న దాసుకు ముచ్చెమటలు పోసేస్తున్నాయి ఉక్కిరిబిక్కిరి అయిపోతున్నాడు ఏమిటి? బయట ఏం జరిగింది?

రెండు నిమిషాల తర్వాత బీర్వా తలుపులు తెరచుకున్నాయి ఎదురుగా మోతీలాల్ భీకరంగా నిలుచొని వున్నాడు. పిస్టల్‌ను జేబు రుమాలుతో జాగ్రత్తగా పట్టుకొని ఉన్నాడు.

ఆ పిస్టల్ తనదే కదా అని దాసు ఆలోచిస్తుండేలోగానే ఆ పిస్టల్ దాసు చేతిలో పడింది అయోమయంగా దాసు ఆ బీర్వాలోంచి ఒక్క అడుగు బయటకు వేశాడు. ఆ గది గుమ్మం ముందు నేల మీద వెల్లకిలా పడున్నాడు ఒక పొడుగాటి వ్యక్తి అతని గుండె వద్ద తూటా తగిలిన గాయం- రక్తం ఇంకా స్రవిస్తోంది

"ఊఁ నువ్విక ఆ పిస్టల్‌తో పారిపోవచ్చు!"

తడబడే అడుగులతో దాసు పెరటి వైపుకు పోబోయాడు.

"అలా కాదు, ఇటు ఇటు వీధి తలుపు తీసుకుని వెళ్లిపో!"



హైదరాబాద్ నిజాం ముకర్రం జా ఇటీవల వివాహం చేసుకున్న అందమైన టర్కీ యువతి మనోల్యా ఓనుర్ ఈమె నిజాంకు మూడవ భార్య అని, ఆయన త్వరలో కాంగ్రెస్‌లో చేరబోతున్నారని పత్రికల్లో వార్తలు వస్తున్నాయి

దాసు అలాగే వీధి తలుపుకేసి పరుగుతీశాడు గొళ్లెం తీసి బయటపడ్డ తర్వాత కూడా అతని గుండె ఇంకా వేగంగా కొట్టుకుంటూనే ఉంది కాంపౌండ్ గేట్ దాటబోయేసరికి ఒక పోలీస్ జీప్ రివ్వున వచ్చి ఒక్క కుదుపుతో అతని పక్కన ఆగింది అందులోంచి నలుగురైదుగురు కానిస్టేబుల్స్ బిలబిలమని బయటకు దూకారు వాళ్ల తర్వాత ఒక సబ్ ఇన్‌స్పెక్టర్ దిగాడు

దాసు వాళ్ల వైపే చూస్తుండిపోయాడు అతని కాళ్లు అలాగే నేలకు అంటుకు పోయాయి

"అతనే పట్టుకోండి!" వెనుక నుంచి మోతీలాల్ కంఠం వినిపించింది

దాసు చెవుల్లో పిడుగులు పడ్డట్టయింది

మోతీలాల్ ఇంకా ఏదో చెప్తున్నాడు "నేనూ, నా మిత్రుడు హీరాలాల్ నా గదిలో కూర్చుని ఏవో పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నామండి ఇంతలో ఇతగాడెవడో పెరటి వైపుగుండా ఎలా దూరాడో గాని, పిస్టల్‌తో నా గది గుమ్మం వద్దకు వచ్చి నిలుచొని, ఇనప్పెట్టె తాళం చెవులు ఎక్కడని బెదిరించాడు. పిస్టల్‌ను నా గుండెకు గురిపెట్టాడు. ఇంతలో హీరాలాల్ ఉన్నట్టుండి ఒక్క గెంతున ఇతని మీదికి ఉరికాడు. ఇద్దరూ కలియబడ్డారు తనను రక్షించుకోవడం కోసం ఇతను తటాలున పిస్టల్ పేల్చాడు హీరాలాల్ నేల కూలాడు. దాంతో ఇతను పరుగు లంకించుకున్నాడు"

దాసుని చెరొక పక్కా ఇద్దరు కానిస్టేబుల్స్ రెక్కలు విరిచి పట్టుకున్నారు అతని చేతిలోని పిస్టల్ అదివరకేలాక్కోబడింది.

ఈలోగా సబ్ ఇన్‌స్పెక్టర్ హత్యా ప్రదేశానికి చేరుకున్నాడు. శవాన్ని చూశాక, హాల్లోకి వచ్చాడు అప్పటికి అందరూ హాల్లోకి వచ్చేశారు.

"ఏమంటావ్?" అన్నాడు సబ్ ఇన్‌స్పెక్టర్ దాసుతో.

"సార్! మోసం. ఇదంతా ఏదో కుట్రలాగుంది. ఆ వ్యక్తిని నేను హత్య చేయలేదు. నా మాట నమ్మండి. అతనికి అతనే ఆత్మహత్య చేసుకుని ఉండాలి. లేదా-అతన్ని మరెవరైనా చంపి ఉండాలి. నేను మాత్రం కాదు", అన్నాడు దాసు.

"ఈ పిస్టల్ ఎవరిది?"

"నాది... నాదేనండి".

"లైసెన్స్ ఉందా?"

"సార్! మీతో నిజం సంగతి చెప్పేస్తాను. ఈ పిస్టల్ నాది కాదు. నిన్న రాత్రి నేను బస చేసి ఉన్న సత్రంలో ఎవరో ఒక పరదేశి దగ్గరుంటే, చల్లగా కాజేశాను".

"మొత్తం మీద నువ్విక్కడికి తెచ్చిన పిస్టలే ఇది. అవునా? మరి, నీ దగ్గరున్న ఈ పిస్టల్‌ని నువ్వు కాక ఇంకెవరైనా ఉపయోగించడం ఎలా సాధ్యం?"

"సార్! నేను నిజం చెప్తున్నాను. నా మాట నమ్మండి అసలు నేనేమీ ఎరుగను బుద్ధి గడ్డి తిని ఈ ఇంట్లో చోరీ చేయడానికి జొరబడిన మాట నిజమే. ఈ పిస్టల్‌ని ఎవరి మీదా ప్రయోగించడం నా ఉద్దేశ్యం కాదు నన్నెవరైనా పట్టుకోబోతే వారిని ఈ పిస్టల్‌తో బెదిరించి పారిపోవడానికే దీన్ని తెచ్చుకున్నా. కాని, ఈ ఇంట్లోకి నేను ప్రవేశించగానే, చీకట్లో నేను ఏమరుపాటున ఉండడం చూసి ఈయనే హఠాత్తుగా నా చేతిలోంచి పిస్టల్‌ని లాక్కున్నారు తర్వాత నన్ను ఆ హత్య జరిగిన గదిలో ఉన్న ఒక ఖాళీ బీరువాలో బంధించారు", అన్నాడు దాసు.

"హోరీ పిడుగా!" అంటూ హీరాలాల్ మెల్లగా సబ్ ఇన్‌స్పెక్టర్ వైపు తిరిగాడు. "ఎంత దారుణం! ఆలోచించకుండానే పుటుక్కున ఎంచక్కా అబద్ధం చెప్పేశాడు! సార్! ఆ బీర్వా ఖాళీగా ఉన్న మాట వాస్తవమే. వాటి తలుపులు తెరచి ఉన్నాయి. లోపల అరలు ఖాళీ. లోపల ఓ మనిషి ఉండటానికి వీలయ్యే మాట కూడా నిజమే! కాని, ఇతనసలు ఆ బీర్వా వైపునే రాలేదు. గది గుమ్మం వద్దే నిలుచొని పిస్టల్ పేల్చాడు"

"సబ్ ఇన్‌స్పెక్టర్ కళ్ళు దాసు వైపు

## సూక్ష్మంలో సాక్ష్యం

తిరిగాయి.

"సార్! ఇక నన్ను రక్షించగల్గింది ఆ భగవంతుడొక్కడే. నేను ఆ బీరువాలో బంధింపబడ్డ విషయం ముమ్మాటికీ నిజమే. ఆ తర్వాతే హత్య జరిగింది. హతుడూ, ఈ మోతీలాల్ ఏదో డబ్బు విషయమై పేచీ పడ్డారు. హతుడు ఏదో విషయమై మోతీలాల్‌ని బ్లాక్ మెయిల్ చేసినట్టుంది. మాటా మాటా పెరిగి, తర్వాత నా పిస్టల్‌తోనే అతన్నీయన హత్య చేశాడు. ఆటుపైన బీర్వా తలుపులు తెరిచి, నా పిస్టల్‌ని నా చేతికి అందించి, నన్ను పారిపొమ్మన్నారు. ఆ హత్యా నేరాన్ని నా తలమీద మోపడానికి ప్రయత్నిస్తున్నారు" అన్నాడు దాసు.



"అంతా అబద్ధం. హీరాలాల్, నేనూ బాల్య మిత్రులం. ఇప్పటికీ ఆప్త మిత్రులమే. మమ్మల్నిద్దర్నీ విడదీసే శక్తి ఈ ప్రపంచంలోనే లేదు" అన్నాడు మోతీలాల్.

"నీ పేరు?" సబ్ ఇన్‌స్పెక్టర్ అడిగితే, "దాసు... దేశి సీతా రామదాసు" అని సమాధానం వచ్చింది.

సబ్ ఇన్‌స్పెక్టర్ ఆలోచిస్తూ, వెనుతిరిగాడు. "సరే, మీరంతా ఇక్కడే ఉండండి. నేనోసారి ఆ గదిలోకి వెళ్ళొస్తా" అంటూ శవం ఉన్న గదిలోకి వెళ్ళాడు మరో రెండు నిమిషాలయ్యాక ఓ జేబు రుమాలుతో తిరిగొచ్చాడు. ఆ జేబు రుమాలును పైకెత్తి చూపుతూ, "ఈ డి.ఎస్.డి. అనే లాండ్రీ మార్కున్న జేబురుమాలు నీదేనా? ఈ పొడి అక్షరాలు నీదేకదూ?" అని అడిగాడు దాసును.

దాసు విస్తుపోతూ. "సార్! ఆ పొడి అక్షరాలు నావేగాని..." అంటూ ఏదో చెప్పబోయాడు.

"ఆగు" అంటూ సబ్ ఇన్‌స్పెక్టర్ పక్కకు తిరిగాడు. ఇప్పుడేమంటారండీ! మోతీలాల్‌గారూ! ఈ దాసు అసలు ఆ బీర్వా దగ్గరికే వెళ్ళలేదన్నారు. అతను ఆ బీర్వా లోపలకే వెళ్ళకపోతే, ఈ రుమాలు ఆ బీర్వాలో ఎలా పడుంది?"

మోతీలాల్ ఏదో జవాబు చెప్పడానికి నోరు తెరిచాడే గానీ, తర్వాత ఇక లాభం లేదనుకున్నాడో ఏమో - పిచ్చివాడిలా చూస్తూ తల వాల్చేశాడు.

మరో నిమిషంలో అతని చేతులకు బేడీలు పడ్డాయి.

సబ్ ఇన్‌స్పెక్టర్ జీప్‌లో కూర్చోగానే, అతని కుడిచేతి వేలిమీద సన్నటి గీతలా ఉన్న గాయాన్ని చూసి, "ఏమిటిసార్ అది?" అని అడిగాడు కారు నడుపుతున్న కానిస్టేబుల్

ఆ వేలు చుట్టూ రుమాలు కడుతూ, "ఆ బీర్వా పక్కన ఓ చిన్న మేకు ఉంది దానిమూలంగా ఈ గాయమైంది ఇద్దరిలో ఎవరు నిజం చెబుతున్నారో తెల్సుకోవాలికదా? ముందు మోతీలాల్ నోటినుంచి నిజం కక్కించడానికి ఉద్దేశ్యపూర్వకంగానే ఈ వేలికి గాయం చేసుకోవాల్సొచ్చింది. ఆ జేబు రుమాలు మీదున్న 'డి. ఎస్. డి.'అనే పొడి అక్షరాలు లాండ్రీ మార్కు కాదు. పెన్సిల్‌ను ఈ గాయానికి తాకించి, రక్తంతో ఆ జేబురుమాలు ఓ మూలన నేనే ఆ అక్షరాలు రాశాను దాంతో మోతీలాల్ గుట్టు తేలేశాడు. నిజానికి ఆ బీర్వాలో ఏ జేబు రుమాలూ దొరకలేదు. అసలింతకీ ఆ దాసు దగ్గర ఏ జేబురుమాలూ ఉన్నట్టు లేదు ఆ జేబు రుమాలు నాది" అన్నాడు సబ్ ఇన్‌స్పెక్టర్

"మరి, దాసును కూడా కస్టడీలోకి తీసుకోమన్నారేం?" అడిగాడు కానిస్టేబుల్

"దొంగతనం చేయడానికి ఆ ఇంట్లో జొరబడినందుకు అతని మీద కూడా కేసు పెట్టాలి కదా?" అన్నాడు సబ్ ఇన్‌స్పెక్టర్ ●



# మొదట ఏక్షన్ తర్వాత పైసా!

**-అనుపమ్‌ఖేర్**

హిందీ చలన చిత్రరంగంలో బాగా పేరు సంపాదించిన నటులు మరుగున పడిపోయిన తరుణంలో ఒక స్టేజీ నటుడు చిత్రరంగంలోకి అడుగు పెట్టాడు. ఆ నటుడు ఎవరో కాదు... విలన్‌గా ప్రేక్షకుల మనసుల్లో చెరగని ముద్ర వేసుకొని క్యారెక్టర్ యాక్టర్‌గా స్థానం సంపాదించిన అనుపమ్‌ఖేర్.

యాక్షన్ చిత్రాలే వెండి తెరను అధిగమిస్తూ కేవలం రొమాన్సే చిత్రానికి ప్రధానం కావటంతో ప్రతిభకు గ్రహణం పట్టింది. అటువంటి సమయంలో అనుపమ్‌ఖేర్ హిందీ చిత్రరంగంలోకి ప్రవేశించాడు. సారాంశ్ చిత్రం ద్వారా చిత్రరంగంలోకి ప్రవేశించిన అనుపమ్‌కు 'కర్మ' చిత్రం ద్వారా మంచి గుర్తింపు లభించింది. చిత్రరంగంలో నటన అనేది నిర్జీవమైపోయిన సమయంలో మంచి నటన అంటే యేమిటో రుజావు చేసిన అనుపమ్‌ను పరిశ్రమ నటుడిగా గుర్తించి అనేకావకాశాలను అందజేసింది. నాకు డబ్బు ప్రధానం కాదు... మంచి నటనను అందించేందుకు వీలైన మంచి పాత్రలే ప్రధానం అంటున్న అనుపమ్ తాను బొంబాయి రావటం యాదృచ్ఛికం కాదని తన ప్రయాణం సిమ్లాలో ప్రారంభమైందని చెప్తున్నారు. బల్వంత్ గార్గి నేతృత్వంలో పాటియాలాలో అతను నటనలో శిక్షణ పొందాడు. నాటక రంగంలో అనుపమ్‌కు వున్న అనుభవం సినిమారంగానికి ఎంతో పనికి వచ్చింది. అటు కమర్షియల్ సినిమాలకు... యిటు కుటుంబ కథా చిత్రాలకు మధ్య సమానత్వాన్ని సాధించటంలో అనుపమ్ విజయవంతమయ్యాడనే చెప్పాలి.

ప్రేక్షకాదరణ పొందిన ఏ నటుడైనా తన కళను ప్రేక్షకుల అభిరుచులకు అనుగుణంగా మలచుకోగలడు. అదేవిధంగా అనుపమ్ క్యారెక్టర్ రోల్స్‌ను సమర్థవంతంగా పోషించి తన చిత్రాలను బాక్సాఫీస్ హిట్ చేసేందుకు తన వంతు కృషిని చేయటమే కాదు తన సహనటులు అమోల్‌పాలేకర్, నసీరుద్దీన్‌షాల మాదిరి మూస నటనకు ప్రాధాన్యం యివ్వకుండా వైవిధ్యం గల పాత్రలలో నటించి మెప్పించేందుకు అలవాటు పడ్డాడు.

'సారాంశ్', 'జనం' చిత్రాలు తాను నటించిన గొప్ప చిత్రాలుగా అనుపమ్ అభివర్ణిస్తున్నాడు. కమర్షియల్ చిత్రాల నిర్మాతలు తనను ఆఫర్ చేస్తున్నా డబ్బుకు దాసోహం కాకుండా మంచి పాత్రలయితేనే ఒప్పుకుంటున్న అనుపమ్ నటుడిగా తాను పొందిన అనుభవాలను, భవిష్యత్ కార్యక్రమాలను పాఠకులకు తెలియజేశారు.

★ వాణిజ్యపరమైన చిత్ర విజయాల కోసం మీ నటనను త్యాగం చేస్తున్నారా?

● అది కొంతవరకు నిజం. కొంతవరకు అబద్ధం.

★ మీ నటన ద్వారా కొత్త ప్రయోగాలు చేయాలనుకుంటున్నారా?

● అవును నా ఆశ, ఆశయం కూడా అదే.

★ ఎటువంటి పాత్రలంటే యిష్టపడతారు?

● చాలెంజింగ్‌గా వుండే పాత్రలను మాత్రమే ఒప్పుకుంటున్నాను.

★ చిత్రపరిశ్రమపై మీ అభిప్రాయం?

● ఇటీవలి చిత్రాలన్నీ రొమాన్సు మీదే ఆధారపడుతున్నాయి.

★ ఎందువలనంటారు?

● ప్రేక్షకాదరణ అలాంటిది. మనం చేయగలిగిందేముంది.

★ చిత్రాలు సమాజాన్ని మార్చగలవా?

● నేను అనుకోవటం లేదు.

★ చిత్రాల్లో స్టీరియో టైప్ నటనకు కారణం?

● నటన అనేది ఆ చిత్రదర్శకుడి మీద ఆధారపడి వుంటుంది. ఆయన ఏ విధంగా చెప్తే ఆవిధంగా నటించాలి.

★ ఏ పాత్రనైనా నటించగలరా?

● స్టేజీ నటుడిగా నాకున్న అనుభవంతో ఏ పాత్రనైనా పోషించగలననుకుంటున్నాను. అనుకోవటమే కాదు నటించి తీరతాను అవకాశాలు వస్తే.

★ 'కర్మ' చిత్రంపై మీ అభిప్రాయం?

● నాకు నచ్చిన సరైన పాత్ర లభించింది.

★ విలన్ పాత్రలపై మీ ఉద్దేశ్యం?

● ఆ పాత్రలంటే యిష్టమని కాదు. కాని



స్నేహితులను సంప్రదించిన మీదటనే అటువంటి పాత్రలు ఒప్పుకుంటాను.

★ డబ్బు ప్రధానమా? నటనా?

● నాకు డబ్బుకాదు ప్రధానం. మంచి నటనే.

★ కమర్షియల్ చిత్రాల్లో నటించటం మీకు సంతోషమా?

● ఏ చిత్రమైనా ఆ చిత్రంలో నా పాత్రకు ఎంత వరకు న్యాయం చేశానన్నదే నాకు ఆనందదాయకమైన విషయం.

★ భవిష్యత్తులో మీ లక్ష్యం?

● డబ్బు కంటే నటనకే ప్రాధాన్యం యిస్తూ మంచి పాత్రలు పోషించాలన్నదే నా లక్ష్యం.

డబ్బు మాత్రమే ప్రధానం కాకుండా మంచి పాత్రల కోసం ఆరాటపడే అనుపమ్‌ఖేర్ లక్ష్యం నెరవేర్చాలని ఆశిద్దాం.

—తిలక్

## పట్టుదలను మించిన తపస్సు లేదు

# డా. యశోదారెడ్డి కథ

## ఒక ఉదాహరణ

హైదరాబాదు మహానగరంలోని నారాయణగూడలో వింత డిజైనులతో విలసిల్లే ఓ గృహం-అధికార భాషా సంఘం అధ్యక్షురాలు డా. యశోదారెడ్డి గృహమది. మనిషిలో హుందాతనం, మనసులో నిండుదనం. చూపుల్లో నిరాడంబరం, చల్లని చిరునవ్వు, నుదుటిపై ఎఱ్ఱని కుంకుమబొట్టు, వెంకటగిరి నేతచీర, వెళ్లిగే జ్యోతుల్లా మెరిసే కళ్లు, మనసును దోచుకొనే ఆప్యాయత, అధికార గర్వం యెక్కడా కనిపించని నిరాడంబరత ఆమె ధరించిన అపురూప ఆభరణాలు.

రుద్రమదేవి జన్మస్థానమైన తెలుగు కాణాచి తెలంగాణాలోని మహబూబ్‌నగర్ జిల్లా, బిజినేపల్లి గ్రామములో 'మూల' నక్షత్రములో జన్మించిందా విదుషీమణి.

ఆమె ఎంతటి సాహితీ సంపద కలవారో, అంతటి నిశితమైన భావాలు కలవారు. సరదాగా "సరళం"గా మాట్లాడనూగలరు, అవసరమైతే 'గరళం' కురిపించనూగలరు.

పుట్టిన మూడునెలలకే తల్లిని పోగొట్టుకున్న బాలయశోదను, అయినవారందరు యీసడించారు. నష్ట జాతకురాలని నిర్లక్ష్యం చేశారు. నిరాదరణకు గురైన ఆమెకో బ్రాహ్మణ స్త్రీ స్తన్యమిచ్చి కాపాడింది. పినతల్లి రక్షణలో ఎనిమిదేళ్లు పల్లెలో, బాహ్య ప్రపంచానికి దూరంగా పెరిగిన యశోదమ్మ, అతి కష్టంమీద హైదరాబాదు నగరానికి వచ్చింది.

నాటి కొత్వాల్ రాజాబహదూర్ వెంకటరామారెడ్డిగారిదాతృత్వముతోఆమె హైస్కూల్లో అడుగుపెట్టింది. అక్కడామెను వింతగా చూచేవారట అందరు. పైగా పరదా పద్ధతి వుండేది. హైస్కూల్లో చేరిన యశోద మొదటిరోజు క్లాసుకు వెళ్లగానే, శ్రీ పట్టాభి రామయ్యగారనే ప్రధానోపాధ్యాయులు "లిటిల్ క్రిష్ లాస్ట్ హర్ షీప్" అనే ఆంగ్ల పద్యాన్ని అప్పజెప్పమన్నారట.

### అంగ్రేజీ రాదు

అందుకు యశోద, "నాకు 'అంగ్రేజీ' రాదు" అని అంటే, వెళ్లి ఎండలో నిలబడి కంఠస్థం చెయ్యమన్నారు. తనతో పాటు లలిత, అంబుజ అనేవారు బయట నిలబడి గట్టిగా పద్యం చదువుతుండగా విన్న యశోద మాస్టారి దగ్గరకెళ్లి పద్యం అప్పజెప్పిందట. అది విన్న మాస్టర్ సాబ్ "నాతో అబద్ధాలు చెబుతావా, 'రాదని'? అంటూ నాలుగంటించాడట. తరువాత నిజం తెలుసుకున్న పట్టాభిరామయ్యగారు ఎంతగానో విచారించి, 'ఎ బి సి డి'లు దిద్దించారామెతో. ఆపై డబుల్ ప్రమోషన్ పొందినదామె. ఆమెను ఏకసంథాగ్రాహిగా గుర్తించారు గురువర్యులు.

తన స్కూలు అనుభవాలు చెబుతూ, శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రులుగారు ఆడపిల్లలకు పతివ్రతల కథలు చెప్పేవారని, వాటి ప్రభావం తన జీవితములో ఎంతగానో వుండేదని చెప్పారామె. పదునాలుగేళ్ల వయస్సులో నున్నప్పుడామె కళాశాల సిల్వర్ జూబిలీ సెలబ్రేషన్స్‌లో పరదాను ప్రక్కనపెట్టి, 'వరకట్నం' అనే అంశముమీద తన సహాధ్యాయులైన వసుంధర, సుగుణలతోపాటు మాట్లాడి సంచలనం సృష్టించారు. ఆ తరువాత యువ చిత్రకారుడు శ్రీ పి.టి. రెడ్డిగారామెను వివాహమాడారు. 1948 సెప్టెంబర్ 17వ తేదీన శాంతిస్వరూప్ అనే కొడుకు పుట్టాడు. ఆ బాలుడు ఆరునెలలకే మాటలు నేర్చాడట. ఆ సంతోషం ఆట్టే కాలం నిలువలేదు. చిన్నారి శాంతిస్వరూప్, అమ్మనాన్నలకు 'శాంతి'ని దూరంచేసి, దూరతీరాలకు వెళ్లిపోయాడు. దుఃఖ సముద్రములో మునిగిన యశోదారెడ్డిగారిని ఓదార్చిన వారు తన భర్త పి.టి. రెడ్డిగారే. పుత్రశోకాన్ని మరచిపోవడానికొక వ్యాపకము నేర్పరచాలని తలంచిన రెడ్డిగారామెను ఆలిండియా రేడియోలో

అధికార భాషా సంఘం అధ్యక్షురాలు డా. యశోదారెడ్డి.



గ్రామస్థుల కార్యక్రమాల నిర్వాహకురాలిగా, ఉద్యోగంలో చేర్పించారు. తరువాత ఇంటర్మీడియట్ పాసయ్యారు, ఆపైన బి.ఏ., ఎం.ఎ పరీక్షలు ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులయిన శ్రీమతి యశోదారెడ్డిగారు 1955 జూలై 11వ తేదీ హైదరాబాద్ ప్రభుత్వ స్త్రీల కళాశాలలో తెలుగు లెక్చరరుగా నియుక్తులయ్యారు.

ఆ తరువాత 1969లో "హరివంశాలు-తెలుగులో నాచన సోమనాథుడు" అనే అంశముపై పరిశోధన జరిపారు. అతి తక్కువ కాలములో డాక్టరేటు అందుకున్న యశోదారెడ్డిగారు డాక్టర్ యశోదారెడ్డి అయ్యారు.... ఈమె దాదాపు డజను పుస్తకాలు వివిధ విషయాలపై వ్రాశారు. శ్రీయుతులు సునీల్ కుమార్ ఛటర్జీ, రామరాజు, నారాయణరెడ్డిగారలు ఈమెతోపాటు ఉద్యోగములో చేరినవారే. భారతముపై ప్రత్యేకమైన వ్యాస సంపుటి ప్రచురించారు. వేమన, సోమన, నాచనలతోపాటు నవ్య కవుల రచనలన్నీ, ఆమె ప్రత్యేక శ్రద్ధతో పరించి అవగాహన చేసుకున్నారు.

ఆమె పాఠాలు చెప్పేతీరులో ప్రత్యేకతను సంతరించుకున్నారు.

ఇటీవల 'భారతములో స్త్రీ' అన్న అంశముమీద పుస్తకాలు (రెండు భాగాలు) ప్రచురించారు. ఒకవైపు అధికార భాషా సంఘ అధ్యక్షురాలిగా పదవిని నిర్వర్తిస్తూ, తెలుగులో అనేక విషయాలపై పరిశోధనలు చేస్తూనే వున్నారు. భర్త ప్రఖ్యాత చిత్రకారుడు డా. పి.టి. రెడ్డిగారంటే ఆమె కెనలేని ప్రేమాభిమానాలు గల ఆమె సంపూర్ణ స్త్రీమూర్తి అనటంలో సందేహం లేదు.

-శ్రీమతి వి. విజయలక్ష్మిరెడ్డి

# ఈ వారంలో మీ యోగం

## 15-2-1991 శుక్రవారం మొదలు 21-2-1991 గురువారం వరకు

**మేషం :** ఆదాయంలో లోపం లేదు. శుభ సమయంగా గ్రహించాలి, దూరబంధువులు రానున్నారు. అన్ని విధాలా మేలున్నది. స్థితియందు పెంపు చెప్పవచ్చు. అయినవారి సంబంధమే, తద్వారా ఏదో మేలున్నది. స్త్రీలకు: సర్వవిధాలా మేలే, గ్రహించండి.

**వృషభం :** అధికారమందు వృద్ధి చెప్పవచ్చు. నూతన మిత్రులు చేరనున్నారు. విద్యా వేత్తల సహాయమున్నది. మాటకు విలువ పెరుగుతుంది. చిత్తశుద్ధితో ముందుకు నడిస్తే ఆదాయం, అభివృద్ధి, ధనలబ్ధి, ఆరోగ్యవృద్ధి, యిత్యాదులు. స్త్రీలకు: కార్యానుకూలత, రాజకీయ రంగానుకూలత, ఉద్యోగవృద్ధి.

**మిధునం :** దాయాది వర్గంతో తగాదా రాకుండా చూచుకోండి. చుట్టు ప్రక్కల వారితో గొడవలు రాకుండా చూచుకోవాలి. ప్రజారంగాన అభివృద్ధి కరమైన మార్పు రానున్నది. సాహితీరంగాన కొందరకు సదవకాశాలున్నాయి. స్త్రీలకు: కొందరకు వాహన సేకరణకు అనుకూలం, వారమంతా మేలే.

**కర్కాటకం :** మీరు పత్రికారంగాన శ్రమిస్తారా? అనుకూలమే. కుటుంబానందం, సంతాన, ఉద్యోగాభివృద్ధికై చేసే వ్యవహారాలు యోగప్రదం. అయిన వారి సంబంధం నిశ్చయింపబడుట గమనిస్తారు. చాలకాలంక్రితం రాని మిత్రులు యిల్లు చేరుతారు. స్త్రీలకు: శుభకార్యాలోచనలు.

**సింహం :** వారాంతంలో బాగా ఆదాయం పెరుగుతుంది. ఎంతకాలంగానో రాని పైకం వారాంతంలో అందవచ్చు. ప్రజారంగాన అభివృద్ధికరమైన మార్పు రానున్నదని గ్రహించాలి. ఉత్తముల స్నేహమున్నది. సభామర్యాదయున్నది, గ్రహించండి. స్త్రీలకు: అనుకొన్నదానికన్నా అధికాదాయం. వస్తు సేకరణ. ధనలబ్ధి.

**కన్య :** అధికారమందు వృద్ధి. ధనలోపంలేదు. అప్పులు వసూలు కానున్న సమయం, మరి గ్రహించి ముందుకు నడవండి. చుట్టు ప్రక్కల గొడవలను ఎదుర్కొనుటకు జాగ్రత్తపడండి. యోగదాయకమైన వారంగా గ్రహించి, ఉత్తరాల మూలంగా వచ్చిన వార్తలను గమనించి ముందుకు నడవండి. స్త్రీలకు: అనవసర వ్యవహారాలుంటాయి, బహు జాగ్రత్తగా సంచరించాలి.

**తుల :** చాలాకాలంగా జరుగక యిబ్బంది పెట్టు వ్యవహారాలు ఒక రేవునకు రానున్నవి. మీరు పత్రికాధిపతులా? కొంత మేలు. కళాసాహితీరంగాన ఆశిస్తున్నారా? మేలున్నది. శుభదాయక సమయంగా గుర్తించండి. స్త్రీలకు: ధనలోపం రాదు, మిత్రసమాగమం, కుటుంబానందం.

**వృశ్చికం:** గ్రహించండి అన్ని విధాలా మేలు. విలువగల వస్తువులు సేకరించగలరు. ఆనందదాయకమైన సమయం. ఆదరించేవారున్నారు. సభా మర్యాదయున్నది. పత్రికారంగాన ప్రసిద్ధికై మరీ శ్రమించాలి, గమనించండి. స్త్రీలకు: ఇరుగు పొరుగు తగాదాలు రానున్నవి, గ్రహించాలి.

**ధనుస్సు :** అధికారమందు అభివృద్ధి ఏర్పడనున్నది. అనుకూలించు మిత్రులున్నారు. మాటకు అధిక గౌరవం చేకూరుతుంది. కళా సాహితీరంగాన మేలున్నది. ఇష్టబంధువులు యిల్లు చేరనున్నారు. చుట్టుప్రక్కల వారితో తగాదాలు రావచ్చు, జాగ్రత్త పడాలి. స్త్రీలకు: ధన వసతి, ప్రభుత్వాదరం, అనుకూల మార్పులుంటాయి.

**మకరం :** వారమంతా మేలే. రాశియందున్న రాహు, శని, రవివంటి గ్రహాలు ఏదో విపరీతమైన మేలు మీకు చేయనున్నారు. బహుదూరం వెళ్ళ వలసిన అగత్యం ఏర్పడుతుంది. ఒకానొక గృహ విషయంగా యోగదాయకమేగాని, శ్రమ మాత్రం అధికమని చెప్ప అగత్యంలేదు. స్త్రీలకు: చిత్రరంగాన నటించువారికి సర్వానుకూలత.

**కుంభం :** స్త్రీలకు బహు శుభదాయకమైన సమయం. వస్తు వాహన సేకరణకు అనుకూలం. ప్రజారంగాన వృద్ధికరమైన మార్పు, రాజకీయంగా అనుకూలత, సాహితీరంగాభివృద్ధి, మిత్ర సమాగమం. ధన వసతి యున్నది. అపూర్వ వస్తు సేకరణ గలవారం. గ్రహించాలి.

**మీనం :** అద్భుతమైన వ్యవహారం ఏదో అనుకూలం కానున్నది. ఛాలాకాలం క్రితం వివాదపడినవారు హఠాత్తుగా దాపునకు రానున్నారు. రాజకీయంగా అనుకూలం.. బంధు సమాగమం, గ్రహించండి. స్త్రీలకు: విద్యారంగాన సిద్ధి, వ్యాపారాన అనుకూలత, మిత్ర సమాగమం, మరేంకావాలి.

-విద్వాన్ కోటసత్యరంగయ్యశాస్త్రి





# మణికంఠుడు

## ప్రయాగ రామకృష్ణ

**ఇంతవరకూ సాగినకథ-11:** మహోన్నతమైన దాంపత్య జీవితం గురించి, ధర్మార్ధకామ మోక్షాలను అనుభవించడం గురించి ప్రజలకు తెలియజేయమని తన మానసపుత్రుడైన అత్రిమహర్షిని బ్రహ్మ ఆదేశిస్తాడు. త్రిమూర్తుల వరప్రసాదం మూలంగా ఉద్భవించిన దత్తాత్రేయుడు గాలవ మహర్షి కూతురు లీలాదేవిని వివాహం చేసుకుంటాడు. దత్తాత్రేయుడి శాపకారణంగా లీలాదేవి మహిషిరూపం దాలుస్తుంది. హరిహరుల కలయికతో జన్మించిన మగశిశువును పార్వతి కైలాసానికి తీసుకువెళ్తుంది. పెరిగి పెద్ద వాడవుతున్న ఆ పిల్లవాడ్ని లోకకల్యాణార్థం భూలోకానికి పంపగా రాజశేఖరుడనే రాజు దత్తపుత్రుడిగా స్వీకరించి సకల విద్యా బుద్ధులు నేర్పుతాడు. ఆ పిల్లవాడిని పట్టాభిషిక్తుడిని చేయాలని రాజు నిర్ణయించుకుంటాడు.

మణికంఠుడికి పట్టాభిషేకమనగానే మహామంత్రి మొహం చిన్నబోయింది. ఎందుకో తెలీదుకాని ఇక తన ఆటలు సాగవనిపించింది.

పన్నెండేళ్ళకే సకల విద్యాపారంగతుడైన అగ్నిశిఖను పోలిన మణికంఠుడి తేజస్సు చూచో, గురుకులం నుంచి వచ్చిన పది రోజుల్లోనే ప్రజా సమస్యల పరిష్కారంలో అతను చూపుతున్న చొరవ చూసో....

అడవిలో దొరికింది పిచ్చి మొక్కను కున్నాడు కాని ఊడలు చాచుకుని వూరూ వాడా వ్యాపించేటంత వటవృక్షం అవుతుందని వూహించలేకపోయాడు మంత్రి.

'మహామంత్రీ! నువ్వు పథకం వెయ్యాలేకాని భూగోళం మొత్తం చాపలా చుట్టి చంకలో పెట్టవ్వూ! కుతంత్రాలు పన్నటంలో శకునివి, మణికంఠుడ్ని చూసి చిన్నపిల్లాడిలా బెదురుతావేమిటి?' అమాత్యుల వారిలోని మృగం ధైర్యంచెప్పింది. దాంతో ఆయన మొహం. వెలిగింది.

లేచి నిలబడ్డాడు.

వడి వడిగా మహారాణి మందిరంవైపు అడుగులు వేసాడు.

ఆలోచనలతో సతమతమవుతూ నడుస్తూండగా మణికంఠుడు రాజదంపతులకు

*(గత సంచిక తరువాయి)*

దత్తుడైన కొన్నాళ్ళకే మహారాణి వంశోద్ధారకుణ్ణి కన్న సంగతి గుర్తొచ్చింది మహామంత్రికి. గుండెలమీద బరువు దించినట్టయింది. నవ్వుకున్నాడు.

* * *

మహామంత్రి వచ్చారని తెలిసి అభ్యంతర మందిరంలోంచి బయటకు వచ్చి అతిథిశాలలో ఆయనకు ఉచితాసనం చూపి ఎదురుగా తనూ ఆశీనురాలైంది రాణి.

'మీరు వస్తున్నట్టు కబురైనా లేదు. ముఖ్యమైన కార్యమా?' అడిగింది రాజపత్ని. మంత్రి కాసేపు మౌనం వహించాడు.

గుణగణాల్లో మంథరకు ఏ మాత్రం తీసిపోని వాడు గనుక మహారాణిపట్ల భక్తి నటిస్తూ 'ఏం చెప్పమంటారు? మహారాజుకు మీరంటే ఇష్టం వున్నా, మీరు కుంకుమ పువ్వులాంటి బిడ్డను కానుకగా ఇచ్చినా, కావాలని అడవిలో అనాథగా దొరికిన పిల్లవాడికే పట్టం కట్టబోతున్నారు....' అని ఇంకా ఏదేదో చెప్పబోతుంటే మహారాణి కోపంతో మండిపడుతూ 'చాలించండి. ఏమిటా మాటలు? ఎప్పుడైతే మహారాజు మణికంఠుడ్ని దత్తత తీసుకున్నారో అప్పుడే అతను యువరాజయ్యాడు. పందళరాజ్యంకూడా మణికంఠ ప్రభువు పాలన కోసమే ఎదురు చూస్తోంది. మీరు వెళ్ళి యువరాజు పట్టాభిషేకానికి కావల్సిన ఏర్పాట్లు చూడండి' అంది.

ముఖ్యమంత్రి కదల్లేదు. అక్కడే నిలబడి మరింత వినయం నటిస్తూ 'మహారాణీ! మీ పెద్ద మనసు నాకు తెలియందికాదు. తెల్లనివన్నీ పాలు, నల్లనివన్నీ నీళ్ళూ అనుకుంటారు. మీరంత మంచివారు కాబట్టే పట్టుమని పన్నెండేళ్ళయినా నిండని పసివాడు కూడా మహారాజుని అడ్డుపెట్టుకుని మిమ్మల్ని తేలికగా మోసం చెయ్యగలుగుతున్నాడు' అన్నాడు.

'ఏమిటి మీరంటోంది?' గర్జించినట్టే ప్రశ్నించింది మహారాణి.

'మీ దత్తత కుమారుడు మోసగాడు. మీ పాలిట యముడు. వెన్నుపోట్లు పొడవడంలో, తిన్న యింటి వాసాలు లెక్కపెట్టడంలో ప్రజ్ఞాశాలి. ఇది సత్యం. మణికంఠుడు యువరాజైతే మీకూ, మీ బిడ్డకూ కష్టాలే గతి. అయినా కన్నకొడుకుండగా అడవిలో దొరికిన బిడ్డకు రాజ్యం కట్టబెట్టడం ధర్మంకాదు. ఎన్నో ఏళ్ళుగా మీ ఉప్పు తింటున్న నేరానికి ఈ నాలుగు ముక్కలూ చెప్పక తప్పిందికాదు. మన్నించండి' అని దుర్బోధ చేసాడు.

ఆలోచించినకొద్దీ మహారాణికీ అది నిజమే అనిపించింది. 'మహామంత్రీ! మీరు నా కళ్ళు తెరిపించారు. మీ రన్నట్టు రాజ్యాధికారం చేతికొచ్చాక మణికంఠుడి అసలు స్వభావం బయటపడి నా బిడ్డ ప్రాణాలకే ముప్పు తెస్తే....' నిలువెల్లా వణికింది.

మహామంత్రికి ఆనందమైంది. కాని, అదేమాత్రం పైకి కనిపించనివ్వకుండా 'దత్తుడైనందున మణికంఠుడు మీ ధన ధాన్య వస్తు వాహనాల్లో పాలు పంచుకున్నా ఫరవాలేదు మహారాణీ! రాజ్యాధికారానికి మాత్రం అతన్ని రానివ్వకూడదు. మీకు కొడుకులు కలగలేదని మీరా పిల్లవాణ్ణి చేరదీశారు. సంతోషమే. కాని, మీకు సంతానం కలిగాకకూడా మీ బిడ్డకన్నా నేనే అధికుడ్నని అతను విర్రవీగుతుంటే అది సహించలేక పోయాను. ఇప్పటికీ నాదే తప్పని మీరు భావిస్తే ఈ సేవకుణ్ణి మన్నించి వదిలెయ్యండి'

మనసు మంత్రి
.. ముంది. 'ఇప్పుడేం
ఎ!' అని అడిగింది. ఆ
ంల ఈ ఆపద గట్టెక్కించే బాధ్యత
అన్న అభ్యర్ధన వుంది.

మహారాణీ! నేను మీకు సహోదరు
ి వాణ్ణి. నాది ఒకటే మాట.
క్షిగా పెళ్ళాడినదే భార్య. ఆ
్రా కన్న బిడ్డలే బిడ్డలు. వంశా
ంత రావాలంటే ఆ బిడ్డలే ఆ
ంరువు బాధ్యతలు నిర్వర్తించాలి.
న్న బిడ్డే యువరాజు కావాలి.
అక్కర్లేక ఎక్కడో అడవిలో వదిలి
బిడ్డ, ఏ తల్లి కన్నదో తెలియని
ల గోత్రాలు లేని బిడ్డ పట్టాభిషిక్తు
వీల్లేదు. మీరు తీవ్ర అస్వస్థతకు
ట్లే నటించండి. ముందు పట్టాభి
వాయిదా పడుతుంది. తరువాత
చూద్దాం' అని సలహా ఇచ్చాడు

ంహారాణి విస విస పడక గదిలోకి
ంలంకారాలూ, ఆభరణాలూ తీసేసి,
విరబోసుకుని పాత నూలుచీర
ప్తే పెట్టుకుని లేని బాధ నటిస్తూ
పట్టుక్కూర్చుంది.

మహారాణి భరింపశక్యం గానంత శిరో
నతో నరకయాతన పడుతున్నారని
ంతరంగిక సేవకురాలొకరు పరుగెత్తు
ంటూ వెళ్ళి మహారాజుకు విన్నవించింది.
హుటా హుటిన మహారాజు రాణి వాసా
వెళ్ళాడు. అప్పటికే అక్కడ చాలా
చేరారు. అందరూ విచారవద
వున్నారు. మహారాజుని చూసి
వరూ పక్కకు తొలిగి నిలబడ్డారు.
రాణి శయన మందిరంలోకి వెళ్ళి
హంసతూలికా తల్పంమీద నలిగిన పువ్వులా
పడివున్న మహారాణి నుదుటిమీద చెయ్యి
వేసి 'సఖీ' అని చిన్నగా పలకరించాడు.

మహారాణి కళ్ళు తెరిచి చూసి మహా
ాజుని చుట్టేసుకుని పెద్దగా ఏడ్చింది.
ాజశేఖరుడు భార్యను ఓదార్చి కాసేపు
ను తన గుండెలమీదకు చేర్చుకుని
ువుగా వీపూ, తలా నిమిరాడు.

'ఇప్పుడెలావుంది?'

'భరించలేకుండా వున్నాను ప్రభూ!
ంంతా పోటు పెడుతోంది. ఒళ్ళంతా
ొట్టినట్టు వుంది. సుఖంగా కూచో
విశ్రాంతిగా పడుకోలేను. ఈ బాధ
మీ చేతులలో హాయిగా ప్రాణం
పోయినా మేలే అనిపిస్తోంది. నేనింకా
ఎంతోకాలం బ్రతకనందుకు నాకు చింత
లేదు. నా భీతీ, సంశయమల్లా లేక లేక
కలిగిన నా బంగారుతండ్రి గురించే' అని
రాని ఏడుపు ఏడ్చింది.

'లేదు మహారాణీ! నువ్వు నాకూ,
మా బిడ్డలకూ దూరం కావడానికి వీల్లేదు.
ఉండు. ఇప్పుడే వైద్య నిపుణులకోసం రాజ్య
మంతా దండోరా వేయిస్తాను. నీ శిరోవే
దనం తగ్గించే వైద్యులకు కావాలంటే నా
కోశాగారం యావత్తూ ఇమ్మన్నా ఇస్తాను.
కొంచెం ఓపిక పట్టు. మృత్యువుని కూడా
చిరునవ్వుతో ఎదురుకొన్న మహావీరులు నీ
తండ్రీ తాత ముత్తాతలూ. అలాంటి వీరుల
వంశంలో జన్మించిన నువ్వు శిరోవేదనానికే
తల్లడిల్లి పోవడం తగదు' అని ధైర్యం చెప్పి
అమాత్యుల వారికోసం కబురు చేశాడు.
ఏమీ తెలియని వాడిలా వచ్చి మహారాణి
మందిర ముఖద్వారం ఎదుట నిలబడ్డాడు
మహామంత్రి. అప్పుడే చిన్నారి రాకుమా
రుడు వున్నట్టుండి ఏడవసాగాడు. మహా
మంత్రి వెంటనే వెనక్కి తిరిగి రాకుమా
రుడి కోసం అటూ యిటూ చూశాడు.
ముసలి దాది బిడ్డను గుండెలకు హత్తు
కుని ఓదారుస్తుండగానే శయన మందిరం
లోంచి రాజా, రాణీ ఇద్దరూ కంగారుగా
బయటికొచ్చారు. మహారాణి దాది చేతు
ల్లోంచి బిడ్డను తీసుకుని మహారాజు చేతుల్లో
పెడుతూ 'మన ప్రేమదీపం' వీడికే కష్టం
వచ్చినా నేను భరించలేను. ఇక మీదట
వీడికి తల్లీతండ్రీ అన్నీ మీరే అంది. అలా
అన్నప్పుడు ఆవిడ కళ్ళల్లో నీరు తిరిగింది.
తలవంచుకుని మళ్ళీ తన మందిరంలోకి
వెళ్ళింది.

మహారాజు నిట్టూర్చి, బాధ అణుచు
కుని 'మహారాణి శిరో వేదనం. తగ్గించగల
వైద్య నిపుణులు ఎక్కడున్నా పిలిపిం
చండి. వాళ్ళకు ఏ ప్రతిఫలం కావాలన్నా
ఇద్దాం' అని మంత్రితో అన్నాడు.

'చిత్తం' అని మహామంత్రి అక్కడ
నుంచి నిష్క్రమించాడు.

* * *



మణికంఠుణ్ణితలుచుకున్నప్పుడల్లా గుండె గుభిల్లుమంటోంది. మణికంఠుడికి పట్టాభిషేకం జరగకుండా చూడడం గొప్పకాదు. అతన్ని శాశ్వతంగా వదిలించుకోవాలి. అతను పూర్తిగా లేకుండా పోతేగాని తన మనస్సుకు శాంతి లేదు. పరుగు పరుగున బయటకు వెళ్ళాడు మంత్రి. రాజభవనంలో వంటలు చేసే వాళ్ళని రమ్మని కబురంపాడు.

వాళ్ళొచ్చారు. వందనం చేశారు. 'ఏమిటి ఆజ్ఞ?' అన్నట్టు నిలబడ్డారు.

వాళ్ళందరికీ విలువైన వస్త్రాలు, బహుమానాలూ ఎరగా చూపి 'మణికంఠుణ్ణి చంపాలి' గుట్టు బయట పడకుండా అతను తినే ఆహారంలో విషం కలపండి. భక్ష్యాలలో, మధు పానీయాలలో కాలకూట విషం కలిపి వాడేదోకవిధంగా చచ్చేట్లు చేయండి. అనవసరపు భయాలూ సందేహాలూ వద్దు. మహారాణికి కూడా ఇది సమ్మతమే. రేపు తెల్లవారాక వాడు నా మొహం చూడకూడదు. వాడి శవం నేను చూడాలి, అన్నాడు మంత్రి.

డబ్బుకు దాసోహమన్నారు వంటవాళ్ళు. మహామంత్రి చెప్పినట్టే చేస్తామన్నారు.

## "త్వం"

ఉన్నంతవరకు మనలో క్రూరత్వం
రాదండోయ్ మనలో మానవత్వం!

ఉన్నంతవరకు మనలో మూర్ఖత్వం
పోదండోయ్ మనలోని అంధత్వం!
ఉన్నంతవరకు మనలో కుల మతతత్వం
రాదండోయ్ మనలో సమానత్వం!

ఉండాలేగాని మనలో మిత్రత్వం
మన జోలికే రాదు శత్రుత్వం!
ఉండాలేగాని మనలో సరైన నేతృత్వం
ఏర్పడకపోదు రామచక్కని ప్రభుత్వం!

మరొక్క మాట
వహిస్తే చాలదు నాయకత్వం
ఉండాలి తగిన వ్యక్తిత్వం!

మది అవునో కాదో ఇది నా కవిత్వం
మార్చుకోవాలి ఇకనైనా మన మనస్తత్వం!

- పి. నాగమణి

## మణికంఠుడు

కాని, మర్నాడు సభలో మణికంఠుడి మొహం మహామంత్రి చూడక తప్పలేదు.

ఉగ్రుడై పోయాడు వాళ్ళతో మళ్ళీ య్యాడు మంత్రి.

'మా వల్ల దోషం అన్నంలో విషం కలిపి వడ్డిచ్చాం. పాము కోరలే కరిగించాం. అ హారాయించుకున్నాడు' అని కాళ్ళా వే పడ్డారు వాళ్ళు.

హాలాహలాన్ని కంఠంలో ని మహాదేవర తనయుడితననీ, విషా రంలో రుచిగా స్వీకరించగలడనీ పాపం వాళ్ళకి.

దుష్టుల్నీ, నికృష్టుల్నీ, దు గోముఖ వ్యాఘ్రాలనీ, మేకవన్నె చిటికెన వేలు మీద ఆడించగలడనీ, కాంతపు రాయి కిరణాలు మీద ప భగ్గుమంటామనీ, వయస్సులో పిన్న లోకానికి మణికంఠుడు చేసే కల్పించే ధర్మాలూ ముందు ముందు పెద్ద పీట వేస్తాయనీ తెలియని యకులూ, అజ్ఞానులూ వాళ్ళు. రుణ్ణి హతమార్చగల మరో పథకం మహామంత్రి బుర్ర వేగంగా పని చేస్తే

(ఇంకా ఉ



## రచయితలకి సూచనలు

ఆంధ్ర సచిత్ర వారపత్రికకు పరిశీలనార్థం తమ రచనలను పంపే రచయితలు ఈ కింది సూచనలను గమనించ కోరుతున్నాము

రచనలు కాగితానికి ఒక వైపే సిరాతో లేదా బాల్ పెన్‌తో రాయాలి కాగితానికి రెండు వైపులా రాసి ఉన్న రచనలని పరిశీలించటం జరగదు

పరిశీలనకి పంపే రచనలు కథలైతే 10 అరరావు పేజీలకి మించకుండా ఉండాలి మించినవి వ్యాసాలు 3 అరరావు పేజీలు మించరాదు వ్యాసాలు పంపేవారు వాటికి సంబంధించిన బొమ్మలు లేదా ఫొటోలు జతపరిచి పంపటం అవసరం

రచనలు స్వంత రచనలై ఉండాలి అనువాదాలు, అనుసరణలు, కాపీలు పంపరాదు ఆ మేరకు రచయిత(త్రి) హామీ పత్రం రాసి సంతకం చేసి రచనతో పాటే పంపాలి

రచనలు పూర్తిగా తెలుగు లిపిలోనే రాసి ఉండాలి రాత ప్రతి మీద రచయిత(త) పూర్తి చిరునామా స్పష్టంగా ఇంగ్లీషుతో సహా రాయాలి

కథల పరిశీలనకి 1-2 నెలలు, నవలల పరిశీలనకి కనీసం 6 నెలల వ్యవధి పడుతుంది పరిశీలన అయిన తర్వాత ఏ విషయం ఆయా రచయిత(త్రు)లకి తెలియ చేయటం జరుగుతుంది ప్రచురణకి స్వీకరించని రచనలని తిప్పి పంపకోరువారు తమ రచనతో పాటే స్వంత చిరునామా కల, తగినన్ని తపాలా బిళ్ళలు అతికించిన కవరు జత పరచి పంపాలి లేకపోతే వాటిని తిప్పి పంపటం సాధ్యం కాదు రచనలు తిప్పి పంపే విషయంలో తగిన జాగ్రత్త తీసుకోటం జరుగుతుంది కాని పోస్టులో పోయే వాటి విషయంలో మేము బాధ్యతని స్వీకరించలేము వాటిపై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలకి అవకాశం లేదు

రచనలు పంపిన వారు తమ చిరునామా మారిన సందర్భంలో వెంటనే ఆ విషయాన్ని మా కార్యాలయానికి తెలియ చేస్తూ ఒక కార్డు రాయటం అవసరం.

ఉత్తరాలు తదితర పాఠకుల శీర్షికలకి రాసే వారు కూడా తమ పేరు, పూర్తి చిరునామా ఇవ్వాలి రచనలు పూర్తిగా తెలుగు లిపిలోనే ఉండాలి. లేకపోతే వాటిని పరిశీలించటం జరగదు

పరిశీలనకి పంపే రచనలని "సంపాదకుడు, ఆంధ్ర సచిత్రవారపత్రిక, గాంధీనగరం, విజయవాడ - 520003" అనే చిరునామాకి పంపాలి కవరు పైభాగంలో శీర్షిక పేరు రాయటం మంచిది

- సంపాదకుడు